శ్రీ సాయీ నిలయ ప్రచురణము -8

# శ్రీ మద్భగవద్గీతామృతము

## (మూలము - తెనుఁగు పద్యము)




రచయిత:

**కీ.శే. శ్రీ బాపట్ల హనుమంతురావు పంతులుగారు**

ప్రచురణ కర్త

**బాపట్ల వేంకట పార్థసారథి**

శ్రీ సాయీ నిలయమ్,

చెరువు (P.O ) PIN 522 113.

గుంటూరు జిల్లా.

ప్రథమ ముద్రణము 1929 .. ............... . . . . . ... 1000 ప్రతులు
ద్వితీయ ముద్రణము 1978 ..... . . ..... ...... . . . 1000 ప్రతులు
తృతీయ ముద్రణము 2001 . . . . . ... ...... . .. ... 1000 ప్రతులు

ఎవఁడు సకలంబు నందు వీక్షించునన్ను
నెవఁడు నాయందు సకల మీక్షించుచుండు;
జగతి వానికి నేఁబరోక్షంబు నొంద,
వాఁడు నాకుఁ బరోక్షంబుఁగాడు; పార్థ!

మూల్యం రూ. 53/-

# ఆశీస్సులు
( ప్రథమ ముద్రణములోనివి)

## శ్రీమత్పరదేవతాయైనమః

మీ పుస్తకమును స్థాలీపులాక న్యాయమునఁ జదివితిని. ధార పరిశుభ్రముగనే యున్నది. తెలిగింపు మూలమున కనుసరించునదిగా నున్నయది. లక్షణదోషములుగాని, వ్యాకరణ దోషములుగాని లేవు. సర్వవిధముల రమణీయముగ నున్నయది. భగవంతుఁడు మీకింకను నిట్టి పరమార్థ ప్రయోజకములగు గ్రంథములను రచించుటకుఁ దగిన యాయురారోగ్య భాగ్యములను ప్రసాదించుఁగాక యని వేడుచున్నాఁడను.

కడియం,
20-01-30

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.
శతావధాని.



I acknowledge with thanks the receipt of your **"SRIMATH BHAGAVADGITAMRUTAM".** I found it interesting and I trust it will enjoy a large circulation.

GUNTUR,
8-01-30.

(Sd) D.S. REDDI, Esq, B.A, (Oxon),
District Educational Officer.

# శ్రీ గణేశాయనమః

శ్రీ ర్భూయాద్బాపట్ల హనుమంతరాయ బాలకవయే.

అందచందములులేని యసద్గ్రంథములను జూచి సంతసించుటకంటె నత్యంత శ్రద్ధాస్తిక్యములతో నీచే రచింపఁబడిన **శ్రీ భగవద్గీతామృతమను** సద్గ్రంథమును నేనాదరముతో నందికొని స్థాలీపులాకన్యాయమున నచ్చటచ్చట సవిమర్శముగాఁ జూచి యానందించితిని. నేన కాదు, ఇతరులు కూడ నిట్లే యానందింతురని తలంచెదను. ఆహా! ఏమి? లోకములో "**భారతఃపంచమోవేద**" యని పెద్దలచే నెన్నఁబడిన సంస్కృత మహాభారతాంతర్గత శ్రీమద్భగవద్గీతామృతమను సద్గ్రంథమును బ్రతి శ్లోకమున కర్థసందర్భముల విడువక యీ బాల్యదశలో నాంధ్రీకరించుటకును, అంతరాయ రహితముగ సమాప్తి నొందించుటకును, ముద్రింపించి ప్రకటించుటకును, నీకు నిట్టి యపారమతిఁ గలుగఁ జేసిన పురాణ దంపతులగు నప్పార్వతీ శంకరులకు నాయానందపూర్వక నమస్కృతుల నొనరించు చున్నాఁడను. ఇట్టి సద్గ్రంథరాజము నాంధ్రీకరించుటకు నీ జన్మాంతర సుకృతంబును గారణంబుగ నెంచెద. ఈ గ్రంథకర్తృయశంబును, నీగ్రంథరాజంబును, ఆచంద్ర తారార్కము వర్ధిలుగాత.

బాపట్ల,
29-11-29.

మంత్రవాది వేంకటశాస్త్ర్యాశయ ఇత్థమ్
రిటైర్డు సీనియరు తెలుగు పండితుడు,
బి. హెచ్. స్కూలు, బాపట్ల.

# శ్రీరస్తు

శా॥ బాపట్లాన్వయ దుగ్ధసింధుశశికల్పా! యోహనూమంతరా
యా! పూతాశయ! తావకాంధ్రిత సు గీతాఖ్యామృతానూనధా
రాపానమ్మున సంత సించితిని సర్వశ్రోత్రపేయమ్ముగా
నీపాత్తమ్ము యశమ్మునింపెడును క్షోణీభాగమందెంతయున్.

బాపట్ల
2-12-29

ఇట్లు భవచ్ఛ్రేయోభిలాషి
ఇనుపకుతిక శంకరశాస్త్రి,
శిరోమణి,

---

# శ్రీరస్తు

ఆర్యవర్యా!

తమరు రచించిన పద్యములతోఁ గూడ ముద్రింపించి నాకుఁ బంపిన **శ్రీభగవద్గీతామృత** గ్రంథమును గార్యభారముచే స్థాలీపులాకన్యాయముగాఁ దిలకించితిని. కవికుల శిరోమణియగు శ్రీ తిక్కనయజ్వ యేకారణముననో తెనిఁగింపని యీ గ్రంథరాజమును పమురాంధ్రీకరించుట పరమాద్భుత సంతోషదాయకమగుచున్నది. ఈ గ్రంథ మితర గ్రంథములవలె భావానుసారముగాఁ దెనిఁగించుట యెంతవారికిని నతిదుర్ఘటమను విషయ మెల్లవారికిని విశదమే. ఇట్టి దీనిని బ్రతిశ్లోకమునకుఁ దగునట్లు పద్యములను వ్రాయుటలోఁ దమ లొనర్చిన పరిశ్రమ మింతయన నలవి కాకున్నది. శ్రీ భాష్యకర్తలచే బహుశః ప్రతిపాదితమ్మై, పండితసార్వభౌములచే శ్లాఘనీయంబై, మహాయోగివర్యులచే ననుభూత రసాస్వాదంబై, సర్వ లోకపావనంబగు నిమ్మహాగ్రంథమందలి భావార్థసారంబు లెఱుంగ నాబోంట్ల కలవి కాకుండుట సహజంబ. ఇట్టి యుపనిషత్సారంబు నెంతయో ప్రయాసపడి సలక్షణ పద్యరూపమున నాంధ్రీకరించి, గౌరవభావంబున నాకొసంగినందుల కేనెంతయు గృతజ్ఞుడ ఇట్టి భగవత్కైంకర్యమునఁ బాల్గొన్న తమకుఁ జిదానందమయుఁడగు నా శ్రీకృష్ణదేవుండు చిరాయురారోగ్యాదుల నొసంగి, జ్ఞాననిష్ఠం బ్రసాదించి, భవజ్జన్మంబును సఫలంబుఁ జేయుఁ గాతమని యే నా సర్వేశ్వరుం బ్రార్థించువాఁడ.

ఇట్లు,
బుధజనవిధేయుడు
**ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రి,**
**శతావధాని.**

శ్రీ

ఈ పుస్తకము నక్కడక్కడఁ జదివితిని. భాష సులభముగనుండి పాఠకుల కుపకారక మగుచున్నది. ధారయందు సయితము గొగ్గులులేవు. తఱచు మూలపదములు చేకొనబడియుండుటంజేసి యపార్థములకుఁ బెక్కుదారులు గలుగుట కవకాశము లేదు.

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి,
శతావధాని
(సంస్కృతాంధ్రసాహిత్యోపన్యాసకుఁడు)

ఆంధ్రగీర్వాణ విద్యాలయము,
కొవ్వూరు,
29-11-29



మీరొసఁగిన "**గీతామృతము**" నక్కడక్కడఁ జూచితిని. శ్లోకార్థము తేటపడునటుల ద్రాక్షా పాకమున రచించిన యీ పద్యకావ్యము చాతుర్వర్ణముల వారికత్యంతోపయోగముగ నున్నది. ఆధ్యాత్మిక విద్య నుపదేశించు నీ భాషాగ్రంథ మాంధ్రులెల్లరకుం గడునాదరణీయము.

కొండముది నరసింహం

అప్పికట్ల,
5-12-29



కం. భగవద్గీతామృతమను
నిగమాంతరహస్యమీవు నిపుణత్వమునన్
సుగమాంధ్రభాషఁబలుకుట
జగదీశ్వరు కరుణగాక సామాన్యంబే.

ధూపాటి కొండమాచార్యులు

చీరాల,
9-12-29.



గీ. గోపికలు మెచ్చ మురళిని గోపబాలుఁ
డాగమంబులఁబాడిన యట్లు నీవు
పండితులు మెచ్చఁ దెనుఁగునఁ బాడినావె
యాగమాంతరహస్య గీతామృతంబు.

బందా ఆదినారాయణ

చీరాల
9-12-29



మన ధర్మగ్రంథములన్నిటిలో నుత్తమమగు "**భగవద్గీత**" సంస్కృతములో నుండుటచేత సంస్కృత భాషాభ్యాసము లేనివారు పఠించుట యసాధ్యముగ నున్నది. కాన దానిని౯ దెలుగున ననువదించి విషయమును సుబోధకము జేయసమకట్టిన శ్రీయుత **బాపట్ల హనుమంత రావుగారి** ప్రయత్నము శ్లాఘ్యము. ఈ కాలమున ధర్మ గ్రంథములందు శ్రద్ధ౯ గల్పించుటయు నత్యవసరము. విషయ కాఠిన్యమునను బట్టియు సాంప్రదాయ విశేషార్థములను బట్టియు భగవద్గీతానువాదము దుస్సాధ్యము. కావున నా గ్రంథరాజమును దెలుఁగున౯ బద్యాత్మికముగ రచించి కృతకృత్యులైన శ్రీహనుమంతరాయలు ఆంధ్రజనుల కాదరపాత్రులనుటకు సంశయము లేదు.

గుంటూరు,
15-12-29

**కొండ వెంకటప్పయ్య.**

---

శ్రీరామా,

మీ యాంధ్రీకృత "**భగవద్గీతామృతము**"ను స్థాలీపులాక న్యాయముగ౯ జదివి కడుంగడు సంతసించితిని. కడుమనోహరమగు సులభశైలిని రచియించి మీరు ఆంధ్రుల కృతజ్ఞతలకు౯ బాత్రులైతిరి. గ్రంథగౌరవమున కించుకంతయైన కొఱఁత గలుగకుండ శైలి సులభమై ద్రాక్షాపాకమున నలరారుచు రుచులీనుచున్నది. మీ ప్రాక్తనపుణ్య విశేషము చేతనే యిట్టి పరమపవిత్ర గ్రంథము నాంధ్రీకరించుట మీకు సమకూరినది.

మహారాణీపేట,
విజయనగరము.

**అడిదము రామారావు.**
Senior Telugu Pandit
Maharajah's College. Vijayanagaram

---

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

మ. కవిరాయా! హనుమంతరాయ! విను సాకల్యంబుగా మేము నీ
దవు గీతామృత పానమున్‌జలిపి యత్యానందవారాశిలో
న విశేషంబుగ నోలలాడితిమి: దానన్ వ్యాసతాత్పర్యమున్
రవయేన్ బొల్లిపకుండ౯జెప్పితివి ధీరవ్రాతముల్ మెచ్చగన్.

మ. పదమాధుర్యము, నర్థగౌరవము, భావస్ఫూర్తియున్, వాక్యసం
పద, ధారాకలనావిశేషము, లసత్ప్రజ్ఞాప్రభావంబు, స
మ్మదమై సజ్జనగేయమై, సరసమై, మాన్యంబునై, దివ్యమై,
విదితంబౌనటు కైత౯జెప్పితివి నీవృత్తంబు సామాన్యమే.

సీ. వేదోక్త కర్మల విధ్యుక్తముగఁ జేయఁ బనిలేదటంచును బలుకువేళఁ
క్రొత్తక్రొత్తమతాలకుఁ బఱుగులెత్తుచు నాగమంబులఁ దూలనాడువేళ
వ్యాసతాత్పర్యంబు ద్వైతభావంబని దుర్వాదములు సేయఁ దొడఁగువేళ
స్మార్తసిద్ధాంతంబు మఱచి స్మార్తులు పర ధర్మములను జొరఁ దలఁచువేళ

గీ. సంస్కృతమ్మునఁ జదువఁ గోర్కిచననివేళఁ
బ్రవిమలాద్వైతభావంబు పాదుకొలిపి
స్మార్తసిద్ధాంతమును బ్రోవఁ జాలినావు
మహితవిజ్ఞాన! శ్రీ హనుమంతరాయ!

మ. స్వమతాచార పరంపరాకలితమై సంభావ్యమైనట్టి ధ
ర్మములన్ మిక్కిలి ప్రోత్సహించు కవితాగ్రంథమ్ములన్ వ్రాసిచే
శము సేవింపఁ జిరాయువున్ సుఖము నైశ్వర్యంబుగల్పించి చి
త్త మెలర్పన్ నినుఁబ్రోచు నెల్లపుడు రాధాకృష్ణదేవుండొగిన్.

ఇట్లు బుధజనవిధేయులు.

**అబ్బరాజు వీరరాఘవశర్మ సాహిత్య సరస్వతివిద్యార్ణవ,**
**అబ్బరాజు సూర్యనారాయణ శర్మ, వైద్యవిద్యాన్,**
**ఆశుకవి శతావధానులు, ఆదిపూడి సోదరకవులు.**

---

## శ్రీమత్పరదేవతాపతయేనమః

సీ. లేమావి చివుళుల లెస్ససాపడి మింటఁ బెంటికోయిల గూయు విధముఁద్రొక్కి
పనసతొనలు నంటిపండ్లు తేనియఁ జొన్పి పచనంబుఁ చేసిన భంగి నడిచి
అరపైటనిమిడి యీడరిన తెల్గుపడంతి చందోయి-చందమందందు నిల్పిం॰
నెలబాలు చెలిమి కఱ్ఱులు సాచిడిగిన వేలుపుటేఱు నిరసించు నెపముఁ జూపి.

గీ పలుకు, రసమును, భావంపుఁ బటిమ ధార
లొకట నొడఁగూరె జగములనుద్ధరింప
యాదవేంద్రుండు వోసిన యమృతమౌట
నిలను సత్కీర్తి నియ్యది వెలయుఁ గాత!

బాపట్ల.

ఇట్లు బుధవిధేయుఁడు,

**పెళ్ళూరు శ్రీనివాసరంగేశ్వర శర్మ**

# ఆసీస్సు

(ద్వితీయ ముద్రణములోనివి)

గుంటూరు
3-11-78

ఉభయ భాషాప్రవీణ, వేదాంతపారీణ,
కవిశేఖర విద్యానాథ, కవితామహేశ్వర,

**శ్రీ మిన్నికంటి గురునాథశర్మ**

ఉభయభాషా ప్రవీణ పట్టోజ్జ్వలుఁడయి
పాఠశాలల సీనియర్ పండితుఁడయి
నైకకృతులు రచించిన ధీకుశలుఁడు
మాన్యచరితుండు మా హనుమంతరావు.

గీతభావమెన్నొ రీతులఁగనిపెట్టి
పొల్లువోవకుండఁ బొదిగినాఁడు
కలికమునకుఁ గూడఁ గానరాదు నెరసు
మంచిపాకమున గమించెను గృతి.

గీతకు నేటి కెందఱొ లిఖించిరె యాంధ్రమునందుఁ బద్యముల్
నూతన కావ్యకల్పనకు నూల్కొన కియ్యదె యేల వ్రాసె నా
చేతము నందెలర్చిన విశిష్టపుజ్ఞానము సానఁబెట్ట నీ
రీతిఁ గడంగినాఁడని యెఱింగితి వేంకట పార్థసారథీ!

నాయనగారి గ్రంథము నొనర్చితి రెండవ ముద్రణంబు. భేష్!
చేయఁగఁ దగ్గ కార్యమును జేసి పితౄణము తీర్చికొంటి, నా
రాయణమూర్తి నీకును నిరంతర సౌఖ్యము భాగ్యవృద్ధి దీ
ర్ఘాయువు నిచ్చి బ్రోచును గుణావధి వేంకట పార్థసారథీ!



# ప్రచురణకర్తకు ఆశీస్సులు:

రాయపూర్

మధురకవి:
శ్రీ మూలా పేరన్న శాస్త్రి,

చ|| జనకుని యాజ్ఞ రామనరచంద్రుడరణ్య వాసమున్
దొణకక జేసి మేల్గనియె దొల్లి; సమస్త మహీశ సంఘముల్
దనకు వశంబు చేసికొనె ధర్మతనూజుడు రాజసూయమున్
జనకుని యాజ్ఞచేఁ జలిపె చక్కగ వారల బోలె తండ్రి యా
జ్ఞను గొని గ్రంథ ముద్రణము సల్పుచు ధన్యతనంది నా వహో!

చ|| దినమున సూర్యకాంతి నలు దిక్కుల తాఁ బ్రసరించి చీకటి
న్నణచును. రేయి చంద్రికలు హర్షము కల్గగ జేయు, నిట్లు నీ
వనయము తండ్రి గ్రంథములు నచ్చొనరించి తమంబు ద్రోచుచున్
జనకుని కీర్తి నాంధ్రభువి సర్వము నింపితి, పార్థ సారథీ!

చ|| వినుమిది, యశ్వమేధమును వేడుక నెట్టులొ చేయవచ్చు, నూ
తనముగ గ్రంధ ముద్రణము తానొనరించుట కష్ట సాధ్య, మీ
వును నిపుణత్వ మేర్పడగ పొల్పున ముద్రణ చేసి, పంచి, నీ
కనువుగ నిల్చి పోషక మహాశయులెల్లరు హర్ష మొంద, నీ
కనిశము సాయినాథుడు దయామయుడిచ్చుత! సర్వ సౌఖ్యముల్.





# ప్రశంస

DR గోటేటి వెంకట చలపతి రావు, కాకినాడ.

"**శ్రీ భగవద్గీతామృతము**" పునర్ముద్రణ జరుగుచున్నది. 'ప్రశంస' వ్రాసిపంపుమని మా అన్నగారు **శ్రీ బి.వి. పార్ధసారథి** గారు కోరగనే, అది శ్రీ సాయీశ్వరుని దివ్య సంకల్పమని భావించి వ్రాయ నుపక్రమించితిని.

పూజ్యులు శ్రీ **బాపట్ల హనుమంతరావు గారు** రచించిన గ్రంధములలో యీ భగవద్గీతా మృతము ఆణిముత్యమని చెప్పవచ్చును. మన పూర్వ జన్మ విశేషముచే ఆ అమృతము గ్రోలుటకు మనకందరకు అవకాశము లభించినది. ఎందువలననగా సామాన్య మానవునకు భగవత్ప్రాప్తి ( భగవద్దర్శనం) కలుగుటకు యీ గీతలో శ్రీకృష్ణ పరమాత్మ అనేక సులభోపాయములు సూచించినారు. ఎవరి మనస్సుకు నచ్చిన పద్ధతి వారు యెన్నుకొని ఆచరించవచ్చును.

**మొదటి ఉపాయము**: నిరంతర భగవన్నామ స్మరణము. మొదట్లో యిది కష్టతరమయినను అభ్యాసముచే సాధింపవలెనని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో మనకుపదేశము చేసి యున్నారు. మనస్సును క్రమముగ విషయవాంఛల నుండి మరల్చి భగవన్నామచింత నామృతమును గ్రోలుటకు ప్రోత్సహించవలెనని భావము.

**రెండవ ఉపాయము** . 11 అధ్యాయము - 55 వ శ్లోకములో స్పష్టముగా వివరింపబడినది. ("మత్కర్మ.... పాణ్డవ!") అర్జునా! ఎవరు నా కొఱకే కర్మలు చేయునో (లేక నా సంబంధము-దైవ సంబంధమైన) కార్యములనే చేయునో, నన్నే పరమ ప్రాప్యముగా నమ్మి యుండునో, నాయందే భక్తి గల్గియుండునో, సమస్త దృశ్య పదార్థములందును సంగమును (ఆసక్తిని-మమత్త్వమును) విడిచి వేయునో, సమస్త ప్రాణులందును ద్వేషము లేక యుండునో అట్టివాడు నన్నుపొందుచున్నాడు.

**మూడవ ఉపాయము : నిష్కామకర్మ** - సామాన్య గృహస్థులు నిత్య సంసారిక బాధ్యతలు నెరవేరుస్తూ, నిత్య కర్మలు చేసుకుంటూ కూడా ఆ భగవంతుని చేరుటకు - పరమాత్మ అనుగ్రహము పొందుటకు, యీ భగవద్గీతలో ఉదహరించిన సులువైన పద్ధతి నిష్కామకర్మ

ప్రతి మానవుడు ఉదయము నిద్రలేచినది మొదలు రాత్రి పరుండు వరకునూ అనేక కర్మలు చేయుచునే యుండును. తాను చేయు సమస్త కర్మలను భగవానునికి అంకితమొనర్చి - అహంభావము కాని-కర్తృత్వ బుద్ధిగాని లేక అసక్త బుద్ధితో (ఫలాపేక్షలేకుండా) కర్మల నాచరించువానికి ఏ విధమైన పాపము అంటనేరదు.

ఫలాపేక్ష లేక, ఈశ్వరార్పణ బుద్ధితో అసక్తముగా కార్యము లాచరించినచో కర్తకు వానిచే బంధ ముదయించదు. సంగమే (attachment) బంధమునకు కారణము. అసంగమే మోక్షమునకు హేతువు. కాబట్టి బంధ రాహిత్యమునకై - కర్మలను అనాస్తకముగా, నిష్కామముగా, భగవదర్పణ బుద్ధితో ఆచరించుటయే నిష్కామకర్మ - అదియే భగవదనుగ్రహమునకు హేతువు అని కృష్ణపరమాత్మ ఐదవ అధ్యాయములో వచించు చున్నారు.

సామాన్యముగా మనము చేయు కర్మలన్నియు భగవంతుని పరముగా ఫలాపేక్ష లేకుండా చేయుటవల్ల, ఆ కర్మలన్నియు ఒకయజ్ఞముగా మారును. ఈ విషయమును శ్రీ బాపట్ల హనుమంతరావు గారు

"నాకుగా కర్మముల సల్పి నన్ను పరమ
గతి యనుచు నమ్మి మద్భక్తి గలిగి, సంగ
మమును విడనాడి, సర్వభూతములవైర
ముడుగు నతడు తుదకు నన్నెబడయు-విజయ!" అని వ్రాసిరి

మనకందరకును ఆ అమృతాన్ని పంచినారు. దీనిని గ్రోలి-జీర్ణించుకొని, ఆచరణలో పెట్టిన వానికి పునర్జన్మ యుండదనుటలో సందేహము లేదు.

అంతటి మహాభాగ్యము మనకందించిన **పూజ్యులు శ్రీ హనుమంతరావు గారు** కారణజన్ములు.

**నాల్గవ ఉపాయము** : భక్తిభావము భగవంతుని పాదారవిందములను ప్రేమించుటే! ఈ ప్రేమ పద్ధతి బహుళ వ్యాప్తిని పొందినది. దీనినే ప్రేమ (Love) అను శబ్దములో నిరూపించినారు భగవాన్

"ధ్యానేనాzత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే" (13-25)

ఈ నాల్గు మార్గములద్వారా ఆత్మ సాక్షాత్కారము లభించునను గీతా వాక్యము స్మరణీయము.

ఈ **భగవద్గీతామృతమును** మనసారా ఏకాగ్రతతో చదివి శ్రీకృష్ణ పరమాత్మ సూచించిన మోక్షసాధనోపాయములతో వారి వారి మనస్సులకు నచ్చిన పద్ధతిని యెంచుకొని, ఆచరణలో పెట్టి తరించుదురుగాక!

శ్రీ సాయి ప్రభువు కోరు **(1) నిష్ఠ (2) సబూరి ( ఓర్పు)** అను రెండు కానుకలను దక్షిణగా వారి పవిత్ర పాదములకు సమర్పించి సంపూర్ణ శరణాగతి చేసుకొని శ్రీ సాయి నాథునికి సాష్టాంగ వందన ప్రణామములు అర్పించుకొందము.



# ప్రశంస

దాలిపర్తి నారాయణరావు
Advocate, Hyderabad.

శ్రీరస్తు

1. మహామహులు, మనదేశీయులే కాక పర దేశస్తులును, భగవద్గీతామృతమును గురించి పలువ్యాఖ్యలు వ్రాసిరి. దైవాంశ సంభూతులు శ్రీమధ్వాచార్యులు, రామానుజాచార్యులు, శ్రీ శంకరాచార్యులు వారలకు తోచిన విధముగా వ్యాఖ్యలు వ్రాసిరి.

శ్రీరామకృష్ణ పరమహంస శ్రీ శంకరాచార్యుల వారివి అనుసరించినట్లు తెలియచున్నది. ఈ జగత్తులో కోట్లాది జీవరాసులు పుట్టుచు, గిట్టుచున్నవి. ఈ జనన మరణ కార్యమేమి? ఈ చరాచరములను శాసించువారెవరు? శ్రీ శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతము నుపదేశించినారు. జగత్తు- జీవులు- పరమాత్మ వేరు వేరు కాదు. తాను ఎచటినుండి వచ్చెను? మరణానంతరమెచటకు వెళ్ళును? భగవానుడున్నాడా?-ఎవరు? జీవుడు - జగత్తు- పరమాత్మ ఒక్కరే! ఇది దైవలీల. భౌతిక జీవితమునకు సంబంధించిన అజ్ఞానము తొలగించుటకు - మానవజాతి సముద్ధరణకు భగవానుడు వ్యాసమహర్షిచే భగవద్గీతను పలికించెను. జీవుడు నేను- నాది- నావారను భ్రాంతిని పడి, తాను వేరు - పరమాత్మ వేరను భావనలోపడును. శాశ్వతమైనది- సత్యమైనది ఆత్మ పరమాత్మ అంశమని, అంతటను నిండియున్నదని తెలుపునది **భగవద్గీతామృతమే**.

2. నరుడు- నారాయణుడు - ద్వాపరమున అర్జునుడుగ, కృష్ణ భగవానుడుగ అవతరించిరి. కురుక్షేత్ర సంగ్రామ సమయమున నుభయపక్షముల అక్షౌహిణలను వీక్షించి, పితృ, పితామహ, గురుమిత్ర, హితాదులను హతమొనరించి, రాజ్యమేలుటకంటె, బిక్షా జీవనమే మేలని, యుద్ధ మొనరింపనని పలికిన ఫల్గునకు పరమాత్మ చేసిన బోధ యీ భగవద్గీత జనన మరణములు సహజమని, చంపువారు - చచ్చువారు - నామమాత్రులని, సర్వమ తానే కర్తగా నిర్వర్తించెదనని - తుదకు యెల్లజీవులు తన యందే ఐక్యము చెందున కృష్ణభగవానుడు బోధించి, అర్జునుని యుద్ధమునకు సంసిద్ధు నొనర్చెను.

3 భగవద్గీత 1 నుండి 6 అధ్యాయములు. కర్మ యోగముగా 7 నుండి 12 భక్తియోగముగ 13 నుండి 18 జ్ఞానయోగముగా వివరముగా కృష్ణభగవానుడు విశదీకరించెను. నేను కర్త అను భావమును పూర్తిగా వీడి, యే కార్యము చేయునప్పుడైనను నన్నే తలచి, నన్ను నవి నాకుగా సలిపి, నాకు సమర్పణచేసి, నన్నే సర్వమునకు కర్తనని భావించి, నిష్ఫలాపే కర్మములొనరించుమని అర్జునునకు ఆదేశించెను, శ్రీ కృష్ణ పరమాత్మ.

**కర్మయోగము:** జీవి పుట్టినదాది తుదివరకు నేదొక పని చేయవలయును. న్యాయసమ్మత లోకహితముగా, అభిమానము - అహంభావము వీడి, ఫలాపేక్షను త్యజించి, భగవం

కొఱకు అను భావమున చేసిన ధర్మ బద్ధమగును. అర్జునుడు క్షత్రియుడు. యుద్ధము స్వధర్మము అయినను "నేను బలవంతుడను-శత్రువుల బరిమార్చెదను అను అహం వీడి, రాగద్వేషములకు అతీతుడై, అంతయు పరమాత్మకే చెందును అను విశ్వాసముతో యుద్ధము చేయుము. నీవు చంపుట-వారు మరణించుట లేదు - అంతయు నేనే కర్తనై చేయుచున్నాను" అని విశ్వరూపము ప్రదర్శించి కృష్ణ భగవానుడు అర్జునుని అజ్ఞానము నడంచెను. "యదాయదాహి..... సృజామ్యహమ్" అని వక్కాణించెను.

**5. భక్తియోగము:** శ్రీ హనుమ - నారద-తుంబుర-మీరాబాయి-రామదాసాదులు అనన్యభక్తిలో మునిగితేలియాడినారు. ఆదర్శప్రాయులైరి. అనన్య భక్తి పిచ్చి వారి ప్రవర్తనగా దోచును. ఆ అమృత ప్రేమ భక్తిలో వారేమి చేయుచున్నారో వారెఱుగరు. దైవమునందే మనసు లగ్నమై తన్మయత జెందుదురు. తమ చుట్టు యేమి జరుగుచున్నదో తెలియని స్థితిలో చరించెదరు. కీ.శే. శ్రీ బాపట్ల హనుమంతరావు గారు చెప్పినట్లు "నన్ను జూచు వాడు తన్ను దామఱచును- తన్ను జూచువాడు నన్ను మఱచు...." అదియే భక్తి యోగము

**6. జ్ఞానయోగము:** భక్తియోగము జ్ఞానయోగమునకు దారితీయును. ప్రతి వ్యక్తి ఒక గురువు వద్ద శిష్యరికముజేసి, నిష్ఠ సబూరి (ఓర్పు-విశ్వాసము)లతో గురువే దైవముగా తలంచి జ్ఞానమార్జించి మోక్షము పొందగల్గును. జ్ఞానయోగము వలన సంచిత ఆగామి కర్మలు నశించును. జీవుడు ముక్తి సమార్జించి పరమాత్మనుజేరును.

కావున జీవుడు పరమాత్మను స్మరించుట, విద్యుక్త ధర్మము- సక్రమముగా నిర్వర్తించుట దేహాభిమానము వదలుట - ప్రతికార్యమునందును దైవమును తప్ప యితర మెరుగని రీతి ఆధ్యాత్మిక పరివర్తన జెంది తుదకు పరమాత్మయందైక్యము చెందుట. నాకు తెలిసిన భగవద్గీతా సారాంశమిది.

<u>స్వవిషయము:</u> కృష్ణా జిల్లా మచిలీపట్టణమున విద్యనభ్యసించి, 'లా' డిగ్రీ గడించి నలుబదేండ్లు. న్యాయము-ధర్మము రెండు నేత్రములుగా ప్రవర్తించి, న్యాయవాదిగా సక్రమ సంపాదనతో సంతృప్తిజెంది, భార్యావియోగము దరిమిలా, కుమారులవద్దకు హైదరాబాదు చేరి, బిడ్డలతో, బిడ్డల బిడ్డలతో కాలము గడుపుచూ, 75 యేండ్ల వయస్సున శ్రీ సాయినాథునియందు భక్తితో, ఆ ప్రభువు కృపతో కోపతాపాదులను, ఆయన పాదములవద్ద వదలి, త్రికరణ శుద్ధితో శ్రీ సాయిబాబాను ప్రార్థిస్తూ, వారి బోధలను పాటించుచున్నాను. శ్రీ సాయినిలయ ప్రచురణల జీవిత సభ్యుడనై యీ ప్రశంసా వాక్యములు వ్రాయగలిగితిని.

సమస్త లోకాస్సుఖినో భవంతు.



# ప్రశంస

కేశిరాజు నరసింహారావు, M A . BL, B.Ed.,
Rtd. D.P.O A A O
R.R Lions Eye Hospital, Palakollu

పూజ్యులు శ్రీ **బాపట్ల హనుమంతరావు గారి** రచన "శ్రీమద్భగవద్గీతామృతము" తృతీయ ముద్రణమునకు 'ముందుమాట' వ్రాయమని గురువర్యులు శ్రీ **వేంకట పార్ధసారధి గారు** ఆదేశించారు. వారి మాట శిరోధార్యము. తెనుగునాట సాయినాధునిపై భక్తి భావన ఏర్పడుటకు వారి తండ్రిగారు రచించిన అనేక అమూల్య గ్రంధాలు యీ శతాబ్దములో భక్త కోటిని ప్రభావితము చేస్తున్నాయి. "**శ్రీ సాయీ నిలయ ప్రచురణలు**" అనే పూలమాలలో **గీతామృతమనే** యీ పుష్పము తిరిగి తెనుగునాటి గుబాళింపులు విరజిమ్మనున్నది. 1929 లో ప్రధమమున, 1978 లో ద్వితీయ ముద్రణముగా వేయి ప్రతుల చొప్పున ప్రచురింపబడినవి. కాని యీ ప్రతులెందును నేడు కానరావు. మూడు దశాబ్దములలో తృతియ ముద్రణము కావడము ఆనందదాయకము. శ్రీ పార్ధ సారథిగారి కృషి ప్రధమ కారణము. భక్తుల ప్రేమ సహకారములు ద్వితీయకారణము. ప్రచురణ కర్తగారు చేసే నిత్యపూజలో సంకేతముగా శ్రీ సాయిబాబా ప్రేరణ లేనిదే దేనిని ఆయన తలపెట్టరు – ఈ సమాచారమును వారు భక్తకోటికి విజ్ఞప్తి ద్వారా తెలియచేయడముతో యెంతటి కష్ట కార్యమైనా, సునాయాసముగా పూర్తికావించడము అందరము యెఱిగినదే! బాబా కోరిన రెండు పైసలును వారు యేనాడో స్వామికి సమర్పించినారు. "బాబాయే అన్ని చేసుకుంటారు, చూచి ఆనందించడమే మనవంతు" అని వారు భక్తులతో తరచుగా ముచ్చటించుట పరిపాటి. 1973 నుండి శ్రీ సాయీ నిలయ ప్రచురణలుగా వారి తండ్రి గారి రచనలు, మరికొందరి మహనీయుల కృతులు, వారి స్వీయ చనలు, భక్తకోటికి అందజేయడము. మహాశ్చర్యాన్ని ఆనందాన్ని కలిగిస్తున్నది. వీరి కృషికి అభినందనగా కొద్ది సంవత్సరాల క్రితం "**ఓమ్ శ్రీసాయిరాం**" పత్రిక నిర్వాహకులు, గుంటూరు శ్రీ శిరిడీ సాయి సమాజం వారు "**శ్రీ సాయితత్త్వ ప్రచారక**" అని "**శ్రీసాయీబంధు**" అను బిరుదులిచ్చి సత్కరించినారు. భక్తుల ఆనందమే శ్రీ పార్ధసారథిగారికి కొండంతబలము.

ఈ మధ్యననే తండ్రి గారి రచన **నారదభక్తి సూత్రములు** "**ప్రేమామృతము**" పేరున చక్కని రీతిలో అచ్చువేయించినారు. వెనువెంటనే శ్రీ సాయినాధుడు వారికి '**శ్రీ భగవద్గీతామృతము**' ప్రచురణకు ప్రేరేపించుట మన అదృష్టము. 1978 ముద్రణములో దొర్లిన దొసగులను యీ ముద్రణములో సరిచేసినారు.

ఈ గ్రంధములో కవివరేణ్యులు తేటగీతి - ఆటవెలది- కంద పద్యములలో మూలశ్లోకాలను అతి చక్కని రీతిలో చక్కని కూర్పు చేసినారు. కొద్ది పాటి చదువు నేర్చినవారు కూడ ఆకట్టుకొనే విధముగా వ్రాసినారు. 1930 ప్రాంతములోనే ఉద్దండ పండితులు "చెళ్ళ పిళ్ళ" వారు **'ములుకుట్ల' 'బందా' 'అబ్బరాజు' 'మంత్రవాది' 'మిన్నికంటి'** వంటి వారు యీ గ్రంధాన్ని బహుదా ప్రశంసించినారు.

"భగవద్గీతపై తెనుగునాట నేటికి అనేక గ్రంథములు వెలుడినవి- అవి ఒకయెత్తు. ఈ గ్రంథము మరియొకయెత్తు కవివరేణ్యులు తెనిగించిన ఏ పద్యానికి యెట్టి తాత్పర్యము అవసరములేని రీతిలో సాగినది. ఇది బహుధా ప్రశంసనీయము. ఇలా వ్రాయుటము "**బాపట్ల**" వారికే తగును. అది వారికి వెన్నతో పెట్టిన విద్య. ఏలనన రచయిత తల్లిగారు కీ.శ. చిన్న పున్నమ్మగారు సంస్కృతములో ప్రవేశము గలిగియుండి బాల్యముననే గ్రంథములు చదివించినట్లు రచయిత ఒక రచనలో స్వయముగా విన్నవించుట నెఱిగితిని. శ్రీ బందా ఆదినారాయణగారీ కృతిని మెచ్చుకొని

"పండితులు మెచ్చ తెనుగున బాడినావె
యాగమాంత రహస్య గీతామృతంబు" అన్నారు.
అంతియేకాదు పామరులు సైతము మెచ్చుకొను రీతిలో సప్తమాధ్యాయములో
"వేదాహం సమతీతాని...." అనే మూలశ్లోకానికి కవి

"జరిగినవి జరుగు చున్నవి
జరుగంగాఁ గలుగు భూత సముదాయంబే
నెఱుఁగుదు - నను నొకఁ డేనియు
నెఱుఁగంగను నేరఁడో మహేంద్ర తనూజా!" అని అనువదించినారు!

నవమాధ్యాయములో "యధా కాశస్థితోనిత్యం...." అనే శ్లోకానికి

"అన్ని యెడల వ్యాప్త మగుచు మహా వాయు
వాకసమున నెట్టు లమరియుండు" . . . అనే పద్యానువాదమును చూడుడు! ఎంత సులభముగా నున్నదో!

ఈ విధముగా చక్కని జానతెనుగులో కవివరేణ్యులు గ్రంధాన్ని ఆసాంతం మనోహరమైన రీతిలో తెనిగించి మనకందించారు.

ఈతృతీయ ముద్రణము మనోరంజకమై యుండగలదనీ, శ్రీ సాయీ నిలయ ప్రచురణ ల కిదొక మణి పూస కాగలదనీ ఆశిస్తున్నాను. ఈ గ్రంథ ప్రచురణకు సహకరించిన అందరినీ శ్రీ సాయినాథుడు అనుగ్రహించుగాక!



# ప్రశంస

శ్రీ సత్రం వెంకటేశ్వర్లు, ప్రొద్దుటూరు

పూజనీయులు **శ్రీ బాపట్ల వేంకటపార్థసారథి** గారి ఆదేశానుసారముగా, అది శ్రీ సాయినాథుని కృపగ నెంచి యీ వాక్యములు వ్రాయుచున్నాను.

ఎందరో దివ్యపురుషులు నిస్వార్థ సేవకై దైవాంశముతో అవతరించినారు. అట్టివారు సద్గురువర్యులు కీ.శే. **శ్రీ పూజ్య బాపట్ల హనుమంతరావు గారు.**

అపారములు - అమోఘుము, మానవుని కైహిక పారమార్థికాభ్యుదయముల కవశ్యమైన విషయుములు వారి రచనలందు నిబిడీకృతమై యున్నవి. శ్రీ సాయినాథుని స్వప్న సాక్షాత్కారము- శ్రీ పుట్టపర్తి సత్య సాయీ ప్రభువుల ఆశీస్సులు పొంది- వేదాంత- ఆధ్యాత్మిక - భక్తి జ్ఞాన ప్రబోధక రత్నములను మనకందించిన పుణ్యాత్ములు వారు. శ్రీ సాయీతత్త్వ ప్రచార రచనల ద్వారా సత్యము శ్రీ సాయిచరణసేవా కార్యాచరణ. నిండు భక్తి విశ్వాసములతో సలుపుచు -సద్గోష్టి భక్తులతో ప్రత్యక్షముగా ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా జరుపుచు, కులమత వర్ణవిచక్షణ లేకుండ నెల్లరను ఆదరించి ఆతిధ్యమిచ్చి ఆశీర్వదించిన సమర్థ సద్గురువులు, నిస్వార్థజీవి శ్రీ పంతులుగారు. నిజముగా వారి దర్శనభాగ్యము పొందిన వారెంత ధన్యులో! ఇప్పుడు అదే బాటలో పయనిస్తున్నారు వారి పుత్రరత్నము, ప్రచురణ కర్త, శ్రీ బాపట్ల వేంకట పార్థసారధి గారు.

తండ్రిగారియందు గల భక్తి ప్రపత్తులే మూలధనముగా, పలువ్యయప్రయాసలకోర్చి తండ్రిగారి రచనలు మరల మరల ప్రకటించుచు - జనకుని కీర్తిని నలుదిశల వ్యాప్తిజేయుచూ "బాపట్ల" వంశమునకే వన్నె తెచ్చుచూ వాసి గాంచుచున్న శ్రీ బాపట్ల వేంకట పార్థ సారథిగారుసూ దైవాంశ సంభూతులే.

గురువును దైవంగా విశ్వసించి, సర్వత్రా సకల జీవులయందు తనగురువును వీక్షింప గలుగుట శ్రీ పంతులుగారు తన రచనల ద్వారా మనలను గ్రహింప జేసినారు. అజ్ఞానాంధ కారమునబడి, అలమటించు జీవులను మేల్కొలిపి, భగవానుడెల్లెడల కలడని - తన మృదు మధుర రచనలలో మనకెఱుకపరచిన వారు, మహనీయులు మన పంతులుగారు.

గమ్యస్థానము సురక్షితముగా చేరుటకు, గట్టి నమ్మకము దృఢ సంకల్పము - కృషి- సాధన- మరియు మార్గదర్శకులైన గురువు అవసరము. నిక్కముగా అట్టిమార్గదర్శి మన ప్రచురణకర్త.

భగవంతుడొక్కడే! సర్వవ్యాప్తి, సద్గురువూనొక్కడే! గురువు కూడ సర్వవ్యాప్తియే యగుచున్నాడు. మనము ఓర్పు-విశ్వాసములతో సేవించినప్పుడు మనకు గురువు శ్రీరామరక్ష. శిష్యులెక్కడయున్నను తన సూక్ష్మ శరీరంతో అనుగ్రహించగల సమర్థులు సద్గురువులని శ్రీ నృసింహ సరస్వతి స్వామివారు వక్కాణించిరి. ఇతర సద్గురువులను సందర్శించినను, వారిలో మన గురువును గని, తలవొగ్గి గౌరవించి, వారి బోధలును మన సద్గురువే వారిచే చెప్పించు సూక్తులుగా భావించవలయును.

శ్రీ హనుమంతరావు గారి రచనలన్నియు అమూల్య రత్నములే! మానవ మానసికాలంకార భూషణములే! వారి భావప్రకటన- భాషానైపుణ్యము- పదజాలవరవడి వర్ణనాతీతము. చక్కని ఆధ్యాత్మిక సాధన గల పవిత్రహృదయులకు వారి రచనామృతము నిత్యము స్వాదనాసక్తిని గూర్చును.

**శ్రీ భగవద్గీతామృతము** పద్యానువాదము సులభముకాదు. శాస్త్ర మర్యాదలను పాటిస్తూ తన సహజశైలిని మలిచి, భావము పూర్తిగా పొందుపరచి అందరకు అర్థమగురీతిలో అనువదించారు పంతులుగారు. భగవానుని కరుణ గడించిన సకలమూ సులభమగునని యీ కృతి ఋజువుపర్చినది.

ప్రతి భక్తుడు **శ్రీ భగవద్గీతామృతమును** ద్రావి, భక్తి జ్ఞాన వైరాగ్య రూపములగు రుచులను యెల్లరకు పరిచయము చేయ పాఠకులను ప్రార్థించుచున్నాను. ప్రాపంచిక దుఃఖములందు క్రుంగి, కృశించు మానవులకిందలి బోధలు మనశ్శాంతిని, ఆనందమును - విజ్ఞానమును ప్రసాదింప సమర్థనీయములు.

ఇంతవరకు ప్రచురణకర్త గారి దర్శనభాగ్యము నాకు కలుగలేదు. పిచ్చుక కాళ్ళకు దారము కట్టి తన భక్తుని తన వద్దకు లాగునన్నట్లు, వారి ప్రేమానురాగములతో నన్ను ప్రచురణ కర్తగారు తన దర్శన భాగ్యమును అనుగ్రహించునని, వారి హృదయములో నాకు స్థానము కల్పించిన కారణముగ విశ్వసించుచున్నాను.

శ్రీ పంతులుగారి కీర్తి ప్రతిష్ఠలు నెల్ల దిశల వ్యాపింపజేయుచున్న మన ప్రచురణ కర్తగారిని శ్రీ సాయీ కృష్ణ భగవానుడు సర్వవేళల సంరక్షిస్తూ, వారి ఆశయ సిద్ధికి తోడ్పడి, వారిని, వారి కుటుంబ సభ్యుల ఆయురారోగ్య ఐశ్వర్యముల ప్రసాదింప గోరి త్రికరణ శుద్ధిగా ప్రార్థించుచున్నాను.



# కారణ జన్ములు

భాషాప్రవీణ–విద్యాలంకార
DR CH. S.R.K. SARMA
Reader ఆంధ్రజాతీయ కళాశాల,
మచిలీపట్టణము -521001

శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ చేసి సమాజానికి సంపూర్ణమైన మార్పు తేవడానికి జన్మించేవారు అవతారపురుషులు. సమాజ పరిణామానికి అనుగుణమైన ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, సమాజముచేత దానిని అవలంభింప చేసేవారు ప్రవక్తలు. సమాజానికి అవసరమైన ఒక ఘనకార్యము చేయడానికి ఉద్భవించి, ఆ పని నెరవేర్చేవారు కారణ జన్ములు.

మాన్యులు **బాపట్ల హనుమంతరావు గారు** కారణ జన్ములు. తెలుగు దేశంలో సాయి భక్తిగంగను ప్రవహింపజేసిన మహానుభావులు వారు

కవిత్వ మొక మహాశక్తి. ప్రతిభావంతుని చేతిలో ఉన్న ఆ శక్తి సమాజాన్ని పరవశింపజేస్తుంది. దుష్టప్రతిభావంతుని చేతిలో ఆశక్తి ఉంటే సమాజాన్ని శక్తిహీనము చేస్తుంది. ఒక మహాభక్త కవి చేతిలో అదే ఆయుధము కవిత్వయోగమై ముక్తికి బాటలు వేస్తుంది.

సహజ పాండిత్యుడు పోతనామాత్యుడిలా శ్రీకైవల్యపదంబు జేరుకొన్న వాడే. భక్తకవి బాపట్ల హనుమంతరావు గారు గూడా తన కవిత్వ శక్తిని భగవదర్పణము చేసి, తాను భగవదనుగ్రహాన్ని పొంది, తన కవిత ద్వారా తెలుగు సోదరులు కూడ కృతార్థులు కావడానికి సహాయపడ్డారు.

భగవంతుడు చర్మ చక్షువులకు కనబడడంటారు. కనబడేది లోకము. వాటిలో ఉన్నవి శబ్ద స్పర్శరూపరసగంధాలు. అవి మనలోని పంచేంద్రియాల నాకర్షిస్తాయని, అది సృష్టికర్త చేసిన యేర్పాటు అని ఉపనిషత్తే చెబుతోంది.

మనకు పరలోక విషయము కూడ యింతే. పరలోకానికి వెళ్ళిన వారు మళ్ళీ వచ్చి మనకు చెప్పరు. బ్రతికి ఉండగా పరలోకము మనకి కనబడదు. ఈ స్థితిలో దివ్యదృష్టిగల మహాపురుషులు. అవతారపురుషులు. అలాగే కారణ జన్ములు కూడా భగవదనుభూతి తాము పొంది, లోకానికి అందిస్తూ భగవద్విశ్వాసాన్ని కలిగిస్తూ తమ కార్యము నెర వేరుస్తూంటారు.

శ్రీ హనుమంతరావు గారు తమ జీవితములో అతిక్లిష్ట సన్నివేశములో బాబా వారిచే రక్షితులై "ఏమి! నిన్ను పేక్షింతునా!" అని బాబావారి అభయాన్ని పొంది తాము లోటు లేకుండా జీవించడమే కాక భక్తులకు బాబా వారికి నడుమ ఒక వారధిగా భక్తుల యిబ్బందులను తీరుస్తూ వారిలో భగవద్విశ్వాసాన్ని నెలకొల్పారు.

బాబావారి జీవిత విశేషాలు, భక్తుల అనుభవాలు వారి రచనలలో లభిస్తాయి. ఆయన బాబా వారి అనుగ్రహానికి పాత్రం కావడం వల్ల వారి రచనలలో ఒక పవిత్రత చోటు చేసుకుంది. అందుకే వారి రచనలు పారాయణ గ్రంధాలయ్యాయి. నేను వారు రచించిన "**ఏమీ, నిన్ను పేక్షింతునా?**", "**సాయినాధబోధామృతము**" పారాయణ చేస్తున్నాను. వారి "**ప్రేమామృతము**" **నారదభక్తి సూత్రాలకు** సరళ వివరణమై ప్రేమభక్తిని పంచిపెడుతున్నది. అనేక రచనలద్వారా భగవద్భక్తిని, ఆధ్యాత్మిక జ్ఞాన ప్రచారము, శ్రీ సాయిబాబాతత్త్వ ప్రచారము శ్రీ సాయి బాబా మహాసంస్థానాంధ్ర విద్వాంసులువారు. ఈ మహాకవిలో శ్రీ హనుమంతరాయ కవి రచనామృతము శాంతిని... ఆనందాన్ని అందిస్తూ బాబా వారి యెడల భక్తిని మొలకెత్తిస్తూంది. ఈ ఉదాత్త వాఙ్మయాన్ని ప్రచురిస్తున్న **శ్రీ బాపట్ల వేంకటపార్ధసారథి గారు** బాబావారి అనుగ్రహాన్ని, తండ్రిగారి ప్రసాదాన్ని పొందడమేకాక భక్తజనులకు మహోపకారం చేసిన వారు కూడా అవుతున్నారు.

[Dr. **చిఱ్ఱావూరి శివరామకృష్ణ శర్మగారు** (యీ వ్యాసరచయిత) **శ్రుతిసౌరభం** హరప్పా సంస్కృతి–వేద సంస్కృతి, భారతీయ చిత్రలిపి పఠన విధానికి మూలప్రణవం మొదలగు పలు ముఖ్యాంశములు రెండు భాగములుగా ప్రకటించినారు. వీరి కృషి ప్రశంసనీయము. ప్రధమ భాగం రూ. 20/- లు. ద్వితీయభాగము రూ. 32/- లు. కావలసిన వారు పైన ఉదహరించిన చిరునామాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.]

(ప్రచురణకర్త)

శ్రీ సాయీనాథాయనమః



# విజ్ఞప్తి

సోదరీ సోదర భక్తజనులారా!

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు దేవుడగు శ్రీ సాయీ ప్రభుని కరుణవలన మీ అందఱసహాయ సంపత్తితోను, **ఉభయ భాషాప్రవీణులు**, "**శ్రీ సాయీ ప్రసన్న**" బిరుదాంకితులు, పూజ్యులు, కీర్తిశేషులునగు మా తండ్రి **శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు** వారి 22 వ యేట (1924) నాంధ్రీకరించిన "**శ్రీమద్భగవద్గీతామృతము**" తృతీయ ముద్రణము మీకందించు భాగ్యము నాకు కలిగినది.

1929 సంవత్సరమునందియ్యది ప్రథమ ముద్రణము జరిగియుండెను. ఈ గ్రంథమును గూర్చి పూజనీయులు, పండితోత్తములు, మహనీయులునగు పెక్కురు అందించిన అమూల్యాభిప్రాయములు, అభినందనలు. పూర్వ ముద్రణమునందు ప్రకటించినట్లె యింటను పొందు పరుపబడెను.

నా తండ్రిగారియ్యది యనువదించు సంవత్సరమున నేను జనన మొందుటను చేసి నాకీ పార్థసారథి నామధేయమును వారు ప్రసాదించి, నన్ను అనుగ్రహించుట కారణముగ నాకీ భగవద్గీత యందాసక్తి మెండుగ నుండెను. నా బాల్యము 12 సంవత్సరములు మాత్రము నా తల్లిదండ్రుల యొద్ద నుండ గలుగుటచే వారిని ప్రత్యక్షముగా సేవించు భాగ్యము నాకు భగవానుడు ప్రసాదించి యుండలేదు. తల్లిదండ్రులకు సేవలు చేసి వారి మన్నలను పొంద గలుగు భాగ్యము యే కొందరు పుణ్యులకో గాని అందరకు నసాధ్యమునియే నా తలంపు.

భూప్రదక్షిణములు- యోగముద్ర లేల?
ప్రాణనియమంబు లేల? కర్మంబులు లేల?
దానధర్మంబులును, జపతపము లేల?
తల్లిదండ్రులసేవించు ధన్యులకును. **(పుండరీక చరిత్రము)**

కాని పూర్వజన్మమందించుక పుణ్యకర్మము నాచరించుటఁ జేసి, నా తండ్రిగారి యందు బాల్యమున నుండియు గురుభావము నా మానసమునం దంకురించి, ఆయ్యది మహావృక్షమై తుదకు వారె "**శ్రీ సాయీ ప్రభువు**" అను బుద్ధి నాయందు స్థిరపడినది.

హరిహర బ్రహ్మాదులైనను గాని
సురలు మునుల్ మహర్షులు యోగులేని
గురుభవాంబోధి సద్గురుబోధ దక్క
దరియింపరన్న - నితరులేమిలెక్క
గురువు సర్వంబని - కొలుచునరుండు
పరమపదంబుఁ దప్పక పొందుచుండు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

అట్లు తండ్రిగ, గురువుగ, దైవముగ నా జీవితమును సన్మార్గమున నడపించుచుండు కాధారభూతులైన వారి ఋణమునందొక యణుమాత్రమైన తీరునేమో నను నాస. వారి రచనలను ప్రచురపర్చి మీకందించవలెనను నా ప్రయాస మీరెల్లరు నెఱింగినదియే! 1973 సంవత్సరమునుండి యిప్పటికి శ్రీ సాయీనిలయ ప్రచురణములు 52 ప్రకటింప కలిగితిని. ఇందు నాయందెట్టి యాధిక్యతయు లేదు. 50 సంవత్సరములవరకు జీవితమున దుఃఖమనన నెట్టిదియో యెరుగక ప్రాపంచిక వస్తు సముదాయము, సుఖములు శాశ్వతములని నమ్మి మెలంగుచున్న నాకు 7-11-1973 న మా తండ్రిగారు శ్రీ సాయీశ్వరుని యందైక్యమును జెందిన యనంతరము కొంత విరాగత కలిగినది. భగవానుని సేవించుటకే నాకీ కష్టము సంప్రాప్తమైనదని, శ్రీ సాయీ ప్రభునియందే నాతండ్రిని నిత్యము చూచుకొని సేవించవలెనను దీక్షయు పొడమినది.

ఆర్తులు - జిజ్ఞాసువులు - అర్థార్థులు - జ్ఞానులు అను తరగతులవారు నన్ను భజింతురు" (గీత 7-16) అని శ్రీకృష్ణ భగవానుడు పల్కెను.

శ్రీ సాయీ ప్రభుని ఆశ్రితులలో ఆర్తుల సంఖ్యయే యధికము. వారే శ్రీ సాయీ ప్రభువును ముఖ్యముగ నాశ్రయింతురు. సుఖసంపదలు అనుభవించుచున్నంతవరకు జనులు భగవానునిగూర్చి దలంచరు. కష్టములు తలకొనెనా "మనల రక్షించువారెవరా?" అని వీక్షింతురు. శ్రీకృష్ణుడు కుంతీదేవిని గాంచి "అత్తా! నీకేమి కావలెనో కోరుకొను"మనెను. అందులకామె "ఓ కృష్ణా! మాకప్పుడప్పుడు కష్టములు కలుగునట్లను గ్రహింపుము. కష్టములందున్న మేము నిన్ను ధ్యానించుచుందుము. నిన్ను ధ్యానించిన నీ దర్శనభాగ్యము ప్రసాదించుచుందువు. నీదర్శనప్రాప్తి కలిగెనా తిరిగి మాకు పుట్టుకవలన పనియుండదు" అనెను. (భాగవతము. 1-8-24)

మనసును నిలిపి గమ్యము జేరు దనుక
పెనయు కష్టములకు వికలత గనక
పరమార్థదృష్టి యెప్పట్టున విడక
చరియించు భక్తుడౌ సాధు వేమఱక

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

కాని మానవునకు మాయామయమైన యీ ప్రాపంచిక విషయసుఖములందు సతీసుత జ్ఞాతిశ్రేణియందు, ధనగృహ వస్త్రవాహనములయందును మమత యధికమగు నుండునేకాని తరుగదు. ఈ సర్వము సత్యమను భ్రాంతి మనలను విడనాడదు. జీవితమున విద్యుక్త ధర్మముల నాచరించి, వృద్ధులై మరణమునకు సిద్ధమగువారికి సైతము యీ మాయ తొలగదు

సగము మేను బట్టి సర్పంబు మ్రింగిన
గప్ప మక్షికాళి నప్పళించు
జగతినాయు విట్లు సమయుచున్నను విష
యముల మోహబుద్ధి యారఁ జేయు

స్వప్నమందు నరుఁడు సత్యంబు, కాంతయు
సత్యమౌ రతియు నసత్యమగును,
సత్యమగును శుక్రసంపాతమట్టి, వి
శ్వంబు, మాయవలన సంభవించు

(ప్రబోధ సుధాకరము)

ఇట్టి మాయామయమైన ప్రాపంచిక సుఖములందు వైరాగ్యము బూని మనస్సును భగవంతుని వైపు మరల్చుటకు సాధన అవసరము.

"ప్రాణులందు జూపెడి ప్రేమ బంధకరము
ఎఱిగిన నెఱుంగకున్న సర్వేశుమీదఁ
బఱపు ప్రేమ యొందేని నిష్ఫలముకాదు

(నారదభక్తిసూత్రములు)

"మానవుడు పాలించుటకుకాదు, సేవించుటకే వచ్చినాడు. కష్టించి, సహించుటకే యిక్కడకు పిలువబడినాడు, సోమరిగ వాచాలుడుగ నుండుటకు కాదు, ఏదో ఒక కృషి చేయుము సద్గ్రంథముల పఠింపుము" (**శ్రీ సాయీనాథ బోధామృతము 269**) అని శ్రీ సాయీ ప్రభువు బోధించెను.

ఈ భావములు నా మనమున పొడముటయు, మీరందఱు నాయందు పఱపు అవ్యాజానురాగములును నన్ను మిక్కిలి తన్మయునిగఁ జేసి, యీ కృషికి ప్రోత్సహించినవి. మీయందఱతో గల యీ సంబంధమే జన్మ యందలిదో ఆసాయీ నాథునికే యెఱుక. ప్రేమతత్త్వమును సాయీబాబా నాకు బోధించుటకే మీ యందఱను యేరి, కోరి, కూర్చి నాకాలమును సద్వినియోగపర్చునట్లు శాసించు చున్నాడు.

## ముద్రణము విషయము

'**ప్రేమామృతము**' ముద్రణ పూర్తి యగుచున్న సమయమున శ్రీ సాయీ ప్రభువుల ప్రేరణతో సికిందరాబాదు వాస్తవ్యురాలు **చి. శ్రీ జయంతి సత్యనారాయణ బాబు గారి ధర్మపత్ని చి.సౌ. అన్నపూర్ణ గారు** (వీరు రెండు దశాబ్దములనాడే శ్రీ సాయీ నిలయ ప్రచురణములకు పోషకురాలు) 16-11-2000 న లేఖ వ్రాస్తూ ఆమె చెల్లెలు స్వర్గీయ శ్రీమతి విజయలక్ష్మి జ్ఞాపకార్థముగా రూ.5116/- పంపుచూ శ్రీ భగవద్గీతామృతము పునర్ముద్రణమునకు వినియోగించుమని మునుముందుగా నీకృతి వెలువడ ప్రోత్సాహపర్చి కార్యోన్ముఖుని గావించెను ఈ భక్తాగ్రణిని, పతీ, సుత, సుతులను శ్రీ సాయీ కృష్ణ భగవానుడు సంరక్షించుగాక అని నా ప్రార్ధన.

గీ. చిన్న ప్రాయముననె తన చెల్లెలయిన
"**ఘండికోట విజయలక్ష్మి**" కాలగతిని
మరణమందిన జాపను మరువలేక
ఆత్మ శాంతికిని- స్మృతి చిహ్నంబుగాగ
వ్యాస సముడైన "**బాపట్ల హనుమ**" సుకవి
తెనుగుఁ జేసిన గీతను తిరిగి ముద్ర
ణమును గూర్చ నెంచిన తరుణమున రూక
లైదు వేల నూటపదారులక్కయగు "**జ**
**యంతి అన్నపూర్ణ**" తగు సాయంబుఁ జేసె
సాయి ప్రచురణలకు మున్నె సభ్యురాలు
సాయి పదార్చనలు సల్పు సాధ్వియామె
యేలు గావుత సతతంబు నీమెను, మరి
"**సత్యనారాయణ**" పతిని "**సత్యపద్మజ**"
సుతను - సుపుత్రుపై నట్టి "**సత్యకిరణు**"
నాయురారోగ్య భోగభాగ్యముల నిచ్చి
కృష్ణ సాయీ మహారాజు కృపనుఁ బరపి.

తదుపరి నాచిరకాలమిత్రుడు, శ్రీ సాయీ బాబా భక్త రత్నమునగు **శ్రీ పిన్నమనేని వేంకటరత్నం గారు శ్రీ భగవద్గీతామృతము** పునర్ముద్రణము కోరి రూ 10,001/-లు ద్రవ్యమును సమర్పించిరి. కాని విధివశమున యీ మహాదాత యీ కృతి ముద్రణము ముగియక ముందే 9-1-2001 న పరమ పదమునొందిరి. వీరి జీవితచరిత్రము సంగ్రహముగ పాఠకుల కెఱిగించుట నా కనీస ధర్మమని తోచినది.

కృష్ణా జిల్లా- కంకిపాడు మండలము - తెన్నేరు గ్రామమున **శ్రీ వెంకట్రామయ్య - అన్నపూర్ణమ్మ** పుణ్యదంపతులకు ప్రథమ పుత్రుడుగా 13.9.1934 న **శ్రీ పిన్నమనేని వేంకట**

రత్నం చౌదరి గారు జనసమందిరి ఉన్నత పాఠశాల స్థాయి వరకు విద్యనభ్యసించి, వారి మేనమామ శ్రీ తుమ్మల వేంకటేశ్వర రావు (నటరాజ్ హోటల్ యజమాని) ఆదేశాను సారముగా విజయవాడ చేరి వ్యాపారానుభవమును గడించి, పులపర్రు గ్రామవాస్తవ్యులు **శ్రీ అక్కినేని భాస్కర రావు – శ్రీమతి సరోజనమ్మల** ప్రథమ పుత్రిక శ్రీమతి **సీతారత్నం** గారిని 7-5-1960 న అర్ధాంగిగ స్వీకరించిరి

1970 లో గవర్నరుపేటలో శానిటరీ స్టోర్సు స్థాపించి మూడు దశాబ్దములు వ్యాపారము చేసి ధనమును - ప్రఖ్యాతిని గడించుటయే కాక, శ్రీ షిరిడి సాయిబాబా అంకిత భక్తులు - పూజనీయులు, మా జనకుల ప్రియ శిష్యులునగు శ్రీశ్రీశ్రీ కొప్పరపు రామారావుగారిని గురువులుగనెంచుకొని, సత్సాంగత్యము నెఱపి, శ్రీ షిరిడి సాయిబాబాను తన యిష్టదైవముగ నిత్య సేవల నొనరించిన మహనీయుడు శ్రీ వెంకటరత్నం గారు.

అనేకమంది మహాత్ములను - అవధూతలను - పలుపుణ్యక్షేత్రములను నిరంతరము సందర్శిస్తూ ఉదారముగా విరాళము లొసంగుచూ, వుండేవారు. పూజ్య శ్రీ త్రిదిండి చిన జీయ్యర్ స్వామీజి తో విదేశ పర్యటన గావించిన పుణ్యులు శ్రీ వేంకటరత్నం గారు

1999 లో శానిటరీ సంస్థ వ్యాపారమును మాని, వారి అమూల్య కాలమును ఆధ్యాత్మిక కార్యక్రమములు, గ్రంథపారాయణ, భజన పూజాదులయందు శ్రీ సాయిబాబావారికి ప్రత్యేక మందిర నిర్మాణ సంకల్పసిద్ధిని బడయుటయందును సద్వినియోగపరచి, అనుంగు మిత్రులు, పరిచయుల చేతను, **"స్వామిజీ"** అని పిలువబడి, అతి చిన్న వయసుననే 9-1-2001 న శ్రీ వేంకటరత్నం గారు అమర జీవులైరి

వీరి ధర్మ పత్ని శ్రీమతి సీతారత్నం గారు భగవత్కార్యక్రమ సంకల్ప సిద్ధికి- అతిధి సత్కారములందును పతికి సహకరించి మన్ననలందిన మహా యిల్లాలు పతి వియోగ దుఃఖమును భరించు శక్తిని శ్రీ సాయీ భగవాను డీమెకు ప్రసాదించుగాత!

కం|| సతి సీతారత్నము- మరి పతి వేంకట రత్నము. తమ భవనమున మహో
న్నతయాతిథ్యము మా దంపతులకిడిరి మున్ను! మాదు భాగ్యముకాదే!

**'పెన్నమనేని' సత్కులుడు వేంకటరత్నము భక్త రత్నమే**

ఉ|| విన్నపమంచు భక్తి మెయి వేడుచు దాపున జేరినాడు-సం
పన్నుడు- దాతయున్- విజయువాడ పురంబున నొక్కనాడు- నన్
దిన్నగ వాని సౌధముకు తీసుకు వెళ్ళెను 'కారు' మీద, నా
కన్నియు జూడగా మదికి నబ్బురమై కనుపించె, నంతలో
గ్రన్ననలోనికేగెను కరంబున పట్టుకు తెచ్చెను రొక్కమున్
"ఎన్నటి నాటి మీజనకు లింపుగా పల్కెను 'గీత' తెన్గునన్
మున్నది వెల్వడెన్- మరల ముద్రణ జేయగ మీకు చెప్పుటే

విన్నపమ"ంచు పల్కి పదివేలును పైన మరొక్క రూకయున్
ప్రసన్నన సింధు సమ్రత కరంబుల పెట్టి నమస్కరించె, నా
కన్నుల బాష్పముల్ పొడమె, గ్రక్కున నాతని జీవితంబు నే
తెన్నున ధన్యతన్ గనెడు తీరుపు షిరిడి సాయినాథుడే
పన్నెను మాయలీల యని భావన జేసితిగాని, నిర్దయన్
వెన్నున పొడ్చెనన్న- కృతి వెల్వడు పూర్వమె- క్రిందు మీదయెన్
యన్నియు. దాతకున్ హృదయమందున వ్యాధి జనించె, పెద్ద పే
రెన్నిక గన్న "డాక్టరుల" కేని చికిత్స యసాధ్యమయ్యె- నా
పన్న శరణ్యుడైన భగవానుడు మౌనము బూనె- "పుష్యమిన్"
"పున్నమి" నాడు నా సఖుడు పుణ్యపు లోకముఁ జేరె; సాయికిన్
సన్నిధి నిల్చి పూజలను సల్పి ప్రశాంతత నాత్మ జెందగన్
వన్నెలు లేని మోములను బంధుజనంబును ప్రాణమిత్రుల
త్యున్నత సాయి భక్తుని యథోచితరీతి. నివాళులీయు- నే
సన్నమెఱుంగ. కృష్ణ నిలయంబు నివాసి, **వశిష్ఠ** గోత్రుని
**పిన్నమనేని** కీయెడల వీడెద సత్రువులర్పణంబుగా!
ఎన్నియొ దానధర్మములు- నెందరొ సాధుల పాదపూజలున్
మిన్నగ జేసె- పట్టణ సమీపమునందున సాయిమందిరం
బున్నతరీతి నిల్పెను- మహోత్సవముల్ నిరతంబు జేయగన్
**పిన్నమనేని** సత్కులుడు **వేంకటరత్నము**- భక్త రత్నమే!

మున్నొక నాడు- పుష్కరము పూర్వము- వాని గృహంబుఁ జూడగా
అన్నయ **సాంబమూర్తి** యును **శ్యామయు**, నేను, **సుధాకరుండు** నున్
మున్నగు వారమొక్కపరి ముప్పది మందిమి వెళ్ళి నాము- యి
ష్టాన్నము- శాకభక్ష్య ఫలహారము లేర్పడ విందు నిచ్చె నీ
**పిన్నమనేని** సత్కులుడు **వేంకటరత్నము**- భక్తరత్నమే!

[1 చోడవరపు సాంబమూర్తి గారు- చిక్కడపల్లి బాబా- హైదరాబాదు
2 శ్రీ శ్యామచరణ్ బాబా వారు - నంద్యాల
3 శ్రీ సుధాకర్ మహరాజ్- సాయిప్రభ పత్రికాధ్యక్షులు- హైదరాబాదు]

:|| భగవద్గీత తృతీయ ముద్రణకునై భక్తిన్ ధనం బిచ్చి, వా
సిగనన్ జేసితి వీవు తండ్రి కృషికిన్ సిద్ధించె నా కోర్కె, విం
తగ, **శ్రీ పిన్నమనేని** వంశవిబుధా! ధన్యత్వమున్, ముక్తి, చ
క్కగ నార్జించిన **భక్తరత్నమవు! వేంకట్రత్న** నామాభిదా!

క|| చిరునగవు మోమునందున
పరిమిత సంభాషణంబు - పరహితకార్యా
చరణము - గురుననుసరణము
పెరుగఁ దెరువులయ్యె నీకు - పిన్నమనేనీ! (ప్రచురణకర్త)



మరియు, మహారాజపోషకులు - రాజపోషకులు, సభ్యులు సహృదయముతో సమర్పించిన విరాళముల వివరములు విడిగ ప్రకటించు చున్నాను. వారలను గురించిన అభినందన పూర్వక ఆశిస్సులు కృతజ్ఞతలు, అవకాశము, శక్తి కలిగిన మేరకు విన్నవించితిని. ఇందు దొసగులు దొర్లిన పాఠకులు - పండితులు మన్నించుదురుగాక!

పోషకులు పంపినట్లు, ఆదేశించినట్లు, కొన్ని చిత్తర్వులను ప్రత్యేకముగ ప్రకటించితిని.

ప్రశంసా వాక్యములు పలికిన భక్తాగ్రగణ్యులు, సాయి బంధువులునగు

చి శ్రీ Dr గోటేటి వెంకట చలపతిరావు - కాకినాడ,

చి శ్రీ దాలిపర్తి నారాయణరావు - అడ్వకేటు - హైదరాబాదు

చి శ్రీ కేశిరాజు నరసింహారావు, M A , B Ed , BL., పాలకొల్లు,

చి. శ్రీ Dr CH S R.K శర్మ., M.A , M Ed , భాషా ప్రవీణ, మచిలీపట్టణం.

చి. శ్రీ సత్రం వేంకటేశ్వర్లు. B A , ప్రొద్దుటూరు

వారలకు కృతజ్ఞతా పూర్వక శుభాశిస్సులనందించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణమునకు తోడ్పడిన భక్తులకు - పోషకులకు సకాలములో చక్కగ ముద్రించిన చి. శ్రీ రావు జనార్దన రావు గారికి, (ODIN PRESS (P) LTD బల్కంపేట, హైదరాబాదు) వారి కార్యాలయ పనివారికి కృతజ్ఞతలు తెలుపుతూ వీరినెల్లరను శ్రీ కృష్ణసాయి సర్వదా సర్వథా సంరక్షించుగాక! అని ప్రార్థించుకొనుచున్నాను.

ఇకముందు పునర్ముద్రణ కావలసిన **శ్రీ బాపట్ల హనుమంతరావు గారి రచనలు**

1 **శ్రీ కృష్ణకర్ణామృతము** (శ్రీలీలాశుకుని కృతికి పద్యానువాదము)
2. **శ్రీ ప్రబోధ సుధాకరము** (శ్రీశంకర భగవత్పాదుల రచనకు పద్యానువాదము)
3 **శ్రీనివాస దయాశతకము** (శ్రీమాన్ నిగమాంతదేశికుల రచనకు పద్యానువాదము)
4. **శ్రీ సాయీ మననము.**
5 **శ్రీ సాయీ హనుమ సారథి భావ సంగ్రహము (3 వ భాగం)**

**శ్రీ సాయి బాబా కూడ దేవుఁడేనా? ఉన్న దేవుళ్ళు చాలకనా? (సందేహనివృత్తి)** నా ప్రియ జనకుల తెనుగు రచనకు ఆంగ్లానువాదమును చి. శ్రీ **R రామచంద్ర రావు గారు** M A , Lecturer, Markapur పూర్తి చేసిరి. దీనిని దేశ, విదేశీయులెల్లరు పఠించుటకనుకూలముగా ముద్రించ

సంకల్పించితిని. దీనికి పోషక మహాశయులు పాఠకులు ప్రత్యేకముగా శ్రీ సాయీ ప్రభువుల అనుజ్ఞామోదములు పొంది, సహాయపడి నన్ను కృతకృత్యుని జేయ కోరుచున్నాను

**విన్నపము:** పంపిన పుస్తకము చేరినట్లు - చిరునామా మార్పులు

(1) దయతో సకాలములో తెలియజేయవలెను

(2) ఇప్పటి వరకు ప్రకటించిన ప్రచురణలలో మీకు అందనివి గుర్తు చేయండి

## శ్రీ కృష్ణసాయీ ప్రభువులకు ప్రత్యేక ప్రార్థన

మ|| స్థిర భక్తిన్ వెలిగించె తండ్రి భగవద్గీతామృతంబిద్ధి, సో
దర దాతల్, మహరాజపోషకులు, ప్రోత్సాహించి, ద్రవ్యంబు గూ
ర్చిరి, యే రీతిని నేను వీరి ఋణమున్ చెల్లింతు? నర్చింతు నీ
చరణాబ్జంబులు, వీరి బ్రోవగదె! కృష్ణా! సాయి! సద్బాంధవా!

మ|| వరుసన్ ప్రాప్తములైన బాధలను గూల్పన్ జేయుచున్- భూరిసు
స్థిర సౌఖ్యోన్నతి గ్రంథ పోషకులకున్ జేకూర్చుచున్- ప్రేమత
త్పరతన్ గంటికి రెప్పరీతిగను బ్రోవన్ వేడెదన్ దేవ! నా
శిరమున్ వంచి నమస్కరించెదనినున్- శ్రీకృష్ణ సాయీ ప్రభూ!

ఉ|| డెబ్బది యారు యేడులు వడిన్ గడచెన్ గతమున్ దలంపగా
నబ్బుర మందుదున్ - జనకునాజ్ఞల నేశిరసావహించుటన్
యబ్బె భవత్పదాంబుజములందున భక్తి యొకింత, మానసం
బుబ్బె, సుదారులౌ యనుజులూతగ నిల్చుట జేసి- సత్ప్రభూ!

గీ|| ప్రతిన బట్టి పోషకులు విరాళమిడిరి
వీరు- బిడ్డలు- బిడ్డల బిడ్డలెల్ల
సిరులు- సంపద, లాయువు, చిరయశంబు
సాయికృష్ణు డొసగి బ్రోచు సతతము కృపను.

గీ|| అనువదించె తెనుఁగున **గీతామృతంబు**
జనకు డెల్లరకును ప్రయోజనము గలుగ
బాధలెఱిగి యాదరణకు బూనుకొనుడు!
'**హనుమ**' కృతులు వెలువడ సహాయమిడుడు!

శ్రీ సాయీనిలయమ్,
చెరువు జమ్ములపాలెం,
21-2-2001,
మహాశివరాత్రి

ఇట్లు
శ్రీ సాయి సేవలో
**బాపట్ల వేంకట పార్థసారథి**
(ప్రచురణకర్త)

# మహారాజపోషకులు – కృతజ్ఞతలు

ఒక గుప్తదాత- హైదరాబాదు - రూ. **3650/-** లు

.కనదగు సౌఖ్య జాలయుతగా నొనరించుచు, నీదుపాదసే
వన నిరతంబు సల్పుచు నవారిత రీతిఁ జిరాయురున్నతుల్
దనవి నొసంగు మీయమకు, ద్వారకమాయి నివాస! సాయి! పే
రును బ్రకటింపరాదనుచు రూఢిగ పల్కె ధనం బొసంగుచున్.



మాతృదేవి సంస్మరణార్థముగా రూ.**1700/-** లు సమర్పించిన
**శ్రీమతి మాధవపెద్ది ఫణి రాధాకుమారి**
W/o చి. శ్రీ M L Narasimham, Hyderabad.

ధరణి గలరు "**నాదెండ్ల**" సద్వంశమందు
ప్రధిత "**హరితస**" గోత్ర సంభవులు వారు
**సాంబశివరావు – సుందరసాక్షి** పూర్వ
వినుత **కామేశ్వరీ దేవి** యనెడి పుణ్య
దంపతులిల నలుగురు సంతతిని గనిరి.

సుతలు ముచ్చురు **వేంకట సుబ్బలక్ష్మి**
యవల **దాక్షాయణి** యను రెండవ తనూజ
తనయలందు చిన్న-**ఫణిరాధాకుమారి**
ప్రతతి గన "**నాగలక్ష్మి నారాయణ ప్ర**
**సాదు**" జననమందెను వీరి సోదరుడుగ.

తల్లిదండ్రులపై భక్తి వెల్లి విరియ
పూజ్యమగు భగవద్గీత ముద్రణమున
దాతగా నిలచె ఫణి రాధా కుమారి
రూఢి పదిహేడు వందల రూకలిచ్చె!

సాయి నిలయ ప్రచురణకు చేయుచుండ్రు
పెద్ద సాయము 'మాధవ పెద్ది' వారు.
వారి వంశములకిది యాచారమయ్యె
అఖిల సౌఖ్యముల్ భోగభాగ్యములు గలిగి
ధరణి మాధవపెద్ది సద్వంశమెల్ల
శ్రీ షిరిడి సాయి కరుణ వర్ధిల్లుగాత!



స్వర్గీయ **సాదినేని శ్రీనివాస చక్రవర్తి**
స్మృతి చిహ్నముగా తల్లిదండ్రులు రూ. **1116/-**

ఉ॥ కాలమనంతమెంతయును కాయము బుద్బుద "మింజనీరు" వి
ద్యాలయ ప్రాంగణంబున విహారము సల్పుచు దుర్ఘటిల్లగా
కాలును జాఱి నూయిబడి కాలము జెంది దివంబు జేరెనే!
మీలయ! **శ్రీనివాస** యిటుమీదట నామము **చక్రవర్తి**యన్
బాలుని పిల్చినారు! ఘనవంశము పేరది **సాదినేని** యౌ!
కాలము చాలగన్ జరిగె గాని గతంబు దలంచి నారు కా
బోలును తల్లిదండ్రులగు **బుచ్చయ చౌదరి – నాగరాణి**, యా
కాలము నాటి బాధ మదిక్రమ్మర కంపమునొంది పుణ్యలో
కాలను శాశ్వతమ్ముగు సుఖమ్ముగ పుత్రుడు నుండగోరి దా
సాళులలోని వీరు నిను నాత్మ దలంచుచు గీత లోని వా
క్యాల నెఱింగి ముద్రణ సహాయ మొసంగరి; యీ కుటుంబమున్
పాలన జేసి, క్షేమమిడ ప్రార్థన జేసెద సాయి సద్గురూ.



కీ.శే. **DR. అయ్యావారి వెంకట సూర్య సుబ్బారాయుడు** (భీమవరం)
సంస్మరణార్థముగా భార్య **చి. విజ్ఞానవతి**- కుమాళ్ళు **చి. రాజేష్,**
**చి. నగేష్, చి. శ్రీరామ్** లు రూ. **1116/-** లు సమర్పించిరి

గీ|| ప్రథిత **కౌండిన్య** గోత్ర సంభవులు వారు
**అయ్యావారి** సద్వంశమందవతరించె
ఆరువేలనియోగి శ్రీ **అమ్మిరాజు**
అతని సతి **హనుమాయమ్మ** యనఁగఁబరగె
చెలగి వారల కుద్భవించిన ద్వితీయ
సుతుడునైన **వేంకట సూర్య సుబ్బరాయు**
డాఖ్య **భీమవరమున** విఖ్యాతిగాంచె
పడతి **విజ్ఞానవతి** తన పత్నిగాగ.
ధరణి జనియించిరా పుణ్యదంపతులకు
సుతులు **రాజేషు** - శ్రీ **నగేషు**-నటుపై తృ
తీయుడనగ **శ్రీరాము** సంతృప్తిగనగ.
సతియు - సుతులును బ్రీతిని సహకరింప
వ్యాధి బాధలడంచి యవ్యాజ కరుణ
కలిగి యుండుటే బ్రతుకు లక్ష్యముగనెంచి
పేదసాదల నెలమి సేవించినాడు
"**ప్రాణదాత**" యను, కీర్తిఁబడసె - కాని
అరువదేండ్లేని రాని ప్రాయంబు నందె
యసువులను బాసి పరమపదాప్తిఁ గనియె
**సుబ్బరాయుడు** ప్రజలెల్ల స్రుక్కుచుండ!

కం|| తనయులు - సతియున్, నీకీ
ర్తిని వ్యాప్తి పఱుపగ '**గీత**' కృతికిడిరిధనం
బును; **అయ్యావారి**కులవ
ర్ధన! **వేంకట సూర్య సుబ్బరాయుడు శర్మా!**



కీ. శే. శ్రీ గంఢ్రపు శివప్రసాదరావు
సంస్మరణార్థం భార్య వాణమ్మ రూ 1116/-

గీ|| తల్లి అలువేలుమంగమ్మ - తండ్రి శరభ
రాజు - భార్య వాణమ్మ - నిర్మల - ప్రమీల
మరియు లక్ష్మి యనబడు నామములవారు
తనయలబ్బె - గౌతమస గోత్రంబువాడు
ప్రముఖ ఆరువేలనియోగి బ్రాహ్మణుండు
ఆ శివప్రసాదు తను విద్యలను నేర్చి
పెద్ద చదువుల సుతలకు వెలుగునిచ్చె
సమత వాణిజ్యమును - వ్యవసాయమునను
పారశాలను బెట్టి సంపాదనమున
బ్రదుకు తెఱవుగ నెంచి గౌరవమున బెంచె
యాబదేడులు నిండు ప్రాయంబు వరకు,
చిన్న వయసుననె విధి వంచితుడు నయ్యె.

కం|| గంఢ్రపు సద్వంశంబున
గంఢ్రపు గ్రామంబునందు ఘనుఁడై- తల్లీ
దండ్రుల- తాతలకీర్తిని
నిండించి; శివప్రసాదు కాలము చెందెన్.

కం|| వితరణ వేయికి పైగా
పతియందున భక్తి నెంచి వాణమ్మ- గీతా
మృతము వెలువడ నొసగెను
కృతకృత్యులు వీరు, సాయి కృపతో బ్రోచున్.



చి॥ శ్రీ **వేముల సూర్య ప్రకాశరావు.**
చి॥ శ్రీమతి **జ్యోతి** దంపతులు రూ. **1116/-**

గీ॥ 'మట్టు నీళ్ళ' గోత్ర సంభవుడ వీవు!
'వేములా' న్వయ వంశ సద్విభుడ వీవు!
నీదు పత్ని జ్యోతి యు నీవు నియమరీతి
సాయినాథుని సేవలు సలుపుచుంద్రు.

తదయుక భగవద్గీతామృతంబు మరల
నచ్చుపడ వేయినూట పదారులిచ్చి
యఖిల జనతా ప్రశంసల నందుకొంటి
వయ్య! సూర్యచంద్రులు తారకాదులుండు
దాక, నీకీర్తి నిలుచును ధరణిలోన
మరియు మీ సుతు డఖిలకుమార్ వరుడు
గుణుడు **వేంకట సాయి** యు- గుణవతి యగు
సుత సమత యు మీ దంపతుల్ సతము సుఖము
నాయురారోగ్య భోగ భాగ్యములు గలిగి
శ్రీ షిరిడి సాయి మిమ్ము వర్ధిలగ జేయు
గాత! **వేముల సూర్య ప్రకాశ రాయ!**



చి. శ్రీ **మామిళ్ళపల్లి చినకోటేశ్వర రావు**
చి. శ్రీమతి **లక్ష్మి తులసి** దంపతులు రూ. **1016/-**

గీ॥ తండ్రి రాఘవయ్య - మరి సీతమ్మ తల్లి
మదిని దోచ నేకైక కుమారుడైన
మిగుల శ్లాఘ నీయుండు మామిళ్ళపల్లి
ప్రముఖుడు చిన కోటేశ్వర రావు - వారి
కీర్తి వ్యాప్తి చెంద భగవద్గీత కృతికి
అచ్చు వేయించు పనికి ద్రవ్యంబు నిచ్చె
వేయిపైన పదియారు వితరణముగ!

అతని పత్ని **లక్ష్మీ తులసి** – కవల సుతుడు
ప్రదిత **వెంకట శివరామరావు** నకును
నితని పత్ని **శ్రీదేవికి** హితము గలుగ
మరి **యలేఖ్యా – లక్ష్మి** యను నామముల పరగు
పుత్రికలకును – **మిరియాల** గోత్ర జులకు.
నాయురారోగ్య భోగ భాగ్యములు సతము
కృష్ణ సాయి యొసంగి రక్షించుగాత!



చి శ్రీ **DR. గోటేటి వేంకట చలపతి రావు** – మరియు
చి. శ్రీమతి **కమలాదేవి** దంపతులు రూ. **1016/-**

గీ॥ ఆంధ్ర సంస్కృత మాంగ్ల భాషార్ణవముల
కడుపునిండుగ త్రాగిన కలశభవుడు
సాయి పదపద్మ రసపాన షట్పదుండు,
వేదవేదాంత విజ్ఞాన వేత్తయైన
ప్రథిత బాపట్ల హనుమంత రాయ సుకవి
వ్యాస హృదయానుసారంబు నాంధ్ర మందు
తెలుగు తీపిదనంబును దిశలు నింద
తెలుగు జేసిన గీతను తిరిగి ముద్ర
ణమ్ము నొసరుచు వేళ ముదమ్ము గదుర
వేయి నూట పదారులు విత్తమిడితి
వాడు వేల నియోగ వంశాబ్ధి పూర్ణ
చంద్ర, **గోటేటి వేంకట చలపతి** బుధ
ప్రముఖ ఋషి '**భరద్వాజ**' గోత్ర జుడవుగద,
నీదు యాజ్ఞను పాటించి నెగడుచుండు
సహచరి **కమలాదేవి** యు నహరహంబు
పూర్వమునవె మహారాజ పోషకుడవు
సుతయు – సుతులును, నీవు, నీ సతియు, మరియు
మనుమరాంద్రు మనుమలు నీ జనము లెల్ల
విపుల భోగ భాగ్యాలతో పృథ్వియంధు
సతము వర్ధిల్లుడయ్య శ్రీ సాయికృపను.



**చి. శ్రీ ముద్దా వెంకట సుబ్బారావు**
**చి. శ్రీమతి లక్ష్మీ వెంకట రమణమ్మ** దంపతులు రూ. **1016/-**

శా|| పెద్దల్ జూపిన భక్తి మార్గమును - సంప్రీతిన్ మదిన్ నిల్పి శ్రీ
మద్ది వ్యార్చన **లక్ష్మి వెంకట రమణమ్మన్** పత్నితో గూడిమ
ప్పొద్దుల్ సల్పుచు **సాయినాథ!** ధనమీ పాత్రంబుకై నిచ్చె, శ్రీ
**ముద్దా వేంకట సుబ్బరావు** జనులన్ మోదింపగా జేయుమా!



**చి. శ్రీ ప్రభా వెంకట సుబ్రహ్మణ్య శర్మ,**
**చి. శ్రీమతి దుర్గాదేవి** దంపతులు రూ.**1016/-**

శా|| ఔదార్యంబున గ్రంథ ముద్రణకు ద్రవ్యంబిచ్చి సద్భక్తితో
పాదద్వంద్వ సమర్చనారతులుగా బాబాను ప్రార్థించరే!
పాదుర్భూత దయాంత రంగుడు "ప్రభా" వంశంబుకాపాడు - **దు**
**ర్గా దేవీ** సతితోడ వర్ధిలుము **సుబ్రహ్మణ్య శర్మా**భిదా!



శ్రీ కె. **అనంతపద్మనాభరావు** - ఏలేశ్వరం. రూ.**1100/-**

ఆ.వె. కోరినట్లు కృతికి కూరిమి. కె. అనంత
పద్మ నాభరావు పంపెధనము
తప్పులున్న సైచి- దయను స్వస్థానంబు
చేర్చగదవె వాని షిరిడి సాయి!



చి.సౌ. **గురిజాల అరవింద** - హైదరాబాదు

కం||  పరి పరి సత్కృతులకు, సో
దరి "**గురిజాల యరవింద**" దాతగనిలచున్
కరుణించి యీామె బాధ్యత
సరగున నెరవేరజేయి. సాయీా కృష్ణా!



చి. శ్రీ **ఇమ్మిడి శెట్టి ప్రభాకర రావు**. హైదరాబాదు

ఉ||  సొమ్మును పుచ్చుకొమ్మనుచు చోద్యముగా దరిజేరియిచ్చు- గ్రం
ధమ్ముల నచ్చువేయనిరతమ్ము **ప్రభాకర రావు** దీక్ష -నీ
**యిమ్మిడి శెట్టి** వంశజున కీతని పత్నికి. బిడ్డలందు - భ
ద్రమ్ములు గూర్చి బ్రోవుము సతమ్మును - సత్కృప-సాయి సద్గురూ!



చి. శ్రీ **పాతపల్లె వెంకటరమణ** - ఇ.వి. పల్లె

కం||  నియమితగతి మానవ సే
వయు - నీ సేవయు నెఱపును - స్వార్థము లేదెం
తయు, సాయీా! కృపగను నా
ప్రియ శిష్యుని **పాతపల్లె వేంకట రమణున్.**

(ప్రచురణ కర్త)



# రాజపోషకులు – కృతజ్ఞతలు

స్వర్గీయ శ్రీమతి **పఠానేని సుబ్బలక్ష్మి** గారి స్మృతి చిహ్నముగా
భర్త చి. శ్రీ **రామచంద్ర రావు** గారు రూ. **619/-**

గీ|| భక్తి విజ్ఞాన వైరాగ్య భరితమగుచు
పరగను నిగమ నిగమాంత సారమైన
కృష్ణు నోటినుండి వెలువరింప బడిన
ఖండ ఖండాతర ఖ్యాతిఁ గన్నయట్టి
యమలమగు భగవద్గీత నాదరమున
తీపిచే పెదు తియ్యని తెలుగులోన
ననువదించెను 'బాపట్ల హనుమ' సుకవి
మరల దాని నచ్చొత్తు సమయ మెఱింగి
**సుబ్బలక్ష్మి**! మహాసాధ్వి! శుభచరిత!
ఆరువందల పందొమ్మి దైన ద్రవ్య
మర్థ గతినిచ్చె నీభర్త బ్రహ్మలోక
ప్రాప్తి చేకూరగా నీకు ప్రథితగతిని
శ్రీ **పఠానేని** సత్కుల శ్రేష్ఠుడితడు
జగతి **శ్రీవత్స** సద్గోత్ర సంభవుండు
'అన్న'గా నన్ను సద్భక్తి నాదరించు
సౌమ్య గుణమూర్తి **శ్రీరామచంద్ర రావు**!



చి. శ్రీ **అచ్యుత నారాయణ శ్రేష్ఠి** – అనంతపూర్, రూ. **516/-**

కం|| కోరిన వెంటనె **అచ్యుత**
**నారాయణ** శ్రేష్ఠి పంపినాడు ధనంబున్
కోరిన వరంబులను వి
స్తారముగా నీయుగదవె! సాయీ కృష్ణా!



చి. శ్రీ **మామిడిబత్తుల పార్థసారధి**, చి. శ్రీమతి **రమామణి**
దంపతులు - హైదరాబాదు. రూ. **503/-**

ఉ॥ సాయము చేసినారు మును-సాయి కృతుల్ ప్రకటింప, నిప్పుడున్
మాయురె! దాతలై నిలచె- మామిడి బత్తుల వంశవర్ధనున్
శ్రీయుత **పార్థసారధిని** - చెల్లి **రమామణినిన్**-కుటుంబమున్
పాయక బ్రోచుగావుత కృపాకరుడై షిరిడీ శుడెల్లడన్.



చి. శ్రీ **దాలిపర్తి నారాయణ రావు** గారు Advocate, హైదరాబాదు.
వీరియందు సద్భక్తితో - ప్రేమతో కుమారుడు చి. **నాగేష్**- రూ. **503/-**

మ॥ న్యాయము నెగ్గురీతి పలు వ్యాజ్యములందున న్యాయవాదిగా
శ్రేయము గూర్చినాడు దరిజేరిన వారికుదార బుద్ధితో
సాయమొనర్చినాడు తగు సాక్ష్యము జూపి జయంబుగాంచ నా
ప్యాయత నల్పదేడులట **బందరు** పట్టణమందు దీక్షతో
ప్రాయముమించి, '**దుర్గ**' తన భార్య దివంబును జేర "నాయెడస
మాయని ప్రేమ జూతురు కుమారులు నల్వురటంచు వారిపై
తీయని దృష్టినింపుకొని తిన్నన **భాగ్యపురంబు** జేరి ని
త్యాయత భక్తి సాయివిభు కర్చన జేయుచు - శాంతచిత్తుడై
నాయనగారి సత్కృతుల నవ్యత నచ్చగ నుద్యమించి పా
రాయణ జేసి హాయిగను ప్రాజ్ఞుడు - పుణ్యుడు - నాకు మిత్రుడున్,
శ్రేయుతుడున్ పరాత్పరుడు షీర్డి నివాసుడు **దాలిపర్తి నా
రాయణ రావు** గారిని నిరంతరమున్ కృపబ్రోచుగాత! దీ
ర్ఘాయువు పుత్ర పౌత్రనికరంబు సుఖప్రదమై విరాజిలన్
జేయుచు సాయి కెల్లరును సేవలొనర్చెడి శక్తి నిచ్చుతన్!

గీ॥ **సూర్య భగవాన్ - సురేష్ - శ్యామ సుందరుండు**
మరియు **నాగేషు** యనెడు కుమారవరులు
సతులతో కూడి సేవలు సలుపువారు
తండ్రి కింపైన పనియని తలచి మదిని
సుతుడు **నాగేషు** కూడ నీకృతికి జేరె
రాజపోషకుడుగ తగు ద్రవ్యమిచ్చి!
కృపను రక్షించు వీరల కృష్ణసాయి!



చి. శ్రీ **రాఘువాపురపు వేంకట లక్ష్మీ నాగరాజు**, చెరువు రూ. **503/-**

గీ|| **రాఘువాపురపు** కులా భరణమితండు
సంగ **వేంకటయుత లక్ష్మి నాగరాజు**
సాయికృతులకు రాజపోషకుడు నయ్యె
వీని - సతిని - కుటుంబమున్ - వివిధ భోగ
భాగ్య సంతుష్టు లొసగి కాపాడ గదవె!
కృపను బరపుచు సతము శ్రీకృష్ణసాయి!



చి. శ్రీ **పేరేపు సుబ్బారావు**

\- చి. శ్రీమతి **సుబ్బలక్ష్మి** దంపతులు శ్రీకాకుళం, రూ. **503/-**

కం|| **పేరేపు** సుబ్బారావును
కూరిమి సతి సుబ్బలక్ష్మి - కూర్చిరి ధనమున్
వీరల కోర్కెలు తీరగ
ద్వారక సాయీశ! సతము దయజూడగదే!



కీ.శే. **చిత్తర్వు రామకృష్ణ** సంస్మరణార్థముగ కుమార్తె

చి.సౌ. **చిత్రపు కళ్యాణి** రూ. **503/-**

గీ|| ప్రముఖుడైన **నాగేశ్వర రావు** సతని
పత్ని **సీతామహాలక్ష్మి** - పరమసాధ్వి
సద్గుణనిధులు **చిత్తర్వు** వంశంబువారు
బ్రాహ్మణులు - **భరద్వాజ** గోత్రంబువారు
కలరు మున్ను **మామిడి కోళ్ళ** గ్రామమందు.

ధర్మమార్గ వర్తనులు 'చిత్తర్వు' వారు
గర్వ మెఱుగని ఘనులు 'చిత్తర్వు' వారు
ధరణి యూర్వేలవారు 'చిత్తర్వు' వారు
తరతరము కరణాలు 'చిత్తర్వు' వారు

పుణ్యదంపతులగు వార్కి పుట్టినవాడు
మంచి ఘడియఁ దృతీయ కుమారవరుడు
పూవు పుట్టిన తోడనే తావిఁ గొలువు,
**రామకృష్ణ** యనగా వాని నామ మబ్బె!

సీ|| 'వృత్తి' పట్టము బొంది - విత్తమార్జింపక
బాధ్యతల్ గొన నింటిపట్టు జేరె!
వ్యవసాయమును జేసి - యాయాస మెఱుఁగక
ధనమునార్జించి పేదరిక మడచె!
అనుజులు వైద్యవిద్యలు నేర్చి నిపుణులై
పదవులందుండ సంబరము పడియె!
చెప్పించె చదువులు చెల్లియలకు సైత
మందరకును వివాహములు జరిపె!
సోదరుల్ మెచ్చగా సొంతబిడ్డలకన్న
మించునట్లాస్థిని పంచి పెట్టె!

గీ|| విపుల సత్కీర్తి సాంద్రుడై వెలిగినాడు
జన్మ సాఫల్యతను గాంచ జాలినాడు!
శ్రమల నెఱుంగని **చిత్తర్వు రామకృష్ణ**
భువిని - విధివశంబున వీడి దివికి జేరె!

కం|| పుత్రికలందున నగ్రజ
**చిత్రపు కళ్యాణి** తండ్రిస్మృతి చిహ్నముగా
నాత్రత పంపె ధనమును ప
విత్రము గీతామృతంబు వెలువడు వేళన్

గీ|| అఖిల భాగ్యము లిష్టకామ్యములదీర్చి
కృపను సాయి బ్రోచుత! రామకృష్ణ జనుల

(ప్రచురణ కర్త)



శ్రీ మామిళ్ళపల్లి చిన కోటేశ్వర రావు - వీరి ధర్మ పత్ని సౌ. లక్ష్మీ తులసి- [illegible]



[illegible] శ్రీ వేముల సూర్య ప్రకాశ రావు - వీరి ధర్మ పత్ని సౌ జ్యోతి - [illegible]



[illegible] శ్రీ DR గోటేటి వేంకట చలపతి రావు - వీరి ధర్మ పత్ని సౌ. కమలా దేవి [illegible]



చి. శ్రీ రామవరపు వెంకట లక్ష్మి
నాగరాజు చెరువు



చి. శ్రీ అచ్యుత నారాయణ శ్రేష్ఠి
అనంతపురం



చి. శ్రీ పాతపల్లె వెంకట రమణ
కె. వి. పల్లె



చి. శ్రీ బాపట్ల శ్రీకృష్ణ శర్మ
చి. సౌ. బాపట్ల నగరాజ సత్యవతి దంపతులు



స్వర్గీయ నాదెండ్ల సుందర సాక్షీ కామేశ్వరి గారు
విజయవాడ

(1929 - 1964)



స్వర్గీయ గంద్రపు శివప్రసాద రావు గారు
మచిలీపట్టణము



వీరి భార్య శ్రీమతి వాణమ్మ గారు





కుమార్తె శ్రీమతి నిర్మల

స్వర్గీయ ఘండికోట విజయ లక్ష్మి గారు



జననం: 10-9-1956 శ్రీసాయిసాయుజ్యము 11-5-2000.

స్వర్గీయ సాదినేని శ్రీనివాస చక్రవర్తి
రాజమండ్రి



చి శ్రీ దాలిపర్తి నారాయణ రావు గారు
Advocate హైదరాబాదు



చి. శ్రీ ఇమ్మిడి శెట్టి ప్రభాకర రావు
హైదరాబాదు



చి. శ్రీ పేరేపు సుబ్బారావు, సౌ. సుబ్బలక్ష్మి దంపతులు
శ్రీకాకుళం



చి. శ్రీ పరానేని రామచంద్ర రావు - వీరి భార్య స్వర్గీయ సుబ్బ లక్ష్మి గారు
హైదరాబాదు.



కీ.శే. చిత్తర్వు రామకృష్ణ గారు, మామిడికోళ్ళ



## ఇది వరకే మహారాజ పోషకులు మరల యీ కృతికి సాయమొనరించిన దాతలు

| | |
|---|---|
| స్వర్గీయ సాదినేని శ్రీనివాస చక్రవర్తి జ్ఞాపకార్థముగా తండ్రి శ్రీ సాదినేని బుచ్చయ్య చౌదరి - రాజమండ్రి | రూ. **1116/-** |
| చి. శ్రీ **DR. గోటేటి వేంకట చలపతి రావు** - వీరి ధర్మ పత్ని చి.సౌ. **కమలాదేవి** - కాకినాడ | రూ. **1116/-** |
| చి. శ్రీ **పొత్తూరి పాండు రంగ విఠల్**, వీరి ధర్మపత్ని చి. సౌ. **విజయ కుమారి**, సికిందరాబాదు | రూ. **656/-** |
| చి.సౌ **గురిజాల అరవింద**, హైదరాబాదు | రూ. **620/-** |
| చి. శ్రీ **ఇమ్మడి శెట్టి ప్రభాకర రావు**, హైదరాబాదు | రూ. **558/-** |
| చి. శ్రీ అచ్యుత నారాయణ శెట్టి , అనంతపురం | రూ. 516/- |
| చి. శ్రీ దేవరకొండ సన్యాసి రాజు A E. శ్రీకాకుళం | రూ. 516/- |
| చి. శ్రీ M. పార్థసారధి, శ్రీమతి రమామణి దంపతులు, హైదరాబాదు | రూ. 503/- |
| చి. శ్రీ N.C. మురళీధర్, మౌలాలి. | రూ. 503/- |
| చి. శ్రీ జానపాటి సుబ్రహ్మణ్య శర్మ, పర్చూరు | రూ. 348/- |
| చి. శ్రీ కనుమూరి సాంబశివరావు, హైదరాబాదు | రూ. 251/- |
| చి. శ్రీ D.M. దుర్గా రావు, రాజమండ్రి. | రూ. 232/- |
| చి. శ్రీ తాడూరి దేశికులు, మోహనరావు పేట. | రూ. 232/- |
| చి. శ్రీ పాతపల్లె వెంకట రమణ, ఇ.వి. పల్లె | రూ. 150/- |
| శ్రీమతి చెన్నా అమ్మన్న, తాడేపల్లి గూడెం. | రూ. 116/- |
| శ్రీమతి G. రాజ్యలక్ష్మి - బళ్ళారి. | రూ. 116/- |
| చి. శ్రీ శేషగిరి సత్యనారాయణ, తాడేపల్లి గూడెం. | రూ. 116/- |
| చి. శ్రీ R.V.L. నారాయణ రావు, గుంటూరు | రూ. 116/- |
| చి. శ్రీ D. నాగేశ్వర రావు - తుని | రూ. 116/- |

## ఈ కృతికి మహారాజపోషకులుగ చేరినవారు

| | |
|---|---|
| శ్రీ పిన్నమనేని వేంకటరత్నం గారు, విజయవాడ. (9-1-2001 న కీర్తిశేషులైరి) | రూ. **10,001/-** |
| స్వర్గీయ శ్రీమతి ఘండికోట విజయలక్ష్మి స్మృతి చిహ్నముగా అక్కగారు చి.సౌ. **జయంతి అన్నపూర్ణ** - సికిందరాబాదు | రూ. **5116/-** |
| ఒక **సాయి భక్తురాలు** - హైదరాబాదు | రూ. **3650/-** |
| స్వర్గీయ **నాదెళ్ళ** సుందర సాక్షి కామేశ్వరి గారి జ్ఞాపకార్థముగా కుమార్తె చి.సౌ. **మాధవ పెద్ది ఫణి రాధాకుమారి**, హైదరాబాదు | రూ **1700/-** |
| స్వర్గీయ **అయ్యావారి** వెంకట సూర్య సుబ్బారాయుడు గారి సంస్మరణార్థం భార్య విజ్ఞానవతి - కుమాళ్ళు, **చి. రాజేష్, చి. శ్రీనగేష్, చి. శ్రీరామ్‌లు**- భీమవరం | రూ **1116/-** |
| చి. శ్రీ వేముల సూర్య ప్రకాశ **రావు**, వీరి ధర్మ పత్ని చి.సౌ. **జ్యోతి** - అశ్వారావు పేట | రూ. **1116/-** |
| స్వర్గీయ గంధ్రపు శివ ప్రసాద **రావు** గారి సంస్మరణార్థం భార్య **వాణమ్మ**. మచిలీ పట్టణము. | రూ. **1116/-** |
| చి. శ్రీ **K. అనంత పద్మ నాభ రావు**, యేలేశ్వరం | రూ. **1100/-** |
| చి. శ్రీ ప్రభా వెంకట సుబ్రహ్మణ్య శర్మ - వీరి ధర్మ పత్ని చి. సౌ. **దుర్గ**, విశాఖపట్టణము | రూ. **1016/-** |
| చి. శ్రీ **మామిళ్ళపల్లి చినకోటేశ్వర రావు**. వీరి ధర్మపత్ని చి.సౌ. **లక్ష్మి తులసి**, సూరప్ప వారి గూడెం | రూ. **1016/-** |
| మాతృమూర్తి స్వర్గీయ **బాపట్ల కామేశ్వరమ్మ** గారి సంస్మరణార్థం కుమార్డు చి. శ్రీ **బాపట్ల కృష్ణ శర్మ**, వీరి ధర్మ పత్ని చి.సౌ. **నగరాజ సత్యవతి** - బాపట్ల | రూ **1016/-** |
| శ్రీ **ముద్దా వెంకట సుబ్బారావు** - వీరి ధర్మ పత్ని చి.సౌ. **లక్ష్మి వెంకటరమణమ్మ** - నల్లూరు | రూ **1016/-** |
| శ్రీ **చందూరి వెంకట సీతారామయ్య** - వీరి ధర్మ పత్ని చి.సౌ. **కామేశ్వరమ్మ** - సరిపల్లె | రూ. **1016/-** |

## కొంత పైకం చెల్లించిన మహారాజ పోషకులు

| | |
|---|---|
| శ్రీ P B వెంకట రెడ్డి I.F S. హైదరాబాదు | రూ. 189/- |
| శ్రీమతి DR. కోకా రంగమణి - ప్రశాంతి నిలయమ్ | రూ. 350/- |

## కొంత పైకం చెల్లించిన రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీమతి ముప్పలనేని ఉదయ లక్ష్మి - బాపట్ల | రూ. 236/- |
| శ్రీ O శంకర బాబు - కొత్త చెరువు | రూ. 216/- |
| శ్రీ కాపర్తి తిమ్మా రత్నం - హైదరాబాదు | రూ. 198/- |
| శ్రీ K వెంకోబరావు - ఉలవపాడు | రూ. 198/- |
| శ్రీ P. సర్వేశ్వర రావు - విజయవాడ | రూ. 153/- |
| శ్రీ P.V.A శేషగిరి రావు - కోవూరు | రూ. 136/- |
| శ్రీ M వెంకట రెడ్డి B A.B.L - తణుకు | రూ. 116/- |
| శ్రీ వెంపటి శ్రీ రామ మూర్తి - కాకినాడ | రూ. 100/- |
| శ్రీ T. లక్ష్మి నారాయణ - కర్నూలు | రూ. 100/- |

## ఈ కృతికి రాజపోషకులు గా చేరినవారు

| | |
|---|---|
| చి శ్రీ పరానేని రామచంద్ర రావు - హైదరాబాదు | రూ **619/-** |
| చి శ్రీ వాలిపర్తి నాగేష్ - హైదరాబాదు | రూ. **503/-** |
| చి. శ్రీ పేరేపు సుబ్బా రావు, చి.సౌ. సుబ్బలక్ష్మి దంపతులు, శ్రీకాకుళం | రూ. **503/-** |
| చి. శ్రీ రాఘవాపురపు వెంకట లక్ష్మి నాగరాజు - చెరువు | రూ. **503/-** |
| స్వర్గీయ చిత్తర్వు రామకృష్ణ గారి సంస్మరణార్థము గా కుమారుడు- భార్య- కుమార్తెలు - మామిడి కోళ్ళ | రూ. **503/-** |
| శ్రీ యస్. రాధాకృష్ణన్ - సికిందరాబాదు | రూ. **503/-** |

## రూ. 350/- లు చెల్లించిన జీవిత సభ్యులు

శ్రీ నేరెళ్ళ మోహన రావు - గుంటూరు

శ్రీ P.V.R శంకర్ - గుంటూరు

శ్రీ తమ్మనగరుడ స్వామి - చిలకలూరి పేట

శ్రీ గుడ్రం సుబ్బా రావు - శ్రీమతి లక్ష్మి సరస్వతి దంపతులు - చిలకలూరి పేట

శ్రీ N తులసీ దాసు - రాయగడ

శ్రీ P రమేష్ బాబు - హైదరాబాదు

శ్రీ K S R. శర్మ - హైదరాబాదు

శ్రీమతి V B. విజయ - హైదరాబాదు

శ్రీ Y S N మూర్తి - హైదరాబాదు

శ్రీ V K.R V భారతి సారధి దంపతులు - హైదరాబాదు

శ్రీ M శివ కుమార్ - హైదరాబాదు

శ్రీమతి ఓగేటి కుసుమ కుమారి - హైదరాబాదు

శ్రీమతి వీరమాచినేనిఝాన్సీ లక్ష్మి - హైదరాబాదు

శ్రీ K నాగేశ్వర రావు - హైదరాబాదు

శ్రీ K E C విద్యా సాగర్ - సికిందరాబాదు

శ్రీ లింగోలు పట్టాభి రామయ్య - రాంబెల్లి

శ్రీ G V సీతా రామరాజు - రాంబెల్లి

శ్రీ ఉపాధ్యాయుల సత్యనారాయణ మూర్తి - రాంబెల్లి

శ్రీ ప్రత్తి పాటి చిన్నా రావు - S రాయవరం

శ్రీ కొలిపాకుల గురువులు - విజయవాడ

శ్రీమతి V సీతా మాధవి - తెనాలి

శ్రీ గుంటు సుధాకర రావు - కనిగిరి

శ్రీ D.N S S. శ్రీనివాస రావు - సికిందరాబాదు

శ్రీ పిల్లారిశెట్టి కృష్ణ మూర్తి, శ్రీమతి ప్రభావతి దంపతులు- హైదరాబాదు

శ్రీ Dr. G V సర్వేశ్వర రావు - హైదరాబాదు

శ్రీ నందిగాం వీరభద్ర రావు - గోపాల పల్లె

శ్రీ చోడె మీనాక్షిరావు - ఏలూరు

శ్రీ పెమ్మరాజు బాపిరాజు - అత్తిలి

శ్రీ వాసవి ఆర్యవైశ్య వృద్ధాశ్రమము - నరుకూరు

శ్రీ ప్రత్తిపాటి సత్తిరాజు - కొదుప్రోలు

శ్రీ L వెంకటేశ్వర రావు - తిమ్మాపురం

శ్రీ బచ్చు శ్రీనివాస రావు - దాచేపల్లి

శ్రీ గుంటూరు శేష సాయి బాబా, శ్రీమతి సుబ్బలక్ష్మి దంపతులు - సూరప్ప వారి గూడెం

శ్రీమతి దాట్ల లక్ష్మి శేష కుమారి - కోలంక

చి కుమారి, కొదూరి అమరేశ్వరి - చెరువు

## ఈ కృతికి పోషకులు

| | |
|---|---|
| శ్రీమతి దాసరి బేబీ - రామవరప్పాడు | రూ. 250/- |
| శ్రీ E.N S ప్రతాప్ రాజమండ్రి | రూ. 216/- |
| శ్రీ టిసవహి వీరేశ్వర రావు - హైదరాబాదు | రూ. 200/- |
| శ్రీ B S.N మూర్తి, శ్రీమతి ప్రమీలా రాణి - హైదరాబాదు | రూ. 200/- |
| శ్రీ J.L. స్వరూప్ - ప్రసన్న దంపతులు - హైదరాబాదు | రూ. 200/- |
| శ్రీ ఈరంకి వెంకట్రావు - తుని | రూ.200/- |
| శ్రీ కొత్తమాసు ఉదయ భాస్కర రావు - చేబ్రోలు | రూ.183/- |
| శ్రీ B. అదృష్ట రావు - హైదరాబాదు | రూ. 150/- |
| శ్రీమతి N.L. లక్ష్మి రాణి - తుని | రూ.161/- |
| శ్రీ R.L. నరసింహా రావు - బద్వేలు | రూ. 150/- |

## రూ. 116/- లు చెల్లించిన పోషకులు

శ్రీ మాధవి పెద్ది కాళిదాసు - హైదరాబాదు

శ్రీ R. వెంకటేశ్వర్లు - హైదరాబాదు

శ్రీ P. చంద్ర శేఖర్ - హైదరాబాదు

శ్రీ ఎర్రగుంట్ల కృష్ణ కుమార్ - రాజమండ్రి

శ్రీ Ch. వీరరాఘవ రావు చౌదరి - రాజమండ్రి

శ్రీ నారాయణం అప్పలాచార్యులు - ఒంగోలు

శ్రీ BH. వరద రాజులు - తిరుపతి

శ్రీ M.A. మూర్తి - విశాఖ పట్టణం

శ్రీ P. రామకృష్ణ - విజయవాడ

శ్రీమతి Dr M నిర్మలారాంగోపాల్ - గుంటూరు
శ్రీమతి చంద్రమౌళి అన్నపూర్ణ విశాలక్ష్మి - బాపట్ల
శ్రీ S. జయ చంద్రారెడ్డి - ధర్మవరము
శ్రీమతి M. చంద్రికా మణి - నెల్లూరు
శ్రీమతి నెల్లూరు ధనలక్ష్మి - నెల్లూరు
శ్రీ N V శేషయ్య గారు - నెల్లూరు
శ్రీ A ప్రభాకర రావు - కాకినాడ
శ్రీ L. శోభారాం సింగు - గోపవరం
శ్రీ K V N. రామచంద్ర రావు - మచిలీ పట్టణం
శ్రీ M పాండు రంగం - హైదరాబాదు
శ్రీ P.V. రాఘవయ్య - గుంటూరు
శ్రీ పులిపాక రామమోహన్ - గుంటూరు
శ్రీ R రామచంద్ర రావు - మార్కాపురం
శ్రీ K. నరసింహా రావు - పాలకొల్లు
శ్రీ D. కేశన్న - నెల్లూరు
శ్రీ D. లక్ష్మి కాంతం - సికిందరాబాదు

## పోషకులు

| | |
|---|---|
| శ్రీ M.L. రావు - హైదరాబాదు | రూ. 58/- |
| శ్రీమతి K తులసి - హైదరాబాదు | రూ. 51/- |
| శ్రీ B నాగబాబు - హైదరాబాదు | రూ. 45/- |
| శ్రీ B.J. సింగు - హైదరాబాదు | రూ. 45/- |
| శ్రీ B.V సుబ్బారావు - హైదరాబాదు | రూ. 45/- |
| శ్రీ చీరాల రామకృష్ణా రావు - ఒంగోలు | రూ. 45/- |
| శ్రీ నిమ్మల వెంకటేశ్వర రావు - ఏలూరు | రూ. 45/- |
| శ్రీ Ch. ప్రకాశరావు - బలిగాం | రూ. 45/- |
| శ్రీ D. శివరామరాజు - మండపేట | రూ. 45/- |



# విషయ సూచిక





ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# ప్రార్థన

శా. శ్రీ కారుణ్య మెలర్ప భారత రణోర్విన్ మోహియై కౌరవా
నీకంబున్ బరిమార్ప జంకు విజయున్ వీక్షించి యధ్యాత్మ వి
ద్యాకల్పంబగు గీతలన్ బలికి బ్రహ్మజ్ఞానమున్మార్చు రా
ధా కృష్ణాత్మిక చిన్మయున్ గొలుతుఁ దత్త్వజ్ఞాన సంసిద్ధికిన్.

కం. గీతాశాస్త్ర ప్రవచనా
ద్వైతామృత భాష్య రచన దక్షుల, మురజిత్
భూతేశాంశజులను, సం
ప్రీతిన్ భజియింతు వ్యాస, శ్రీ శంకరులన్.

గీ. సంస్కృతాంధ్ర భాషార్థ విశారదులగు
ప్రాక్తనాధుని కులఁ గవి వల్లభులను,
భక్త వర్యుల సతము సద్భక్తిఁ గొలుతు
శిష్య వాత్సల్యమున శుభాశీస్సులిడగ.

పితృస్తుతి.

సీ. అమల బాపట్ల వంశాబ్ధి సోముఁడు వీర
యామాత్యుఁ డెవని పితామహుండు,
అపర ధన్వంతరి యగు భగవానుఁడే
ధన్య చరిత్రుని దత్త పితృఁడు,
అనఘ చన్నాప్రగడాన్వయ కృష్ణాఖ్యుఁ
డెన్న నేబుధవర్యుఁ గన్నతండ్రి,
ఘన గంగరాజు వేంకటరత్న మంత్రియే
మాన్యునకు జనక మాతులుండు,

గీ. రాజమాంబిక యేని గారాము తల్లి,
అట్టి ధీవరు చెఱువు గ్రామాధికారి
జానకీరామ పూజా ప్రసక్తు, వీర
యార్యు, మత్ప్రియ జనకు నేనభినుతింతు.

మాతృస్తుతి.

సీ. శ్రీల విరాజిల్లు శిఖరము ఆదినా
రాయణ మంత్రి యేయమకుఁ దాత,
దేవ గురు ద్విజ సేవనా పరకీర్తి
రామ కృష్ణాఖ్యుఁడే లేమ తండ్రి,
గ్రామాధికార నిర్వహణుఁడు వేంకటా
చలపతి విబుధుఁడే సతికి భ్రాత,
ఘనత బ్రహ్మాండ వేంకటరత్న మాన్యుఁడే
మానినికి ననుంగు మేనమామ,

గీ. అట్టి యాంధ్ర గీర్వాణ విద్యా ప్రవీణ
పతి పదాంబుజ యుగళ సేవాధురీణ
చిన్న పున్నమాంబిక సత్ప్రసిద్ధ చరిత
సదయ హృదయను మత్ప్రియ జననిఁ దలఁతు.



ఓమ్ శ్రీకృష్ణాయనమః

# శ్రీమద్భగవద్గీతామృత మాహాత్మ్యము

ధరోవాచ.

శ్లో|| భగవన్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ |
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో ||

భూదేవి అడుగుచున్నది.

ఆ.వె. భక్తవరద! కృష్ణ! పరమేశ! ప్రారబ్ధ
మనుభవించుచున్న మనుజునకును
జలన రహితమైన సద్భక్తి యెవ్విధిఁ
గలుగఁ గలదొ కరుణఁ దెలుపఁ గదవె. 1

విష్ణురువాచ

శ్లో|| ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరత స్సదా |
స ముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ||

విష్ణుమూర్తి చెప్పు చున్నాఁడు.

గీ. అవని! ప్రారబ్ధ కర్మంబు ననుభవించు
నాతఁడైన గీతాభ్యాస మందు సతము
సక్తుఁడైనచో మనుజుండు ముక్తుఁడై సు
ఖంబుఁ గాంచు, బంధింపవు కర్మలతని. 2

శ్లో|| మహా పాపాదిపాపాని గీతాధ్యానం కరోతిచేత్ |
క్వచిత్ స్పర్వం న కుర్వన్తి నలినీదల మంభసా ||

గీ. అనవరతమును గీతాధ్యయన మొనర్చు
భక్తులను మహాపాపాది పాపనిచయ
మంటఁజాల దేకాలమందైనఁగాని
నళినపత్రస్థితంబైన జలము పగిది. 3

శ్లో॥ గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై ॥

ఆ.వె ఏ ప్రదేశ మందు నెసఁగు గీతాశాస్త్ర
మెచట గీతలు పఠియింపఁ బడునొ;
ఆ ప్రదేశమునఁ బ్రయాగాది సర్వతీ
ర్థంబు లుండు సుస్థిరంబుగాగ. 4

శ్లో॥ సర్వేదేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।
గోపాలాగోపికావాఽపి నారదోద్ధవ పార్షదైః
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతాప్రవర్తతే ॥

ఆ.వె ఎల్ల దివిజ వరులు ఋషులు యోగులుఁ బన్న
గులును గోప గోపికలును నార
దుఁడును మఱియు నుద్ధవుఁడు పార్షదుల్ గీత
లుండు చోట సాయముంద్రు వేగ. 5

శ్లో॥ యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి స దైవ హి ॥

గీ. అధిక భక్తిని గీతార్థ మరయు చోటఁ
జదువఁగాఁ జేయు చోటను, జదువు చోటఁ
వినుచు నుండెడి చోటఁ బృథ్వీమ తల్లి!
నేను నివసింతు నెవ్వేళ నిశ్చయముగ. 6

శ్లో॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్ ॥

గీ. ఇట్టి గీతల నే నాశ్రయించి యుందు,
గీతలే నాకు గృహమగు, గీత లందు
నమరు జ్ఞానంబు నే సముపాశ్రయించి
మూఁడు లోకముల్ పాలింతుఁ బుణ్యశీల! 7

శ్లో॥ గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః।
అర్థమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా॥

గీ. అర్థమాత్రాక్షరంబు, బ్రహ్మస్వరూప
మవ్యయము నిత్యమైన గీతామృతంబుఁ
బరమ పావన కరమైన బ్రహ్మవిద్య
యనుట కించు కేనియు సంశయంబు లేదు. 8

శ్లో॥ చిదానన్దేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్।
వేదత్రయీ పరానన్దా తత్త్వార్థజ్ఞానమంజసా॥

గీ. మహిత తత్త్వార్థ విజ్ఞాన మార్గబోధ
నంబు, వేద త్రయీ పరానంద వర్ధ
నమగు గీతామృతముఁ జిదానంద రూపుఁ
డైన కృష్ణుండు బోధించె నర్జునునకు. 9

శ్లో॥ యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చల మానసః।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్॥

గీ. అనుదినంబు నష్టాదశాధ్యాయములను
నిశ్చల స్వాంతుఁడగుచు ధ్యానించు నతఁడు
జ్ఞాన సంసిద్ధిఁ బొంది యనంతరమున
నవ్యయంబైన మోక్షంబు నందు చుండు. 10

శ్లో॥ పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః॥

గీ. అవ్విధమున నష్టాదశాధ్యాయములను
బూర్ణముగఁ బఠింపఁగ లేని పూరుషుండు
సర్థ భాగమేన్ జదువంగ నగును, దానఁ
బొందు చున్నాఁడు గోదాన పుణ్య ఫలము. 11

శ్లో|| త్రిభాగం పఠమానస్తు గంగాస్నాన ఫలం లభేత్ |
షడంశం జపమాన స్తు సోమయాగ ఫలం లభేత్ ||

గీ. ఇందు మూఁడవ భాగము నేనిఁ జదువు
వాఁడు పొందు గంగాస్నాన ఫలము, గీత
లందు నాఱవ భాగము నైనఁ జదువ
భూమి! సోమయాగ ఫలంబుఁ బొందు నరుఁడు. 12

శ్లో|| ఏకాధ్యాయంతు యోనిత్యం పఠ తే భక్తి సంయుతః |
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్ ||

ఆ.వె. అనుదినంబు నొక్క యధ్యాయ మేనియుఁ
జాల భక్తి తోడఁ జదువఁ జాలు
నతఁడు రుద్రలోక మంది యందునఁ జిర
కాల ముండుఁ బ్రమథ గణము తోడ. 13

శ్లో|| అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః |
స యాతి నరతాం యావన్మనుకాలం వసున్ధరే ||

ఆ.వె. అనుదినంబు నొక్క యధ్యాయ మందు స
ద్భక్తిమైఁ జతుర్థ భాగమేనిఁ
జదువు నరుఁడు మనుజ జన్మంబుఁ బొందు మ
న్వంతరంబు వఱకు నయచరిత్ర! 14

శ్లో|| గీతాయాః శ్లోక దశకం సప్తపంచ చతుష్టయమ్ |
ద్విత్రిఏకం తదర్థం వా శ్లోకానాం యః పఠేన్నరః ||

గీ. ఇందుఁ బది శ్లోకములు గాని యేడు గాని
యైదు గాని నాల్గైన మూఁడైనఁ గాని
అరయ రెండైన నొకటైన నర్థమైన
సంతతంబున బఠియించు సజ్జనుండు, 15

శ్లో॥ చన్ద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్ ।
గీతాపాఠ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్ ॥

ఆ.వె. ఇందులోక మొంది యందునఁ బదివేల
వత్సరంబు లుండుఁ, బఠన సేయు
తరుణ మందు నెవఁడు మరణంబు నొందునో
యతఁడు దేవభావ మందు చుండు. 16

శ్లో॥ గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తిముత్తమామ్ ।
గీతేత్యుచ్చార సంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ ॥

గీ. భక్తితోడ గీతాశాస్త్ర పఠనఁజేయు
నతఁడు సన్మోక్ష మొందు నన్యంబదేల?
మరణ మందున గీతల స్మరణ సేయు
మానవుఁడు పొందు నుత్తమమైన గతిని. 17

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥

ఆ.వె. అధిక పాప చిత్తుఁడైనను గీతార్థ
మేనరుండు వినఁగ లోనసక్తిఁ
బడయుఁ గలుగు వాఁడు వైకుంఠ మందు సం
తోష మొందు విష్ణుతోడఁగూడి. 18

శ్లో॥ గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్త స్సవిజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్ ॥

గీ. నిత్య నైమిత్తికంబులౌ నిఖిల కర్మ
ములను సలిపి యీ గీతార్థమును స్మరించు
మనుజ వరుఁడు జీవన్ముక్తుఁ డనగఁ బడును;
అతఁడు మోక్షంబు నొందు దేహాంతమందు. 19

శ్లో॥ గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః ।
నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్ ॥

గీ. జనకుఁడాదిగఁ బెక్కండ్రు మనుజ విభులు
గీతల సమాశ్రయించి యీక్ష్మాతలంబు
నందు నిర్ధూత కల్మషు లగుచుఁ బొంది
రింతిరో! మోక్ష పదము దేహాంతమందు. 20

శ్లో॥ గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః ॥

గీ. వసుధరో! భగవద్గీతలఁ బఠనఁ జేసి,
యిందు, మాహాత్మ్యమును బఠియింప కున్న
వాని పఠనంబు సర్వము వ్యర్థ మగును
శ్రమము మాత్రమే పరియవసాన మగును. 21

శ్లో॥ ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః ।
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్ ॥

గీ. అవని! మాహాత్మ్య సంయుక్తమైన గీత
లను బఠించు నరుఁడు తత్ఫలంబుఁ బొందు;
అంతియే గాక యతఁడు దేహాంత మందు
నవ్యయానంద మోక్షంబు నందుఁ జుమ్మి. 22

సూత ఉవాచ

శ్లో॥ మాహాత్మ్య మేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్ ।
గీతాన్తే చ పఠేద్యస్తు య దుక్తం తత్ఫలం లభేత్ ॥

సూతుఁడు చెప్పు చున్నాఁడు

గీ. అతి సనాతన గీతామహత్త్వ మేను
బలికి నాఁడ నీ గీతలఁ బఠనఁ జేసి
పిదప, మాహాత్మ్యమును జదివిన మనుష్యుఁ
డిందుఁ జెప్పిన ఫలమును బొందు ధరణి! 23

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యమ్
సంపూర్ణమ్.

ఇది శ్రీవరాహపురాణమందు గీతామాహాత్మ్యము
సంపూర్ణము.
శ్రీ కృష్ణార్పణమస్తు.



# స్తోత్రశ్లోకములు

శ్లో|| శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ |
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే || 1

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ |
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం త మాశ్రయే || 2

## వేదవ్యాసస్తోత్రము

శ్లో|| సమ్యజ్న్యాయ కలాపేన మహతా భారతేన చ |
ఉపబృంహిత వేదాయ నమో వ్యాసాయ విష్ణవే || 3

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ |
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ || 4

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే |
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః || 5

మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషమ్ |
వేదవ్యాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహం | 6

అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః |
అఫాలలోచన శ్శంభుర్భగవాన్ బాదరాయణః || 7

## శ్రీకృష్ణస్తోత్రము

శ్లో|| కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్ |
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ || 8

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే |
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంత వేదినే || 9

సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ |
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః || 10

శ్లో|| కరకమలనిదర్శితాత్మముద్రః పరికలితోన్నతబర్హి బర్హ చూడః |
ఇతరకరగృహీత వేత్రతోత్రో మమ హృది సన్నిధి మాతనోతు కృష్ణః || 11

అతామ్రపాణికమల ప్రణయప్రతోద
మాలోలహారమణికుండల హేమసూత్రమ్ |
అవిశ్రమాంబుకణ మంబుదనీల మవ్యా
దాద్యం ధనంజయరథాభరణం మహోనః || 12

అగ్రే కృత్వాకమపి చరణం జాను నైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషాऽవేక్షమాణః |
సవ్యేతోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాభిభ్రాణో రథ మధివసన్ పాతు నఃసూతవేషః || 13

వందే కృష్ణాऽర్జునౌ వీరౌ నరనారాయణా వుభౌ |
ధృతరాష్ట్రసుతోన్మత్తగజారోహణ వల్లభౌ || 14

గీతాస్తోత్రము

శ్లో|| గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్ |
విష్ణోః పద మవాప్నోతి భయశోకాదివర్జితః || 15

భారతామృత సర్వస్వం విష్ణో ర్వక్త్రాద్వి నిసృతమ్ |
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ నవిద్యతే || 16

గీతాః సుగీతాః కర్తవ్యాః కిమన్యైః శాస్త్ర సంగ్రహైః |
యాః స్వయం పద్మనాభస్య ముఖ పద్మాద్వినిస్సృతాః || 17

గీతాధ్యయన శీలస్య ప్రాణాయామ పరశ్యచ |
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతా న్యపి || 18

అకృత్య మపి కుర్వాణో భుంజానో వా యతస్తతః |
ఘోరం వైవస్వత స్థానం గీతాధ్యాయీ న పశ్యతి || 19

మల నిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే |
సకృద్గీతాంభసి స్నానం సంసార మలమోచనమ్ || 20

శ్లో॥ శ్లోక మేకం తదర్థం వా పాదం పాదార్థ మేవ వా |
నిత్యం పఠతి యో భక్త్యా సమోక్ష మధిగచ్ఛతి || 21

సర్వ శాస్త్ర మయీ గీతా సర్వ వేద మయో హరిః |
సర్వ తీర్థ మయీ గంగా సర్వ ధర్మ మయో మనుః || 22

ఏకం శాస్త్రం దేవకీ పుత్ర గీత మేకో దేవో దేవకీ పుత్ర ఏవ |
ఏక మంత్రో దేవకీ పుత్ర నామ కర్మా ప్యేకం దేవకీ పుత్ర సేవా || 23

**ఓమ్**

అస్య శ్రీ భగవద్గీతాశాస్త్ర మహామంత్రస్య, భగవాన్ వేదవ్యాస ఋషిః
ప్రాయేణానుష్టుప్ ఛందః

క్వచిన్నానాఛందాంసి శ్రీకృష్ణపరమాత్మా దేవతా
'అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' ఇతి బీజమ్

'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' ఇతి శక్తిః
'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః' ఇతి కీలకమ్

'నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః' ఇతి అంగుష్ఠాభ్యాం నమః
'న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః' ఇతి తర్జనీభ్యాం నమః

'అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ'
ఇతి మధ్యమాభ్యాం నమః
'నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః' ఇతి అనామికాభ్యాం నమః

'పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః' ఇతి కనిష్ఠికాభ్యాం నమః
'నానావిధాని దివ్యాని నానా వర్ణా కృతీని చ'
ఇతి కరతలకర పృష్ఠా భ్యాం నమః

**ఇతి కరన్యాసః**

**అథ హృదయాదిన్యాసః**

'నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః' ఇతి హృదయాయ నమః
'న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః' ఇతి శిరసే స్వాహా
'అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ' ఇతి శిఖాయై వషట్
'నిత్యః సర్వగతః స్థాణు రచలోయం సనాతనః' ఇతి కవచాయ హుమ్
'పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,' ఇతి నేత్రత్రయాయ వషట్
'నానావిధాని దివ్యాని నానా వర్ణా కృతీని చ' ఇతి అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః
ఓం శ్రీకృష్ణ ప్రీత్యర్థే గీతాపారాయణే జపేవా వినియోగః



## ధ్యానమ్

**"ఓమ్"**

శ్లో|| పార్థాయ ప్రతి బోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ |
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మంబ! త్వా మనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణీమ్ || 1

నమోఽస్తుతే వ్యాస! విశాలబుద్ధే పుల్లారవిన్దాయత పత్త్రనేత్రః |
యేన త్వయా భారత తైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞాన మయః ప్రదీపః || 2

ప్రపన్న పారిజాతాయ తోత్ర వేత్రై కపాణయే |
జ్ఞాన ముద్రాయ కృష్ణాయ గీతామృత దుహే నమః || 3

వాచకః ప్రణవో యస్య క్రీడావస్త్వఖిలం జగత్ |
శృతిరాజ్ఞావ పుర్జ్ఞానం తం వందే దేవకీ సుతమ్ || 4

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః |
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ || 5

శ్లో॥ వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనమ్ ।
దేవకీ పరమా నన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 6

భీష్మ ద్రోణ తటా జయద్రథ జలా గాంధార నీలోత్పలా
శల్య గ్రాహవతీ కృపేణవహనీ కర్ణేన వేలాకులా ।
అశ్వత్థామ వికర్ణ ఘోర మకరా దుర్యోధనా వర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవైః రణనదీ కైవర్తకః కేశవః ॥ 7

పారాశర్య వచ స్సరోజ మమలం గీతార్థ గంధోత్కటం
నానాఖ్యానక కేసరం హరికథా సబోధనా బోధితమ్ ।
లోకే సజ్జన షట్పదైరహరహః పేపీయ మానం ముదా
భూయా ద్భారత పంకజం కలిమల ప్రధ్వంసిన శ్శ్రేయసే ॥ 8

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృ పాతమహం వందే పరమానందమాధవమ్ ॥ 9

యం బ్రహ్మా వరుణేంద్ర రుద్ర మరుతః స్తున్వంతి దివ్యైః స్తవై
ర్వేదై స్సాంగ పదక్రమోపనిషదైర్గాయం తి యం సామగాః ।
ధ్యానా వస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం నవిదు స్సురాసుర గణా దేవాయతస్మై నమః ॥ 10

అతః పరం యధార్థం సంపూజ్య పారాయణాదికం కార్యమ్



## పారాయణ సమాపన సమయాను సంధేయ శ్లోకములు

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు ॥

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ।
దేశోఽయం క్షోభ రహితో బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః ॥

అపుత్త్రాః పుత్త్రిణ స్సన్తు, పుత్త్రిణ స్సన్తు పౌత్రిణః।
అధనా స్సధనా స్సన్తు జీవన్తు శరాదాం శతమ్ ॥

మంగళం యాదవేంద్రాయ, మహనీయ గుణాబ్ధయే।
భక్తపాలన దక్షాయ రాధాకృష్ణాయ మంగళమ్ ॥

కాయేన వాచా మనసేన్ద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్।
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

యదక్షర పద భ్రష్టం మాత్రా హీనంతు యద్భవేత్।
తత్సర్వం క్షమ్యతాం కృష్ణ రాధాప్రియ నమోస్తుతే ॥

అనేన శ్రీమద్భగవద్గీతా పారాయణేన
భగవాన్ సర్వదేవాత్మకః

శ్రీరాధాకృష్ణస్సుప్రీతస్సుప్రసన్నో వరదో భవతు.
న్యూనాతిరిక్తం సర్వం సగుణమస్తు.
సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## అర్జున విషాదయోగము

### ప్రథమాధ్యాయము

ధృతరాష్ట్ర ఉవాచ

శ్లో|| ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః |
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ ||

దృతరాష్ట్రుఁ డడుగు చున్నాఁడు

ఆ.వె. శ్రీ విరాజితమును బావనమౌ కురు
క్షేత్రమందు సమితిఁజేయు మతిని
నాదు సుతులుఁ బాండు నందనుల్ సంజయా!
చేరి యేమి చేసినారొ? చెప్పుమ. 1

సఞ్జయ ఉవాచ

శ్లో|| దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా |
ఆచార్యముపసఙ్గమ్య రాజా వచన మబ్రవీత్ ||

సంజయుఁడు చెప్పు చున్నాఁడు

కం. జన నాయకుఁడౌ దుర్యో
ధనుఁడంతటఁ బన్ని యున్న దాయల బలమున్
గని ధనురాచార్యుని దా
పునకుం జని పలికె నిట్లు భువనాధీశా! 2

శ్లో|| పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్ |
వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవ శిష్యేణ ధీమతా ||

ఆ.వె. నీతి కోవిదుండు నీదు శిష్యుఁడు ద్రుప
దాత్మ భవుని చేత నాహవమునఁ
బన్ని యున్న విపుల పాండవ సైన్య మా
చార్యవర్య! చేరి యరయఁగదవె. 3

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥

ఆ.వె. అందు భూరి చాప హస్తులు భీమార్జు
నులను సమితిఁ బోలు బలులు గలరు
వీరు సాత్యకియును విరటుఁడు మఱి మహా
రథికుఁడైన ద్రుపద రాజవరుఁడు. 4

శ్లో॥ ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।
పురుజిత్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః॥

ఆ.వె. చెలఁగ ధృష్టకేతు చేకితానులు, నర
పుంగవుండు శైబ్య భూవిభుండు
ఘనుఁడు వీర్యధనుఁడు కాశీ నృపాలుండు
పురుజితుండుఁ గుంతి భోజనృపతి. 5

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥

ఆ.వె. ఉత్తమౌజవీరుఁ డురు బలాఢ్యుఁడు యుధా
మన్యు నృపతియు నభిమన్యుఁ డతుల
దర్పవంతులైన ద్రౌపదీ నందనుల్
వీరలందఱును మహారథికులు. 6

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యేతాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥

గీ. బ్రాహ్మణోత్తమ! యీ మన వారి లోన
ముఖ్యు లెవ్వరో నా సైన్యమునకు నధిపు
లైన వారిని నీకు సంజ్ఞార్థముగను
దెలుపుదును వారి నెల్లరఁ దెలిసి కొనుమి. 7

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ॥

ఆ.వె. విప్రవర్య! నీవు భీష్ముండు కర్ణుండు
నాజి విజయశీలుఁడౌ కృపావ
నీసురోత్తముండు, నీ తనూజుండు భూ
రిశ్రవుఁడు వికర్ణ నృపవరుండు. 8

శ్లో॥ అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥

గీ. వీరుఁగాక యనేకులు విదిత యశులు
ప్రాణములు నాకునై వీడఁ బాలు పడిన
సర్వశస్త్రాస్త్రవేదులు శౌర్య నిధులు
యుద్ధరంగ విశారదు లున్నవారు. 9

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥

ఆ.వె. బ్రాహ్మణవర! భీష్మ రక్షితమౌనిట్టి
బలియురున్న నాదు బల మపూర్ణ
మయ్యె, మారుత తనయాభిరక్షిత పాండ
వేయ బలము పూర్ణమై యెసంగె. 10

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి॥

ఆ.వె. మీరలందఱు నియమిత పదంబుల యుద్ధ
భూమి యందు నిలిచి ముఖ్య యోధుఁ
డైన శాంతనవుని నఖిల పార్శ్వముల జా
గరతు లగుచు నిపుడు గావ వలయు. 11

శ్లో|| తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః|
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్||

ఆ.వె. అనుచుఁ బలుకు నృపతి హర్షింపఁ గురువృద్ధ
వీర వరుఁడు రణవిశారదుఁడు ప్ర
మోదమునను సింహనాదం బొనర్చి, పూ
రించె దివ్యశంఖ మంచితముగ. 12

శ్లో|| తతశ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః|
సహసై వాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్||

ఆ.వె. అటుల సంకులు పణవానక గోముఖ
భేరులాదిగాగ వివిధ వాద్య
ములను దత్ క్షణంబ మొరయింపఁ గౌరవ
సేన సంకులమయి చెలఁగె మిగుల. 13

శ్లో|| తత శ్శ్వేతై ర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ|
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః||

గీ. అపుడు ధవళాశ్వశోభితమౌ మహార
థంబునందు నాసీనులై తగ వెలుంగు
మాధవుండును బాండవ మధ్యముండు
శంఖములను బూరించిరి క్ష్మాతలేంద్ర! 14

శ్లో|| పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః|
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః||

ఆ.వె. పాంచజన్య మొత్తె వసుదేవ తనయుండు
దివిజనాథసుతుఁడు దేవదత్త
మధిక భీమ కర్ముఁడౌ భీమసేనుండు
పౌండ్రశంఖ మొత్తె భయద వృత్తి. 15

శ్లో॥ అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥

గీ. అంత ధర్మనృపాలుఁ డనంత విజయ
మనెడి శంఖముఁ బూరించె యమళు లైన
నకుల సహదేవు లొత్తిరి ప్రకట శంఖ
ములగు సుఘోషమును మణిపుష్పకమును. 16

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥

ఆ.వె. అతుల చాపహస్తుఁడైన కాశీ నృపా
లుండు వీరుఁడౌ శిఖండియు నప
జయము లేని సాత్యకియు మహీంద్ర! ద్రుపద
రాజనందనుఁడు విరాటనృపతి. 17

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుశ్శఙ్ఖాన్దధ్ముః పృథక్పృథక్॥

ఆ.వె. ద్రుపద రాజవర్యుఁ డుపపాండవులు మహా
బాహు యుగళుఁ డగు సుభద్ర సుతుఁడు
వీర లెల్ల అపుడు వేఱ్వేఱఁ బూరించి
రవనినాథ! సంకులన్నిదిశల. 18

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీంచైవ తుములోzవ్యనునాదయన్॥

గీ. ప్రబలశంఖ సముద్భవోద్భట మహాస్వ
నములు వ్యాపించి భూనభోంతరముల నను
నాద మిడఁజేసి దుర్యోధనాది వీర
హృదయ పుట భేదకంబయి యెసఁగె నంత. 19

శ్లో|| అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్త రాష్ట్రాన్ కపిధ్వజః|
ప్రవృత్తే శస్త్ర సమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః||
హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే|

గీ. శస్త్ర సమర సమారంభ సమయ మందు
యుద్ధ సన్నద్ధులైన దుర్యోధనాది
వీరులను గాంచి విల్లెక్కు పెట్టి నవ్య
సాచి కృష్ణున కిట్లనె: క్ష్మాతలేంద్ర. 20, 21(1)

అర్జున ఉవాచ.

శ్లో|| సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేzచ్యుత||
యావ దేతాన్ నిరీక్షేzహం యోద్ధుకామా నవస్థితాన్|
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణ సముద్యమే||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

గీ. అచ్యుతా! సమరారంభ మందు నేను
యుద్ధ సన్నద్ధులై పోరనున్న వీరిఁ
జూఁచు వఱకును దగినట్టి చోట నుభయ
సైన్యముల మధ్య నిలుపు నా స్యందనంబు. 21 (2), 22

శ్లో|| యోత్స్యమానా నవేక్షేzహం య ఏతేzz త్ర సమాగతాః|
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః||

గీ. యుద్ధమున, దుష్టుఁడైన దుర్యోధనున క
భీష్టమును గూర్పఁగా మది నిచ్చగించి
యాహవము సేయ నరుదెంచి నట్టి వీర
వరుల నందఱఁ జూడఁ వలతు నేను. 23

సఞ్జయ ఉవాచ

శ్లో|| ఏవ ముక్తో హృషీ కేశో గుడా కేశేన భారత|
సేనయో ౹రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్||

సంజయుఁడు చెప్పు చున్నాఁడు

ఆ.వె. అమరనాథ తనయుఁ డట్లు పల్కినఁబురు
షోత్తముండు నా రథోత్తమమును
నిలిపి యుభయ సైన్యములకు మధ్యంబందుఁ
దగిన యట్టి చోట ధరణినాథ. 24

శ్లో|| భీష్మ ద్రోణ ప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్|
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి||

ఆ.వె. భీష్ముఁడును గురుండు వివిధ దేశాధీశ
వరులుఁజూచు చుండఁ "బాండుతనయ!
యాహవంబు సేయ నరుదెంచి యున్న యీ
కౌరవేయ బలముఁగాంచు" మనియె. 25

శ్లో|| తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్|
ఆచార్యా న్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా||
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి|

ఆ.వె. అనఁగ నరుఁడు గాంచె నాచార్యులను బితా
మహులఁ బితల మేనమామల సుహృ
దులను సుతులను మనుమలను మామల మఱి
స్నేహితులను, నుభయ సేనలందు, 26,27(1)

శ్లో|| తాన్సమీక్ష్య స కౌన్తేయ స్సర్వాన్ బన్ధూ నవస్థితాన్|
కృపయా పరయాzzవిష్టో విషీద న్నిద మబ్రవీత్||

ఆ.వె. యుద్ధభూమి యందు నున్న బంధువులను
గాంచి యంచితమగు కరుణ యెసఁగ
నివ్విధమునఁ బల్కెఁ గృష్ణుని వీక్షించి
సవ్యసాచి యతి విషాదముననను. 27(2),28(1)

అర్జున ఉవాచ.

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥

అర్జునుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. శౌరి! యుద్ద మొనర్పఁగాఁ జేరి యున్న
బంధువులఁ గనంగ నవయవంబు లెల్ల
శిధిలములయె ముఖంబు శోషిల్లె, మేన
వణకు రోమంబులను గగుర్పాటుఁ గలిగె. 28(2),29

శ్లో॥ గాణ్డీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥

గీ. జారుచుండె గాండివము హస్తంబు నుండి
యొడలి చర్మంబు దహియింపఁబడుచు నుండెఁ
బటుతరంబుగఁ జిత్త విభ్రమము గలిగె
రథము నందు నిల్వఁగ సమర్థతయు లేదు. 30

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే ॥

ఆ.వె. విశ్వవంద్య! నేను విపరీత శకునముల్
గాంచు చున్నవాఁడఁ గదన మందు
స్వజమును వధింప సంప్రాప్తమౌ శ్రేయ
మేమొ కానఁజాల నించు కేని. 31

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా ॥

ఆ.వె. కోరను విజయంబుఁ గోరను రాజ్యంబుఁ
గోర సుఖము నేని వారిజాక్ష!
ఏమి ఫలము నాకు నీ రాజ్యమున భోగ
ములను నేమి? బ్రతుకు వలన నేమి? 32

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ।
త ఇమేऽవస్థి తాయుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥

కం. ఏరికి హిత మొనరింపఁగ
నీ రాజ్యము భోగ సుఖము లిచ్ఛించుదుమో
వారలె ప్రాణార్థముల ము
రారీ! త్యజియించి వచ్చి రాహవమునకున్. 33

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః।
మాతులాః శ్వశురాః పౌత్రాః స్యాలాః సంబన్ధిన స్తథా॥

ఆ.వె. అంబుజాక్ష! వీరలాచార్య వర్యులుఁ
దండ్రు లాత్మజులు పితామహులును,
మనుమలు మఱి మేనమామలు మామలు
బావమరదు లెల్ల బంధు జనులు. 34

శ్లో॥ ఏతాన్న హన్తు మిచ్ఛామి ఘ్నతోऽపి మధుసూదన।
అపి త్రై లోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥

ఆ.వె. సమితి నన్ను వారు చంపినఁ ద్రైలోక్య
రాజ్య పదవి యేనిఁ బ్రాప్తమైనఁ
గౌరవుల వధింపఁ గాంక్షింప నన్న నీ
క్షితి తలాప్తి కొఱకుఁ జెప్ప నేల. 35

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన।
పాప మేవాశ్రయేऽऽ దస్మాన్ హత్వైతా నాతతాయినః॥

గీ. ధార్తరాష్ట్రులెల్లఱను యుద్ధంబు నందు
ద్రుంపఁగామన కేమి సంతోష మొదవు?
నాతతాయులఁ జంపుట చేత మనము
పాపమును బొందుదుము గాదె పద్మనాభ! 36

శ్లో॥ తస్మా న్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాన్ధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ॥

గీ. అఖిల బంధు సమేతులైనట్టి ధార్త్ర
రాష్ట్రులను వధియింప నర్హంబు గాదు
స్వజనులౌ వారిఁ జంపి యెబ్భంగి మనము
పంకజాక్ష! సౌఖ్యంబులు వడయఁగలము. 37

శ్లో॥ యద్య ప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥

ఆ.వె. వీరు రాజ్యలోభ విహత చేతసులౌట
వంశ నాశనంబు వలన సంభ
వించు దోష మమరవినుత! మిత్ర ద్రోహ
మందుఁగలుగు పాప మరయకున్న. 38

శ్లో॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మాన్నివర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥

ఆ.వె. వంశ నాశనంబు వలన సంప్రాప్తమౌ
యఘమ దిట్టిది యని యరయు మనకు
నట్టి పాపకార్యమందుండి తొలఁగఁగా
నేల తెలియరాదొ కృష్ణ! యిపుడు. 39

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత॥

గీ. కులమునకు నాశన స్థితి కలుగఁగా స
నాతన కుల ధర్మంబులు నాశనంబుఁ
జెందు ధర్మములన్ని నశింప వంశ
మంతయు నధర్మమునకు సమాస్పదమగు. 40

శ్లో|| అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కుల స్త్రియః|
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణ సఙ్కరః||

కం. కులమున నధర్మము ప్రబలఁ
గుల కాంతలు చెడుదురయ్యా! గోపీనాథా!
కుల కాంతలు చెడఁగా వా
రల కతమున వర్ణ సంకరంబగుఁ గాదే. 41

శ్లో|| సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ, |
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదక క్రియాః||

గీ. సంకరము కులమునకు నాశంకరులకుఁ
బ్రబల నరకంబు సమ కూర్చు వారి పితరు
లెల్ల పిండోదక క్రియా హీను లగుచు
నరకమందుఁ గూలెదరయ్యా నళిననయన! 42

శ్లో|| దోషై రేతైః కులఘ్నానాం వర్ణ సఙ్గరకారకైః|
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః||

గీ. చేరి వర్ణ సంకరమును జేయు చుండు
వంశ హరుల దోషావళి వలన శాశ్వ
తంబులైనట్టి జాతి సద్ధర్మములును
వంశ ధర్మముల్ నాశంబు వడయు చుండు. 43

శ్లో|| ఉత్పన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన|
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ||

కం. అరయ నివ్విధి వంశా
చారంబులఁ జెఱచి నట్టి జనులకు సతమున్
దారుణ నరకావాసము
వీరోత్తమ! కలుగు ననుచు విందుము గాదే. 44

శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ |
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః ||

గీ. అయ్యయో! మన మిప్పు డత్యంతమైన
పాపమును జేయఁ బూనిన వార మగుదు
మకట! రాజ్యసుఖంబుల యాశ చేతఁ
జంపుకొనఁ బూనితిమి బంధు జనుల నెల్ల. 45

శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః |
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ||

గీ. ఆయుధముఁ జేత ధరియింప నట్టివాని
బదులు కొట్టని వాని నన్పండనమున
శస్త్రయుతు లైన కౌరవుల్ చంపిరేని
నదియు మిక్కిలి క్షేమంబ యగును నాకు. 46

సఞ్జయ ఉవాచ

శ్లో॥ ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ |
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః ||

సంజయుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. పార్థుఁడివ్విధమున వచియించి దుఃఖ సం
చలిత చిత్తుఁడగుచు శరశరాస
నముల విడిచి యాహవమున స్యందన మందు
గూరుచుండె నంత గురుమహీంద్ర! 47

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే అర్జునవిషాదయోగోనామ
ప్రథమోఽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాపస్తంబసూత్ర బాపట్ల
వంశపవిత్ర వీరయామాత్య పుత్ర భక్తకవివిధేయ హనుమంత
నామధేయ ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగశాస్త్రంబను
బద్యకావ్యంబున నర్జున విషాదయోగంబను
బ్రథమాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## సాంఖ్యయోగము

## ద్వితీయాధ్యాయము

సఞ్జయ ఉవాచ.

శ్లో॥ తం తథా కృపయాzzవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః ॥

సంజయుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. అతి దయాకలితుఁడు నశ్రుపూర్ణాకులే
క్షణుఁడునై విషాద జలధి మగ్నుఁ
డైన పాండుతనయు నర్జును వీక్షించి
వాసుదేవుఁడిట్లు పలికె నధిప! 1

శ్రీ భగవా నువాచ.

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. బాలి శోచితంబు స్వర్గ విరోధియు
భువి నకీర్తి హేతు భూతమైన
యిట్టి ఘోరదుఃఖ మింద్రజా! నీ కిప్పు
డేల కలిగెనో యకాలమందు. 2

శ్లో॥ క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప ॥

కం. పొందకు మధైర్యమును నీ
యందిది యుండగఁగూడ దర్జున! హృదయం
బందున నీచపు దుర్బల
తం దలఁగ నడంచి శత్రుతపనా! లెమ్మా! 3

అర్జున ఉవాచ.

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూధన ॥

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

ఆ.వె. అతుల పూజనీయులైన భీష్మ ద్రోణ
యోధవరుల నిట్టి యుద్ధమందు
నెవ్విధమున నిలిచి యెదిరించి బాణప్ర
యోగ మాచరింతునో; ముకుంద! 4

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే, ।
హత్వాఽర్థకామాం స్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥

గీ. ధర, మహానుభావకులైన గురుజనములఁ
జంపకయె భుజియించు బైక్షంబు శ్రేయ
మర్ధకాములౌ గురువుల నడచియెటులఁ
గాంతు రుధిర ప్రదిగ్ధ సౌఖ్యంబు లిటనె. 5

శ్లో॥ న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయోయుః ।
యానే వహత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రః ॥

గీ. మనము జయ మొందుదుమొ లేక మనల వారు
గెలుతురో యేది యీ రెంట గృష్ణ! మేలొ
యెఱుఁగ మెవ్వారి నని వధియించి బ్రతుకఁ
గోరమో యట్టిఁ కౌరవుల్ గూడి రెదుట. 6

శ్లో|| కార్పణ్య దోషోప హతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః|
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేzహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ||

గీ. అధిక కార్పణ్య దోషోపహతుఁడ ధర్మ
పథ విమూఢాత్ముఁకుఁడ నైతి బ్రశ్న సేతు,
నిశ్చిత శ్రేయమేదో దానిని వచించి
శిష్యు నాశ్రితు నన్ను శాసింపు కృష్ణ! 7

శ్లో|| న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్|
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాదిపత్యమ్||

గీ. శత్రు శూన్యమౌ నిఖిల రాజ్యంబు దేవ
తాధిపత్యంబు సంప్రాప్తమైన నింద్రి
యాళి శోషణ కారణమైన నాదు
వ్యసనమును బాపు మార్గమే నరయ నైతి. 8

సఞ్జయ ఉవాచ.

శ్లో|| ఏవ ముక్త్వా హృషీ కేశం గుడాకేశః పరన్తపః|
న యోత్స్య ఇతిగోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ||

సంజయుఁడు చెప్పు చున్నాఁడు

కం. అని యీ ప్రకారమున నా
వనజోదరుతో వచించి "భండనమును జే
యను గోపీ రమణా! నే"
నని పల్కుచు నూరకుండె నర్జునుఁడధిపా! 9

శ్లో|| త మువాచ హృషీ కేశః ప్రహసన్నివ భారత|
సేనయో రుభయో ర్మధ్యే విషీదన్త మిదం వచః||

గీ. అంత శ్రీకృష్ణుఁడుభయ సైన్యముల మధ్య
నతి విషాదము నొందు చున్నట్టి పాండ
వేయుఁ గని పరిహాసముఁ జేయు వాని
పగిది, నివ్వాక్యమును బల్కె వసుమతీశ! 10

శ్రీ భగవా నువాచ.

శ్లో|| అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాష సే|
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తిపండితాః||

శ్రీ కృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. వ్యసనమును బొందఁగూడని వారికై వి
షాద పడితివి, ప్రాజ్ఞభాషణము లాడె
దీవు, మృతులైన వారికేన్ మృతులు గాని
వారికేన్ దుఃఖపడరు తత్వజ్ఞు లెందు. 11

శ్లో|| నత్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః|
న చైవ న భవిష్యామస్సర్వే వయమతః పరమ్. ||

గీ. నేను మును లేని వాడఁను గాను పార్థ
నీవు లేకున్న వాడఁవు గావు భూమి
పాలురగు వీరలును లేని వారు గారు,
ఇంక మీదైన లేకపో మిందఱమును. 12

శ్లో|| దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా|
తథా దేహాన్తర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి||

గీ. దేహమున నున్న యట్టి యీ దేహి కరయ
నెటులొ బాల్య యౌవన జర లటుల నన్య
దేహములు గల్గుఁగావున మోహపడఁడు
ధీరమతి యెప్పుడేని నీ దేహమునకు. 13

శ్లో|| మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః|
అగమాపాయినోఽనిత్యాస్తాం స్తితీక్షస్వ భారత||

గీ. పార్థ! శబ్దాది విషయ సంబంధములె యొ
సంగు శీతోష్ణ సుఖ దుఃఖ జాల, మివ్వి
వచ్చుచును బోవుచుండు నీ వసుధ యంద
నిత్యములు గాన సైపుము నీవు వీని. 14

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥

గీ. ఎవని సమ దుఃఖ సుఖుని నహీన ధీరు
నిట్టి ద్వంద్వముల్ బాధలఁబెట్ట లేవొ
యాతఁడే పాండునందనా! యమల మోక్ష
పదవి నొంద సమర్థుఁడౌ వాఁడు సుమ్ము. 15

శ్లో॥ నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽ న్తస్త్వనయో స్తత్త్వదర్శిభిః॥

గీ. లేని దానికి నిలుకడ లేదు లేమి
యరయ నున్నట్టి దాని కెందైన లేదు.
ఈ యుభయ భేద నిశ్చయం బెఱుఁగు చుంద్రు
తత్త్వవిదులైన పండితుల్ ధన్యచరిత! 16

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి॥

గీ. ఎఱుఁగుమీ యిది యంతయు నెవని చేత
నిండి యుండునో వాని కెన్నండు నాశ
నంబు లేదంచు మదిని, వ్యయంబు లేని
వాని నెవఁడు నాశన మొనర్పంగలాఁడు? 17

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత॥

గీ. అప్రమేయుఁడు నిత్యుండు నవ్యయుండు
నౌ శరీరికి సంబంధమైన యట్టి
దేహములు నశించు నటంచుఁ దెల్పఁ బడియెఁ
గానఁ బాండవమధ్యమ! కడగు మనికి. 18

శ్లో|| య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్, |
ఉభౌ తౌన విజానీతో నాయం హన్తి న హన్యతే ||

గీ. ఎవ్వఁడాత్మ వధించునం చెఱుఁగునో? వ
ధింపఁబడు నంచు నెవ్వాఁడు తెలిసి కొనునొ?
యట్టి వారిద్దరజ్ఞాను లాత్మయెపుడుఁ
జంపఁ డొరుల నన్యుల చేతఁ జంపఁబడఁడు. 19

శ్లో|| న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః|
అజో నిత్య శ్శాశ్వతోఽ యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ||

గీ. ఆత్మ శాశ్వతుఁడు పురాణుఁ డచలుఁ డజుఁడు
పుట్టఁ డెప్పుడు గిట్టఁడు పుట్టిఁమరలఁ
గలుగఁడీ కారణంబునఁ గాయములును
హతములౌచున్న నీతఁడు హతుఁడుగాఁడు. 20

శ్లో|| వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్ |
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ||

ఆ.వె. ఆత్మ యవ్యయుండు, నవినాశుఁడును నిత్యుఁ
డజుఁ డటంచు నెవ్వఁ డరయు నాతఁ
డేవిధమున నెవని హింసించు, నెట్లు హిం
సింపఁ జేయుఁ జాలు నింద్రతనయ! 21

శ్లో|| వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి |
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ||

గీ. చినిఁగి పోయిన వసనముల్ మనుజుఁ డెట్లు
తలఁగఁ జేసి వినూత్న వస్త్రములఁదాల్చు
నటుల జీర్ణంబులైన దేహముల వదలి
యన్య నూతన కాయము లాత్మ పొందు. 22

శ్లో|| నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః|
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః||

గీ. ఆయుధంబులు ఛేదింప వాత్మ నెందుఁ
బావకుండైన నితనిఁ గాల్పంగ లేఁడు
జలము లీతనిఁ దడుపఁగా జాల వెపుడు
వాయు వేనియు శోషింపఁ జేయ లేఁడు. 23

శ్లో|| అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ|
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః||

గీ. తడుపఁ ఛేదింపఁ శోషింపఁ దగులఁబెట్ట
సాధ్యపడఁడెప్పుడీ యాత్మ సర్వగతుఁడు
నాశ రహితుఁడు స్థిరుఁడు ననాది యైన
వాఁడు సిద్ధ స్వభావుఁడు పాండుతనయ! 24

శ్లో|| అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే|
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి||

గీ. ఈతఁ డవ్యక్తుఁ డవికారుఁ డీతఁడగు న
చింత్యుఁడని, శ్రుతు లందున జెప్పఁ బడియెఁ
గాన నీవాత్మ, నుక్త ప్రకార మెఱిఁగి
తగదు దుఃఖింప నీదు స్వాంతంబు నందు. 25

శ్లో|| అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్|
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి||

గీ. అటుల గాక నీవాత్మ నిత్యంబు జనన
మగుచు మృతి నొందు వానిఁగా నరయు దేని
నావిధంబున నైన నితాంతతేజ!
వానిఁ గూర్చి యిబ్బంగిని వగవఁ దగదు. 26

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥

గీ. ఎటులఁ బుట్టిన వానికి మృతి ధ్రువంబొ
యటులఁజచ్చిన వానికి బుటుక ధ్రువము,
కాన ననివార్యమైన యీ కార్యమునకుఁ
దగదు దుఃఖింప నీదు స్వాంతంబు నందు. 27

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥

గీ. అరయ నవ్యక్తమైనట్టి యాదిఁ గలవి
వ్యక్తమౌ మధ్యఁ గలవి, యవ్యక్త మగుచుఁ
దనరు నంత్యంబుఁ గలవి, భూతములు గాన
వానికై నీవు ఫల్గునా! వగవ నేల? 28

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,।
ఆశ్చర్యవచ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్॥

కం. వింతఁగ నొకఁడాత్మను గను
వింతఁగ నొక్కండు వాని వివరించు నొగిన్
వింతఁగ మఱి యొక్కఁడు విను
నెంతయు విని యాత్మతత్వ మెఱుఁగఁ డొకండున్. 29

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి,॥

గీ. అఖిల దేహంబులందున్న యాత్మ శ్వేత
వాహ! యెప్పటికైనఁ జంపంగఁ బడఁడు,
కాన నిట్టుల భూత సంఘాతమునకు
నీదు స్వాంతంబు నందుఁ జింతింపఁ దగదు. 30

శ్లో|| స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి|
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోऽన్యత్ క్షత్రియస్య న విద్యతే||

గీ. ఇదియ కాదు, స్వధర్మ మొక్కింత నీవు
లోఁదలంచి చలింపఁగా రాదు, ధరణి
ధర్మయుద్ధంబు కంటె నత్యధికమైన
శ్రేయ మర్జునా! లేదయ్య! నృపున కెందు. 31

శ్లో|| యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్|
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్||

ఆ.వె. భువిని నప్రయత్నముగఁ గల్గి తెఱువంగఁ
బడిన స్వర్గమునకు ద్వారమైన
యిట్టి యుద్ధమో మహేంద్రనందన! సుఖు
లైన క్షత్రియులకె ప్రాప్తమగును. 32

శ్లో|| అథ చైత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి|
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి||

ఆ.వె. ఇట్టి ధర్మయుద్ధ మీవు సేయక యుండు
వాఁడ వేని నీదు స్వకుల ధర్మ
ఫలము సద్యశంబుఁ బాసి యద్దానను
బాప మొందఁ గలవు, పాండుతనయ! 33

శ్లో|| అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తితేऽవ్యయామ్|
నంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే||

గీ. అంతియే కాదు శాశ్వతంబైన యట్టి
నీదు దుర్యశ మెపుడు వర్ణించు చుంద్రు
ప్రాణు లెల్లరు; కాన సంభావితునకు
నపయశము చావు కంటె నత్యధిక మగును. 34

శ్లో|| భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః|
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్||

గీ. ఆహవంబున నుండి భయంబు వలనఁ
దలఁగితని యీ మహారథుల్ తలఁతురేరి
గౌరవంబందితివొ నీవు వారి లోన
నిపుడు లాఘవమును బొందె దింద్రతనయ! 35

శ్లో|| అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః|
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్||

గీ. నీ ప్రతాప మంతయును నిందించు చుండు
నీదు శాత్రవ కోటి, యనేకములగుఁ
బలుక రాని దుర్భాషలఁ బలుకు చుండ్రు
గాన దుఃఖతరం బింతకంటెఁ గలదె. 36

శ్లో|| హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్|
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః||

గీ. హతుఁడ వగుదేని స్వర్గంబునంద నేర్తు
వరులఁగెల్చిన రాజ్యంబు ననుభవించె
దీవు గావున నిపుడు కౌంతేయ! లెమ్ము
యుద్ధమును జేయఁ గృత నిశ్చయుండ వగుచు. 37

శ్లో|| సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ|
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి||

గీ. కష్ట సౌఖ్యంబులను లాభ నష్టములను
మఱి జయాపజయముల సమానములుగ
నరసి యుద్ధంబుఁ జేయ నాయత్తుఁడవగు
మట్లు చేసినఁ బాపంబు నందఁ బోవు. 38

శ్లో|| ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి||

గీ. పార్థ! సాంఖ్యంబునను బ్రతిపాదితమగు
జ్ఞానమది చెప్పఁ బడియె, నెద్దాన నీవు
గర్మ బంధంబు విడువఁగాఁ గలవొ యట్టి
జ్ఞానము వచింతుఁ గర్మయోగమున వినుము. 39

శ్లో|| నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్||

ఆ.వె. అనఘ! లేదు దీన నారంభ నాశనం
బఘము రాదొకింత యైనఁగాని,
స్వల్ప ధర్మమయ్యు సంరక్షణముఁ జేయు
నమితమైన భవ భయంబు నుండి. 40

శ్లో|| వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్||

ఆ.వె. అమల మగుచు, నిశ్చయాత్మికమౌ బుద్ధి
యొకటె ముఖ్య మిట్టి యోగమునకు
వివిధ శాఖ లధిక వృత్తముల్, వ్యవసాయ
హీన జనుల బుద్ధు లింద్రతనయ! 41

శ్లో|| యా మిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః||

గీ. కలిగి యున్నట్టి తత్త్వంబుఁగాన లేక
పార్థ! స్వల్పజ్ఞులును వేదవాద రతులు
నాక ఫలమున కంటె నన్యంబు లేద
టంచుఁ గుసుమితోక్తుల బల్కు నట్టివారు. 42

శ్లో॥ కామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి॥

గీ. స్వర్గ పరులుఁ గామాత్ములు సవ్యసాచి!
జన్మ కర్మ ఫలంబు లొసంగు నవియు
భోగదైశ్వర్య దాయకంబులుఁ గ్రియాతి
బహుళములగు వాక్యంబులఁ బలుకు చుంద్రు. 43

శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాऽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥

గీ. ఆ కుసుమితోక్తుల కపహృతాత్ము లగుచు
సౌఖ్య దైశ్వర్యముల యందు సక్తు లైన
వారి, కీ యోగ మందసంభవము సుమ్మి
అర్జునా! నిశ్చయాత్మికంబైన బుద్ధి. 44

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

గీ. వేదము లనంగఁ ద్రైగుణ్య విషయములగు
దానఁ ద్రిగుణ వర్జితుఁడవై ద్వంద్వములను
వదలి నిత్య సత్వస్థతఁ బాయ కుండ
క్షేమ యోగంబులను, నపేక్షింప కెపుడు. 45

శ్లో॥ యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

గీ. బావి యందెంత జలము కావలయునో మ
హా ప్రవాహంబు నందైన నంత వలయు,
సకల నిగమంబులం దెంత సార్థకంబొ
యంత జ్ఞానియౌ విప్రున కగుచు నుండు 46

శ్లో|| కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన|
మా కర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గోzస్త్వకర్మణి||

గీ. కర్మముల యంద నీకధికారముండ
వలయుఁ గర్మ ఫలంబుల వలదు కోరఁ
గర్మ ఫల కారణం బీవు గాకు మెందుఁ
గర్మముల విడనాడఁగా గాంక్షఁ గొనకు. 47

శ్లో|| యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ|
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే||

గీ. సిద్ధి యందైన లేక యసిద్ధి నైన
బుద్ధి సమతయె యోగాఖ్యఁబొలుచుఁ గాన
నట్టి యోగంబు నందుండి యాస వదలి
సవ్యసాచి! కర్మంబుల సలుపు మయ్య. 48

శ్లో|| దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ|
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః||

గీ. కామ్య రహిత కర్మ కంటె దూరంబు నీ
చంబు సుమ్మి సంగసక్త కర్మ
ఫలముఁ గోరు వారు పరమ నీచులు గాన
జ్ఞానమునను శరణుఁ గనుమి పార్థ! 49

శ్లో|| బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృతదుష్కృతే|
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్||

గీ. బుద్ధి సంయుక్తుఁడిహమున బుణ్య పాప
ములను రెంటి వదలుఁ గాన బుద్ధి యోగ
మునకు యత్నంబు సలుపుమి పుణ్యచరిత!
కర్మల యందు నేర్పు యోగంబు సుమ్ము. 50

శ్లో|| కర్మజం బుద్ధి యుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః |
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్ ||

ఆ.వె. జ్ఞానులైన బుధులు కర్మసంజనితమౌ
ఫలము విడిచి జన్మ బంధ ముక్తు
లై యనామయంబునై విరాజిల్లెడు
స్థాన మొందు చుంద్రు సవ్యసాచి! 51

శ్లో|| యదా తే మోహ కలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి |
తదా గన్తాzసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ||

గీ. మోహమను గల్మషంబు నీ బుద్ధి యెపుడు
దాటఁగాఁ గల్గునో యట్టి తరుణ మందు
వినఁ దగిన యర్థమునకును విన్న యర్థ
మునకు వైరాగ్య మర్జునా! పొందఁ గలవు. 52

శ్లో|| శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా |
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి ||

గీ. వేదవాక్య శ్రవణ చేత వికల మయిన
నీదు బుద్ధి యెట్టి తఱిని, నిశ్చలంబు
గా సమాధిని నిలుచునో యా సమయము
నందు ఫల్గునా! యోగంబుఁ బొందఁ గలవు. 53

అర్జున ఉవాచ

శ్లో|| స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ |
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ||

అర్జునుఁ డడుగు చున్నాఁడు

ఆ.వె. మౌనివందితా! సమాధిస్థుడగు స్థిత
ప్రజ్ఞుఁడైన వాని భాష యేది?
యెట్టు లతఁడు పలుకు? నెట్టులఁ గూర్చుండు?
నెట్టి విధి నతఁడు చరించుచుండు? 54

శ్రీ భగవా నువాచ

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. అర్జునా! ఆత్మ యందుండి యాత్మ చేత
మోద మందుచు మనమునఁ బొంది యున్న
వివిధ కామంబు లెత్తఱి విడువఁగలఁడొ
యప్పు డతఁడు స్థితప్రజ్ఞుఁ డనఁగఁ బడును. 55

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥

ఆ.వె. ఖేదములను మది విషాదంబుఁ జెందక
యఖిల సుఖము లందు నాస లేక
రాగ కోప భయ విరహితుఁడౌ ముని, స్థిత
ప్రజ్ఞుఁడనుచుఁ జెప్పఁ బడును సుమ్ము. 56

శ్లో॥ య స్సర్వత్రానభిస్నేహ స్తత్త త్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

ఆ.వె. భువిని సర్వ విషయముల నుదాసీనుఁడై
శుభము లందు మఱి యశుభము లందు
మోదమును విషాదమును హృదయంబునఁ
బొందకుండు నతని బుద్ధి స్థిరము. 57

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

గీ. ఎప్పుడీ పురుషుఁడు సకలేంద్రియముల
విషయ బృందంబు నుండి తాఁబేలు పగిదిఁ
దాను నుపసంహరించుకో దక్షుఁడగునొ
యపుడు సుస్థిరమై యొప్పు నతని బుద్ధి. 58

శ్లో|| విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః|
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ||

గీ. ఓగిరము మాత్ర మంటక యుండు నట్టి
దేహికి విషయములు నివర్తిల్లుఁగాని
రాగమేమియు విడువ దారాగమును, న
శించుఁ బరమాత్మ నెపుడు వీక్షించు నపుడ. 59

శ్లో|| యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః|
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః||

ఆ.వె. బలియు లింద్రియములు పరమాత్మఁ గాంచఁగ
యత్న మాచరించు నట్టి జ్ఞాని
యైన పురుషు మతిని నతి బలాత్కారంబు
గా హరించు చుండు, ఘనచరిత్ర! 60

శ్లో|| తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః|
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా||

గీ. యోగియౌ వాఁడు తన యింద్రియోత్కరముల
సంగ్రహ మొనర్చి కొని మదాసక్తిఁ గలిగి
వరల వలె నింద్రియము లేని వశము లగునొ
యతని బుద్ధి ప్రతిష్ఠితం బగుచు నుండు. 61

శ్లో|| ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గస్తేషూపజాయతే|
సఙ్గాత్ సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే||

గీ. విషయ చింతనచే నుద్భవించు చుండు
వాని యందున నాసక్తి మానవునకుఁ
గామ మాసక్తి చేతను గలుగు నట్టి
కామము వలనఁ గ్రోధంబు గలుగు విజయ! 62

శ్లో|| క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహా త్స్మృతివిభ్రమః|
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి||

గీ. పుట్టుఁ గ్రోధ మూలంబున మోహ మనఘ
మోహమున స్మృతి భ్రంశము పుట్టు స్మృతి వి
నాశనంబున బుద్ధియు నాశనమగు
బుద్ధి నాశనమునఁ జెడిపోవు నరుఁడు. 63

శ్లో|| రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్|
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి||

గీ. అర్జునా! రాగమును ద్వేష మడఁచి వైచి
యాత్మ స్వాధీనమౌ నింద్రియముల చేత
విహిత విషయంబుల ననుభవించు చున్న
స్వవశ హృదయుఁడు నిర్మల స్వాంత మొందు. 64

శ్లో|| ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే|
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి||

ఆ.వె. మనసు శుద్ధమైన మనుజున కర్జునా!
సర్వ దుఃఖములును సమసి పోవు
శుద్ధ హృదయునకును బుద్ధియు సుస్థిర
త్వము వహింపఁ గలుగుఁ దత్ క్షణంబ. 65

శ్లో|| నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా|
న చాభావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్||

గీ. యోగ హీనునకును బుద్ధి యుండ దెందు
భావనయు నశియించును వాని కెపుడు
భావనా శూన్యునకు శాంతి వడయ రాదు
శాంతి లేని మానవునకు సౌఖ్య మున్నె. 66

శ్లో|| ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే|
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి||

గీ. ఇంద్రియంబుల వెంబడి నేరి చిత్త
మనుసరించుచు నుండు నా మనుజు మనసు,
వారినిధినోడఁ గొని పోవు వాత మటులఁ
బ్రజ్ఞ నంతయు హరియించుఁ బాండుతనయ! 67

శ్లో|| తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః|
ఇంద్రియా ణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ||

ఆ.వె. అటులఁగావున విషయముల నుండియు నెవఁ
డింద్రియముల నిగ్రహించు కొనునొ,
యతని బుద్ధి దేవతాధిపనందనా!
నిశ్చలాత్మికమయి నెగడు సుమ్ము. 68

శ్లో|| యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ|
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః||

గీ. అఖిల భూతంబులకు రాత్రియైన దాన
యోగి యగు వాఁడు మేల్కొని యుండు నన్ని
ప్రాణులును జాగరూకులు నైన యెడల
యోగియౌ వాఁడు నిద్దుర నొందు చుండు. 69

శ్లో|| ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్ సముద్ర మాపః ప్రవిశ న్తి యద్వత్|
తద్వ త్కామాయం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ||

గీ. అంతటను నిండి యుండియు నచల గతి వ
హంచు నుదధి, నదుల్ ప్రవేశించు నటుల
సర్వ విషయముల్ గను యోగి శాంతిఁ జెందుఁ
గామ కామి మోక్షంబునుఁ గాంచఁడెందు. 70

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాం శ్చరతి నిస్స్పృహః|
నిర్మమో నిరహఙ్కార స్సశాన్తి మధి గచ్ఛతి||

ఆ.వె. సర్వ కామములను సమయంగఁ జేసి తా
నాశ లేని వాఁడు నగుచు, మిగుల
నిర్మమత్వము మఱి నిరహంకృతినిఁ గల్గి
సంచరించు నతఁడు శాంతిఁ బొందు.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనా ప్రాప్య విముహ్యతి|
స్థిత్వాzస్యా మన్తకాలే zపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి||

ఆ.వె. బ్రహ్మనిష్ఠ యనఁగఁ బడు నిద్ది యిద్దానిఁ
బొందినట్టి యోగి మోహ మొందఁ
డంత్య కాలమందు నైనను నిలిచి స
న్మోక్ష పద మతండు పొందు పార్థ! 72

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
సాంఖ్యయోగోనామ
ద్వితీయోzధ్యాయః

ఇది శ్రీరాధాకృష్ణభక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవి విధేయ హనుమంత నామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
సాంఖ్యయోగమను
ద్వితీయాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## కర్మ యోగము

## తృతీయాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణ స్తేమతా బుద్ధి ర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥

అర్జునుఁ డడుగు చున్నాఁడు

గీ. కర్మ మార్గంబు కంటెను జ్ఞాన పథము
శ్రేయమౌ నని నీ యభిప్రాయమేని
ఘోరమగు కర్మ మొనరింపఁ బ్రేరణంబ
దేల చేయుచు నుంటి గోపాలకృష్ణ! 1

శ్లో॥ వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥

గీ. కలతఁ బెట్టెడు నిట్టి వాక్యముల నాదు
మతిని మోహింపఁ జేసెడి మాడ్కి నుంటి
వీవు గాన శ్రేయము రెంట నెందుఁ బొంద
గలనో నిశ్చయంబుగ దానిఁ బలుకు దేవ! 2

శ్రీ భగవా నువాచ.

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ।
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥

శ్రీ కృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. జ్ఞాన యోగంబు చేతను సాంఖ్యులకును
గర్మ యోగంబు చేతను గర్మ యోగు
లకును ద్వివిధంబులగు నిష్ఠలను వచించి
తేను బూర్వ మీ జగమున నింద్రతనయ! 3

శ్లో|| న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోऽశ్నుతే|
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి||

గీ. కర్మము లొనర్ప కున్నంత జ్ఞాన యోగ
మునను గలిగెడి నిష్ఠను బొందఁజాలఁ,
డవనిఁ బురుషుండు కర్మ సన్యాసముననె
సిద్ధి నొందఁగ నేరఁడో యిద్ధచరిత! 4

శ్లో|| న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్|
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః||

గీ. ఎప్పుడేనియు నేనరుఁడేనిఁ గర్మ
మొక్క క్షణమేనిఁ జేయక యుండఁ డఖిల
జనులు ప్రకృతి సంభవములౌ గుణములకు, వి
ధేయులై పార్థ! కర్ముల్ చేయు చుంద్రు. 5

శ్లో|| కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్|
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే||

గీ. ఎట్టి పూరుషుఁడు తన కర్మేంద్రియముల
నణచి విషయముల్ మదిచే స్మరణ మొనర్చు
నతఁడు, దాంభికాచారుఁడు నధిక మూఢ
చిత్తుఁడని చెప్పఁబడు చుండు; శ్వేతవాహ! 6

శ్లో|| య స్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేऽర్జున|
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే||

గీ. ఎవఁడు చిత్తంబు చేతఁ బంచేంద్రియముల
నణఁగఁ జేసియుఁ గర్మేంద్రియముల వలన
గర్మ యోగంబుఁ దత్ఫలాకాంక్ష వదలి
మొదలు పెట్టునొ వాఁడుత్తముఁడు, కిరీటి ! 7

శ్లో॥ నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః|
శరీరయాత్రాऽపి చ తే నప్రసిద్ధ్యే దకర్మణః ||

గీ. సలుపు మీవు నియత కర్మములను విజయ!
కర్మములఁజేయ కుండుట కంటెఁ గర్మ
లాచరించుట మేల్, దేహ యాత్ర నీకు
సిద్ధిఁబొందదు కర్మముల్ చేయ కున్న. 8

శ్లో॥ యజ్ఞార్థా త్కర్మణోऽన్యత్ర లోకోऽయం కర్మబన్ధనః|
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసఙ్గ స్సమాచర||

గీ. యజ్ఞ హేతువునకుఁగాని యన్యకర్మ
కర్మబంధ మీ జగమునఁ గలుగఁ జేయుఁ
గానఁ గౌంతేయ! యజ్ఞార్థమైన కర్మఁ
గడఁగి చేయుము తత్ఫలాకాంక్ష వదలి. 9

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః|
అనేన ప్రసవిష్యధ్వ మేషవోऽస్త్విష్ట కామధుక్||

గీ. సృష్టి కాలమునందు విరించి ప్రజల
యజ్ఞములతోడ సృజియించి యనియె నిట్లు;
యజ్ఞముల మీరలభివృద్ధి నందుఁ డివియ
కోరు కోరికలను సమకూర్చు మీకు. 10

శ్లో॥ దేవాన్భావయ తానేన తే దేవా భావయన్తు వః|
పరస్పరం భావయన్త శ్శ్రేయః పరమవాప్స్యథ||

గీ. యజ్ఞములఁ బూజ సల్పు డింద్రాది సురల
దేవతలు మిమ్ము వృద్ధిఁ బొందింపు చుందు
రిట్టులన్యోన్యమున మీరు వృద్ధిఁబొంది
యుత్తమంబైన శ్రేయస్సు నొందఁగలరు. 11

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః, ॥

గీ. యజ్ఞ సంభావితులగు నీ యమరు లెల్ల
నిష్ట భోగంబులను మీకు నిచ్చు చుండ్రు
సుర లొసంగిన వానిని సురల కిడక
తాను మాత్రమ తిను వాఁడు తస్కరుండు. 12

శ్లో॥ యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్. ॥

గీ. యజ్ఞ శేషంబు భుజియించు నాత్మ విదులు
వారి పాప పుంజంబులఁ బాయు చుండ్రు;
తమకు మాత్ర మెవ్వారు పాకమును జేయు,
వారు భుజియించు చుండ్రు పాపంబు మిగుల. 13

శ్లో॥ అన్నా ద్భవన్తి భూతాని పర్జన్యా దన్న సమ్భవః।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః॥

గీ. భూత కోటి యన్నంబుచేఁ బుట్టు చుండుఁ,
గలుగు నన్నంబు పర్జన్యు వలన, యజ్ఞ
మునను బర్జన్యుఁ డుద్భవించును ధరిత్రిఁ,
గర్మము వలన యజ్ఞంబె గలుగుఁ బార్థ! 14

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥

గీ. కర్మ బ్రహ్మోద్భవంబని గనుము బ్రహ్మ
మక్షర సముద్భవంబని యరయు మాత్మ,
కావునను బ్రహ్మము సమస్త గతము; సతము
యజ్ఞమున సుప్రతిష్ఠితం బగుచు నుండు. 15

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥

గీ. సరవి నిట్లు ప్రవర్తించు చక్ర మెవ్వఁ
డనుసరింపఁడొ లోకంబు నందు వాఁడ
ఘాయువును నింద్రియారాముఁ డగును విజయ!
వాని జీవిత మంతయు వ్యర్థ మగును. 16

శ్లో॥ య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మ తృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే॥

ఆ.వె. ఆత్మ యందుఁ రతియు నాత్మచేఁ దృప్తియు
నాత్మ యందుఁ దుష్టి నందు నెవ్వఁ
డా నరుండొనర్ప నర్హమౌ కర్మ మీ
జగము నందు లేదు సవ్యసాచి! 17

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥

గీ. కర్మఁ జేసిన ఫలమేమిఁ గాంచఁ డతఁడు
కర్మఁ జేయమిఁ గీడేమిఁ గాంచఁ డట్టి
బ్రహ్మవేత్తకు సర్వజీవముల వలన
నే ప్రయోజనమైన లే దింద్రతనయ! 18

శ్లో॥ తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః॥

గీ. కానఁ గార్య కర్మము ఫలకాంక్ష వదలి
చేయు చుండుము సతతంబు శ్వేతవాహ!
విహిత కర్మంబులను ఫలాపేక్ష లేక
సలుపు చుండెడి నరుఁడు మోక్షంబుఁ బొందు. 19

శ్లో|| కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః|
లోకసఙ్గ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి ||

గీ. జనక ముఖ్యులు మున్ను నిష్కామ కర్మఁ
జేసియే కాదె పొందిరి సిద్ధిఁ గాన
లోక సంగ్రహమైనను లోఁదలంచి
యర్జునా! కర్మమును జేయు టర్హమగును. 20

శ్లో|| య ద్యదాచరతి శ్రేష్ఠ స్త త్తదేవేతరో జనః|
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ||

గీ. శ్రేష్ఠుఁడౌవాఁడు దేనినిఁ జేయు దాని
నితర జనములు చేఁయుదు రింద్రతనయ!
జ్ఞాని యెట్టి దానినిఁ బ్రమాణముగఁ గొనునొ
యట్టి దానినే లోకము ననుసరించు. 21

శ్లో|| న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన|
నాఽనవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ||

గీ. అనఘచారిత్ర! నాకుఁ జేయంగఁ దగిన
కర్మ మేదియు మూఁడు లోకముల లేదు
పొందఁబడనిది, తగినది పొందుటకును
నాస్తి యైనను గర్మము లాచరింతు. 22

శ్లో|| యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః|
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ||

గీ. అర్జునా! నేనొకప్పుడే నప్రమాద
మొంది కర్మంబుఁ జేయక యుందు నేని
నన్ని విధముల, నపుడ, యీ యవని లోని
జనము లెల్లరు నా మార్గ మనుసరింత్రు. 23

శ్లో॥ ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మచే దహమ్ ।
సఙ్కరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥

గీ. నేను గర్మంబులను జేయ నేని నిపుడు
సకల జనములు చెడుదురు సవ్యసాచి!
కర్త నగుదును వర్ణ సాంకర్యమునకుఁ
బ్రజల నందఱఁ జెఱచిన వాఁడ నగుదు. 24

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాऽసక్తశ్చికీర్షు ర్లోకసఙ్గ్రహమ్ ॥

గీ. కర్మ మజ్ఞాను లెటు ఫలకాంక్ష తోడ
సలుపు చుందురో యటు లోక సంగ్రహంబు
సలుపఁ గోరియుఁ దత్ఫలాసక్తి వదలి
ప్రాజ్ఞుఁడు, స్వకర్మ మాచరింపంగ వలయు. 25

శ్లో॥ న బుద్ధి భేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్ ।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్ ॥

గీ. జ్ఞాని యజ్ఞానియో కర్మసంగునకును
బుద్ధి భేధంబుఁ గలిగింపఁ బోల దెందుఁ
గడఁగి ని ష్కామ్యముగ సర్వకర్మ లాచ
రించుచును వారి చేతఁ జేయింప వలయు. 26

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహఙ్కార విమూఢాత్మా కర్తాऽహ మితి మన్యతే ॥

గీ. ప్రకృతి గుణములచేఁ జేయఁ బడెడు సర్వ
కర్మములను గూరిచి యహంకారమునను
మూఢ చిత్తుఁడు పలువిధములను లోనఁ
దాను గర్త నటంచును దలఁచు చుండు. 27

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః ।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥

గీ. ఫల్గునా! గుణ కర్మ విభాగ యోగ
తత్త్వ మెఱిఁగిన వాఁడు సత్వ ప్రముఖ గు
ణములు చరియించు చుండు గుణముల ననుచు
నాత్మఁ దలపోసి యాసక్తి నందఁ డెపుడు. 28

శ్లో॥ ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తా నకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవి న్న విచాలయేత్॥

గీ. ప్రకృతి గుణముల వలన విభ్రమముఁ జెంది
సకల విషయేంద్రియముల నాసక్తులగుచు
జ్ఞాన హీనులు మందులు నైన వారిఁ
జలన మొందింపఁగా రాదు సజ్జనుండు. 29

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥

గీ. అఖిల కర్మముల్ భక్తి నా యందు నిలిపి,
జ్ఞాన చిత్తంబునను ఫలాసక్తి వదలి,
మమతఁ బోనాడి, హృదయ తాపమును విడిచి,
శ్వేతవాహన! యుద్ధంబుఁ జేయు మిపుడు. 30

శ్లో॥ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః॥

గీ. ఏ మనుష్యులు విజయ! నా యీ మతంబు
నందు శ్రద్ధఁ గల్గిన వారలై యసూయఁ
బొందక సతంబు నిజ కర్మముల నొనర్చు
వారుఁ గర్మ బంధ విముక్తిఁ బడయు చుంద్రు. 31

శ్లో॥ యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టానచేతసః॥

గీ. ఎవ రసూయను బొంది మదీయ మతము
నాచరింపరో వారల నన్నిజ్ఞాన
ములను మూఢులుగ, నవివేకులుగఁ జెడిన
వారిఁగా నీవు తెలియుము పాండుతనయ! 32

శ్లో|| సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి|
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ||

గీ. జ్ఞానియు నిజ ప్రకృతికి సమానముగను
విషయములఁ బ్రవర్తించును; బృథివి భూత
సంచయము ప్రకృతి ననుసరించుఁ గాన
నిగ్రహం బేమి యొనరింప నేర్చు నందు. 33

శ్లో|| ఇన్ద్రియ స్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ |
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ ||

గీ. ఎలమి జ్ఞానేంద్రియములఁ గర్మేంద్రియములఁ
నమరి యుండు రాగము ద్వేష మనఘచరిత!
అవియ రెండును శత్రువులగు నరునకు
వశుఁడుఁగాఁగూడ దెవ్వఁడేన్ వాని కెపుడు. 34

శ్లో|| శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్|
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః||

ఆ.వె. ధర, స్వనుష్ఠితమగు పరధర్మమున కంటె
విగుణమైన మేలు స్వీయధర్మ
మిటు స్వధర్మమందు మృతియైన శ్రేయమౌ
నన్య ధర్మమౌ భయావహంబు. 35

అర్జున ఉవాచ

శ్లో|| అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః|
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః||

అర్జునుఁ డడుగు చున్నాఁడు

గీ. వృష్ణికులదీప! పురుషుఁడు భృత్యు పగిదిఁ
గోర కుండియుఁ దా బలాత్కారముగను
బ్రేరణముఁ జేయఁబడు వాని విధినిఁ బాప
కర్మములఁ జేయు చుండు నే కారణమున? 36

శ్రీ భగవా నువాచ

శ్లో|| కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః|
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. ఫల్గునా! రజోగుణ సంభవంబు నైన
యిట్టి కామమే క్రోధమౌ, నిది మహాశ
నంబు ఘోర పాప స్వరూపంబు గాన
దీని నిందు, శత్రువునిఁగాఁ దెలిసి కొనుము. 37

శ్లో|| ధూమే నావ్రియతే వహ్ని ర్యథాZZదర్శో మలేన చ|
యథోల్బేZZనావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్||

ఆ.వె. ధూమమునను వహ్ని దుమ్ముచే నద్దంబు
మావి చేత గర్భ మావృతంబు
నైన పగిది నరుని జ్ఞానము గప్పఁగాఁ
బడియెఁ గామమునను బాండవేయ! 38

శ్లో|| ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా|
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ||

గీ. నింపఁగా శక్యమేమి గానిదియుఁ దృప్తి
లేనిదియుఁ గామ రూపంబుఁ బూనినదియుఁ
బాండు నృపనందనా! నిత్య వైరియైన
కామమున జ్ఞాని జ్ఞానంబు గప్పఁ బడియె. 39

శ్లో|| ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే|
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్||

గీ. ఇంద్రియములు మనో బుద్ధు లివియ యాశ్ర
యంబులని చెప్పఁ బడియెఁ గామంబు నకును;
వీనిచే జ్ఞానమును గప్పి, శ్వేతవాహ!
దేహి నీ కామ మెంతయు మోహ పెట్టు. 40

శ్లో॥ తస్మాత్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥

గీ. అందుచే ముందు నీ వింద్రియముల నణఁచి
జ్ఞాన విజ్ఞానముల నాశనంబుఁ జేయు
నదియుఁ బాప స్వరూపంబు నైన యిట్టి
కామమును ద్రుంపు మయ్య సుత్రామతనయ! 41

శ్లో॥ ఇన్ద్రియాణి పరా ణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః, ।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః॥

గీ. అధికమౌ నింద్రియములు దేహమున కన్న
నింద్రియంబుల కంటెను హెచ్చు మనము,
మనసు కంటెను బుద్ధియే ఘనము, బుద్ధి
కంటె నాత్మయే యధికంబు, ఘనచరిత్ర! 42

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్త భ్యాత్మానZZమాత్మనా।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్॥

గీ. కాన నివ్విధమున బుద్ధి కంటెఁ బరముఁ
నైన యాత్మ నెఱింగి, యద్దాన మనసు
స్తంభనం బొనర్చి దురాసదంబుఁ గామ
రూపమైన నీ వైరిని ద్రుంపు మనఘ! 43

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ
తృతీయోZధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాపస్తంబసూత్ర
బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య పుత్త్ర భక్త
కవి విధేయ హనుమంతనామధేయ ప్రణీతంబైన
శ్రీ మద్భగవద్గీతామృతయోగ శాస్త్రంబను
బద్యకావ్యంబునఁ గర్మయోగమను
తృతీయాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## జ్ఞాన యోగము

### చతుర్థాధ్యాయము

శ్రీ భగవా నువాచ

శ్లో|| ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్ |
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేZబ్రవీత్ ||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. ఇట్టి యవ్యయమౌ యోగ మేను మున్ను
సవితృనకుఁ దెల్పి యుంటి, నా రవియుఁజెప్పెఁ
దన సుతుండైన వైవస్వత మనువునకుఁ
దెలిపె నాతఁడిక్ష్వాకు ధాత్రీ పతికిని. 1

శ్లో|| ఏవం పరమ్పరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః |
స కాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప ||

గీ. పార్థ! యిట్లు పరంపరా ప్రాప్తమైన
దీని రాజర్షు లెల్లఱుఁ దెలిసి కొనిరి;
కాల మధికంబు గడచిన కారణమున
సమసి పోయె నా యోగ మీ జగతి యందు. 2

శ్లో|| స ఏవాయం మయా తేZద్య యోగః ప్రోక్తః పురాతనః |
భక్తోZసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ||

గీ. అర్జునా! యా పురాతన మైన యోగ
మంత భక్తుఁడవు సఖుఁడవైన నీకుఁ
జెప్పఁగాబడె నిపుడు నా చేత, నిద్ది
యతి రహస్యంబు నుత్తమం బగును సుమ్ము. 3

అర్జున ఉవాచ

శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి॥

అర్జునుఁడడుగు చున్నాఁడు

గీ. పుండరీకాక్ష! నీ యొక్క పుట్టు విపుడు
జరిగెఁబూర్వము నందునఁ దరణి జన్మ
మట్టి తఱి యోగ మీవు సృష్ట్యాది, రవికి
దెలిపితి వటన్న నే నెట్లు దెలిసి కొందు? 4

శ్రీ భగవా నువాచ

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. నీకు నాకును బూర్వ మనేకములగు
జన్మము లతిక్రమించెనో సవ్యసాచి!
నే నెఱుంగుదు వాని నన్నింటి నిపుడు,
నీవు వాని నెఱుంగఁగా లేవు నిజము. 5

శ్లో॥ అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా॥

ఆ.వె. అజుఁడనయ్యు నవ్యయాత్ముండనైన నే
నఖిల భూతములకు నధిపునైనఁ
బాండవేయ! నాదు ప్రకృతి నధిష్ఠించి
యాత్మ మాయ చేత నవతరింతు. 6

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్॥

గీ. ఎప్పు డెప్పుడు సద్ధర్మ మెడరుఁ జెందు,
నెప్పు డెప్పు డధర్మంబు వృద్ధిఁ బొందు,
నప్పుడప్పుడ, మేఘవాహనతనూజ!
యేను నన్ను ధరిత్రి సృజించు కొందు. 7

శ్లో|| పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ |
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ||

ఆ.వె. సకల సాధువులను సంరక్షణముఁ జేయఁ
బాప జనుల నెల్ల రూపు మాప
జగతి యందు ధర్మ సంస్థాపనార్థంబు
యుగ యుగంబు నందు నుద్భవింతు. 8

శ్లో|| జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః |
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున ||

గీ. నాదు దివ్య జన్మంబును నాదు కర్మ
నిట్టి లెవఁడు యథార్థంబు నెఱిఁగి యుండు,
నతఁడు దేహము వదలు ననంతరమునఁ
బుట్టు వొందక మఱల, నన్ బొందుఁ బార్థ! 9

శ్లో|| వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః |
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ||

గీ. అర్జునా! యనురాగ భయాగ్రహముల
నణఁచి మన్మయులగుచు నన్నాశ్రయించు
ననఘ జనులనేకులు జ్ఞాన మను తపంబు
వలన శుద్ధులై నాదు భావమును గనిరి. 10

శ్లో|| యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్ |
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ||

గీ. ఇంద్రనందన! యెటు లెట్టు లెవ్వ రెవ్వ
రాశ్రయింతురో నన్ను నే నట్టులటుల
వారి వారిఁ గైకొందు, సర్వ విధములను
మనుజు లెల్లరు నా మార్గ మనుసరింత్రు. 11

శ్లో॥ కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥

గీ. మనుజ లోకంబు నందుఁ గర్మముల వలనఁ
గలుగు ఫలము శీఘ్రంబుగా గలుగుఁ గానఁ
జెలఁగి కర్మ ఫలంబుఁ గాంక్షించి వార
లిచట నింద్రాది సురల సేవింపు చుంద్రు. 12

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥

గీ. ఫల్గునా! గుణ కర్మ విభాగములను
బట్టి సృజియించితిని నాల్గు వర్ణములను
వీని సృష్టికిఁ గర్త నేనైన నన్నుఁ
గనుమి యవ్యయుఁడనని యకర్త ననుచు. 13

శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న సబధ్యతే ॥

గీ. నన్నుఁ గర్మము లంటవు నాకు సకల
కర్మ ఫలసిద్ధి యందును గాంక్ష లేదు;
కాన నివ్విధి నెవ్వఁడు గనునొ నన్ను
నట్టి వాఁడు కర్మములచేఁ గట్టు వడఁడు. 14

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥

గీ. విజయ! యివ్విధి నెఱిఁగి పూర్వీకులౌ ము
ముక్షువుల చేత నిజ కర్మములు నొనర్పఁ
బడియెఁ గాన ననాదివై వారి చేతఁ
జేయఁ బడిన కర్మంబులఁ జేయు మీవు. 15

శ్లో|| కిం కర్మ కి మకర్మేతి కవయోZప్యత్ర మోహితాః|
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేZశుభాత్||

గీ. కర్మ మెయ్యది? యెద్ది యకర్మ యనెడు
విషయమున మోహ పడిరి కోవిదులు దేనిఁ
దెలియ సంసార బంధము తొలఁగి పోవు
దాని నెఱుఁగఁ బల్కెదను సుత్రామతనయ! 16

శ్లో|| కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః|
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః||

కం. కర్మంబు, వికర్మంబు, న
కర్మంబను మూఁటిఁ దెలియఁగావలె సుమ్మీ
కర్మ వికర్మాZకర్మల
మర్మం బెఱుఁగంగఁ వైరిమర్దన! యనదె. 17

శ్లో|| కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః|
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్||

గీ. జ్ఞాన మెవ్వాఁడు చూచునో కర్మ మందుఁ
గర్మ మెవ్వాఁడు చూచునో జ్ఞాన మందుఁ
నతఁడె నరులందు బ్రాజ్ఞుఁడు నతఁడె యోగి,
యఖిల కర్మముల్ చేసిన యతఁడు వాఁడె. 18

శ్లో|| యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః|
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పణ్డితం బుధాః||

ఆ.వె. కవ్వడీ! యెవాని కర్మముల్ గామ సం
కల్ప వర్జితములొ; జ్ఞాన వహ్ని
దగ్ధ కర్ముఁడగుచుఁ దనరు నా పురుషునిఁ
బ్రాజ్ఞుఁడంచు బుధులు పలుకు చుంద్రు. 19

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవకి ఞ్చిత్కరోతి సః॥

గీ. అఖిల కర్మ ఫలాసక్తి నణచి నిత్య
మైన యాత్మ తృప్తిఁగని, నిరాశ్రయుండు
నైన వాఁడెల్ల కర్మము లాచరించు
వాఁడయిన, నేమి చేయని వాఁడు విజయ! 20

శ్లో॥ నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥

గీ. ఆశ విడనాడి నియత చిత్తాత్ముఁ డగుచు
నఖిల ప్రాకృత విషయంబు లందు మమత
నుడిగి, శారీరమాత్రోపయుక్త కర్మ
ములనుఁ జేసెడి మనుజుఁడు పొందఁ డఘము. 21

శ్లో॥ యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥

గీ. యత్న రహిత లాభంబుచే హర్ష మొంది
ద్వంద్వములఁ ద్యజియించి మత్సరముఁ ద్రుంచి
సిద్ధ్యసిద్ధుల సముఁడునై చెలఁగు వాఁడు
కర్మముల నాచరించినఁ గట్టు వడఁడు. 22

శ్లో॥ గత సఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః।
యజ్ఞా యాఽఽచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥

గీ. సంగ రహితుఁడు ముక్తుఁడు జ్ఞాన చిత్తుఁ
డగుచు గర్మముల్ యజ్ఞార్థమై యొనర్చు
వాని ఫలసహితమగుఁ బ్రాచీన కర్మ
ములు నశించును నిశ్శేషముగను విజయ! 23

శ్లో|| బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ |
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ||

గీ. బ్రహ్మమౌ స్రుక్కు స్రువములు బ్రహ్మ హవిసు
బ్రహ్మ మగ్ని, బ్రహ్మ హుతము, బ్రహ్మ మట్టి
బ్రహ్మకర్మ సమాధిచేఁ బడయఁ దగిన
ఫలము బ్రహ్మంబె యగు సుమి పాండవేయ! 24

శ్లో|| దైవ మేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే |
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి ||

గీ. ఫల్గునా! కర్మ యోగులౌ వారు కొంద
ఱాచరింతు రుందురు దైవ యజ్ఞము మఱి
యజ్ఞమును యజ్ఞముననె బ్రహ్మాగ్ని యందు
జ్ఞానులగు కొంద ఱాహుతి సలుపు చుంద్రు. 25

శ్లో|| శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి |
శబ్దాదీ న్విషయా నన్యే ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ||

గీ. అన్యులౌ వారు శ్రోత్రాదు లైన యింద్రి
యముల సంయమ మనియెడి యగ్ని యందు
వ్రేల్చు చుందురు; శబ్దాది విషయములను
గొంద ఱింద్రియాగ్నిని వ్రేల్చు చుందు రనఘ! 26

శ్లో|| సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే |
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ||

గీ. అఖిలమౌ జ్ఞాన కర్మేంద్రియముల కర్మ
ములను బ్రాణ ప్రముఖ కర్మములనుఁ గొంద
ఱర్జునా! జ్ఞాన దీపిత మగుచు వరలు
నాత్మ సంయమ యోగాగ్ని యందు వేల్తు. 27

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాzపరే।
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥

గీ. యతులు సంయముల్ సంశిత వ్రతులు, ద్రవ్య
యజ్ఞమును గొందఱును దపో యజ్ఞము మరి
కొందఱును, యోగ యజ్ఞంబుఁ గొందఱాగ
మాధ్యయన యజ్ఞమును గొందఱాచరింత్రు. 28

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేzపానం తథాzపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥

గీ. ప్రాణమును వేల్తు రన్యుల పానమందు
నటుల పానంబు వేల్తురు ప్రాణమందు
నితర జనులపాన ప్రాణగతుల నడ్డి
వరలు చుంద్రు ప్రాణాయామ పర నిరూఢి. 29

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేz ప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥

గీ. అరయఁగొందఱు పరిమితాహారు లగుచుఁ
బ్రాణముల వేల్చు చుందురు ప్రాణములనె;
అర్జునా! వీర లెల్లరు యజ్ఞ విదులు
యజ్ఞ నిర్ధూత కల్మషులై చరింత్రు. 30

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోzస్త్యయజ్ఞస్య కుతోzన్యః కురుసత్తమ॥

గీ. యజ్ఞ శిష్టామృతాహారులైన వారు
వడయు చున్నారు శాశ్వత బ్రహ్మపదము
యజ్ఞ హీనున కీ లోక మమర దనిన
నన్య లోకం బదెక్కడిదయ్యె! విజయ! 31

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధితాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్య సే॥

గీ. అనఘచరిత! పలు విధంబులైన యిట్టి
యజ్ఞములు వేద ముఖమున వ్యాప్తమయ్యె,
వాని నెల్లనుఁ గర్మ సంభవము లనుచుఁ
గనుమి; యివ్విధిఁగని ముక్తిఁ గాంచఁ గలవు. 32

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞా జ్ఞానయజ్ఞః పరన్తప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥

ఆ.వె. అర్థ సాధన మగు యజ్ఞంబు కంటె శ్రే
యస్కరంబు జ్ఞాన యజ్ఞ మరయ;
నిఖిల కర్మములును నిశ్శేషముగ జ్ఞాన
మందె పరి సమాప్తి నొందు చుండు. 33

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

గీ. పార్థ! ప్రణిపాతమునఁ బరిప్రశ్న వలన
నెలమి సేవించి గురువులఁ దెలిసి కొనుమి;
ఆత్మ రూపంబు బాగుగా నరయు జ్ఞాన
నిష్ఠు లుపదేశ మొనరింత్రు నీకు దీని. 34

శ్లో॥ యద్జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ।
యేన భూతా న్యశేషణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి॥

గీ. ఎట్టి జ్ఞాన మెఱిఁగి మఱి యిట్టి మోహ
మును వహింపవో, యెద్దాన భూత కోటి
నాత్మ యందును బిదప నా యందుఁజూడఁ
గలవో, యద్దియే ఫల్గునా! జ్ఞాన మగును. 35

శ్లో|| అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః|
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సన్తరిష్యసి||

గీ. అర్జునా! సర్వ పాపాత్ములై చరించు
వారి కంటెను మిక్కిలి పాపి వైనఁ
గాని, సర్వ పాపాత్మకంబైన జలధి
జ్ఞాన పోతంబుచే దాటఁ గలవు నిజము. 36

శ్లో|| యథైథాంసి సమిద్ధోZగ్ని ర్భస్మసాత్కురుతేZర్జున|
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా||

గీ. బాగుగాఁ బ్రజ్వలించెడి జ్వాలనుఁ డెల్ల
సమిధలను భస్మ మొనరింపఁ జాలి యున్న
సరణి, సర్వ కర్మంబుల జ్ఞాన వహ్ని
భస్మమును జేయు చుండును బాండుతనయ! 37

శ్లో|| న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే|
త త్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి||

గీ. జ్ఞానమునకు లేదు సాటి యీ జగమున
నతి పవిత్ర భూతమైన దానిఁ
బొందు యోగ సిద్ధ పురుషుఁడు కాలక్ర
మమునఁ దనకుఁదాన; విమల హృదయ! 38

శ్లో|| శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః|
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి||

ఆ.వె. జ్ఞాన తత్పరుండు శ్రద్ధాళువుండు నౌ
సంయతేంద్రియుండు జ్ఞాన మొందు,
నటుల జ్ఞాన మొంది, యర్జునా! పొందును
శ్రేష్ఠమైన శాంతి శీఘ్రముగను. 39

శ్లో|| అజ్ఞశ్చా శ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి |
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ||

ఆ.వె. శ్రద్ధ లేని వాఁడు జ్ఞాన విహీనుండు
సంశయాత్ముఁడైన జనుఁడు చెడును;
సంశయాత్ముఁడైన జనునకు సుఖ మిచ
టేనిఁ బరము నందు నేని లేదు. 40

శ్లో|| యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్న సంశయమ్ |
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ||

గీ. యోగ బలమునఁ గర్మము లుడుగు వాని,
జ్ఞాన సంఛిన్న సంశయుఁడైన వాని,
దృఢ మనస్కుఁడౌ వాని బంధింప లేవు
సకల కర్మముల్, పాకశాసనతనూజ! 41

శ్లో|| తస్మాదజ్ఞానసమ్భూతం హృత్ స్థం జ్ఞానాసి నాఽత్మనః |
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ||

గీ. జ్ఞాన ఖడ్గంబు చేత నజ్ఞాన జనిత
హృదయ సంస్థితమైన నీయిట్టి సంశ
యంబు ఛేదించి; పార్థ! ధైర్యంబుఁబూని
యోగ మాచరింపుము లెమ్ము యుద్ధమునకు. 42

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
జ్ఞానయోగోనామ
చతుర్థోఽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజస గోత్రాప స్తంబసూత్ర
బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య పుత్త్ర
భక్త కవి విధేయ హనుమంతనామధేయ ప్రణీతంబైన
శ్రీ మద్భగవద్గీతామృతయోగ శాస్త్రంబను బద్యకావ్యంబున
జ్ఞానయోగమను
చతుర్థాధ్యాయము.

శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## కర్మసన్న్యాస యోగము

## పంచమాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో|| సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి|
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

ఆ.వె. శౌరి! పలికి కర్మ సన్న్యాసమును గర్మ
యోగ మీవు పలికియుంటి మఱల
రెంటి లోన నెద్ది శ్రేష్ఠమో యద్దాని
నాన తిమ్ము నిశ్చయముగ నాకు. 1

శ్రీ భగవా నువాచ

శ్లో|| సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ|
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. కర్మ సన్న్యాసమును మఱి కర్మ యోగ
మనెడు నీ రెండు మోక్షదాయకము లందుఁ
గర్మ సన్న్యాసమున కంటెఁ గర్మ యోగ
ముత్తమం బైనదని గనుమో కిరీటి! 2

శ్లో|| జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి|
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధా త్ప్రముచ్యతే||

గీ. ఎవఁడు ద్వేషింపఁడో మఱి యెవఁడు గోరఁ
డామహాత్ముండు నిత్య సన్న్యాసి యగును;
ద్వంద్వములఁ ద్యజియించెడి వాఁడు విజయ!
పరమ సుఖముగఁ బాయును బంధములను. 3

శ్లో॥ సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః|
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్||

గీ. జ్ఞాన హీనులు వేఱంద్రు సాంఖ్య, యోగ
ములను రెంటినిఁ బండితుల్ పలుక రటుల,
నందు నొకటేని లెస్సఁగా నాచరింప
బొందు రెండింటి ఫలమును, బుణ్యచరిత! 4

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగై రపి గమ్యతే|
ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి||

గీ. జ్ఞాననిష్ఠులచే నెట్టి స్థాన మొందఁ
బడునొ యదియె యోగుల చేతఁ బడయఁ బడును
జ్ఞాన కర్మ యోగముల నొక్కటిగ నరయు
వాఁడె లెస్సగాఁ దెలిసిన వాఁడు పార్థ! 5

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః|
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి||

ఆ.వె. కడు నసాధ్య మగును గర్మ యోగము లేక
జ్ఞాన యోగ మొందఁ గర్మ యోగ
యుక్తుఁడైన మౌని యొందును బ్రహ్మంబు
నమిత శీఘ్రముగను, విమలహృదయ! 6

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః|
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే||

గీ. అనఘ! యోగ యుక్తుఁడు, విశుద్ధాత్ముఁడు, విజి
తాత్ముఁడు, జితేంద్రియుండు, భూతాత్మకుండు,
సర్వ భూతాత్మకుఁడు నైన జనుఁడు, కర్మ
లాచరించిన వానిచే నంటఁ బడఁడు. 7

శ్లో॥ నైవ కిఞ్చి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥

గీ. తత్త్వ విదుఁడైన యోగి యెద్దాని నైనఁ
దాను జేయ నటంచును దలచుఁ; వినుచుఁ
గనుచుఁ దాకుచుఁ జనుచుఁ మూర్కొనుచుఁ దినుచుఁ
నూర్పు లడరుచుఁ నిద్దుర నొందు చుండి. 8

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్॥

ఆ.వె. అర్జున! పలుకుచుఁ విసర్జించుచును గొంచుఁ
గన్నులను దెఱచుచుఁ, గనుల మూయు
చింద్రియములు మాత్ర మింద్రియార్థముల వ
ర్తించు ననుచు నిశ్చయించు కొనును. 9

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా॥

ఆ.వె. అఖిల కర్మలఁ బరమాత్మ యందుంచి త
త్కర్మ ఫలము నందుఁ గాంక్ష నుడిగి
యాచరించు వాని నఘము లంటవు, నళి
నీదళంబు నందు నీర మటుల. 10

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాzzత్మశుద్ధయే॥

గీ. కర్మ యోగులు తత్ఫలాకాంక్ష వదలి
యాత్మ శుద్ధికై కర్మము లాచరింత్రు
మనసుచే, బుద్ధిచేఁ, గాయముననను, గేవ
లేంద్రియంబులచేత, నో యింద్రతనయ! 11

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥

గీ. యోగి కర్మ ఫలాసక్తి నుడిగి నైష్ఠి
కమగు శాంతిఁ గాంచును, యోగి కాని వాఁడు
కర్మ ఫలమందు నాసక్తిఁ గలిగి కామ
కారణంబున, ఫల్గునా! కట్టు వడును. 12

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్నకారయన్॥

గీ. మనసు చేతను సర్వ కర్మముల విడిచి
చేయకయె తా నితరులను జేయనీక
వర సుఖముగ నవద్వార పట్టణమున
నింద్రతనయ! వసించుఁ జితేంద్రియుండు. 13

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥

ఆ.వె. కర్మములను గాని కర్తృత్వమును గాని
కర్మ ఫలము నందు గాంక్షఁ గాని
భువి సృజింపఁడాత్మ, పురుహూతనందనా!
కలుగు చుండుఁ బ్రకృతి వలన నవ్వి. 14

శ్లో॥ నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥

ఆ.వె. ఎవని పాపంబు నేనియు నెవని పుణ్య
మేనిఁ బొందడీ యాత్మ యజ్ఞానముసను
జ్ఞాన మావృతమయె దానఁ బ్రాణు లెల్ల
మోహమును బొందు చున్నారు, పుణ్యచరిత! 15

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః|
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్||

ఆ.వె. వీరలోకవంద్య! ఏరి జ్ఞానమున, న
జ్ఞాన మెల్ల నాశనంబుఁ గాంచు
నా పురుషుల జ్ఞాన మాదిత్యునటు పర
మాత్మ తత్త్వము వెలుఁగందఁ జేయు. 16

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః|
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః||

గీ. ఆత్మ యందున బుద్ధియు నాత్మ యందు
మనసు, తన్నిష్ఠ, తత్పరాయణులు నగుచు
జ్ఞాన నిర్ధూత కల్మషులైన వారు
వడయు చున్నారు శాశ్వత బ్రహ్మపదము. 17

శ్లో॥ విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని, |
శుని చైవ శ్వపాకే చ పణ్డితాస్సమదర్శినః||

గీ. వినయ విద్యలు గలిగిన విప్రు నందు
గోవు నందు నేనుఁగు నందుఁ గుక్క యందు
నట్టిది భుజించు చండాలు నందుఁ దుల్య
భావమును గల్గు వారలే ప్రాజ్ఞు లనఘ! 18

శ్లో॥ ఇహైవ తై ర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః|
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః||

గీ. ఏరి మనసు సామ్యము నొందు; వారు పార్థ!
యిహము నందె భవంబు జయించు చుండ్రు
బ్రహ్మము సమంబుఁ గల్మష రహిత మగుట
నట్టి సమభావు లుండ్రు బ్రహ్మంబునందు. 19

శ్లో|| న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్ |
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః ||

గీ. బ్రహ్మ మందుఁ జెలంగెడి బ్రహ్మ విదుఁడు
మోహ వర్జితుఁడై స్థిర బుద్ధిఁ గలిగి
విజయ! సంతోష మొందఁడు ప్రియముఁ బొంది,
యప్రియముఁ బొంది దుఃఖింపఁ డాత్మయందు. 20

శ్లో|| బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్ద త్యాత్మని యత్సుఖమ్ |
న బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే ||

గీ. బాహ్య విషయ సంయోగ వివర్జితాత్ముఁ
డగుచు నాత్మ యందే సుఖ మందు నతఁడె
బ్రహ్మ యోగ యుక్తాత్ముఁడై, పాండుతనయ!
యక్షయంబైన యోగము నందు చుండు. 21

శ్లో|| యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే |
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ||

ఆ.వె. ఏ సుఖంబులు విషయేంద్రియ భవములో
కనఁగ నవియె దుఃఖ కారణములు;
ప్రీతిఁ బొంద రందు విద్వాంసు, లవ్వి యా
ద్యంతవంతములయి యలరు కతన. 22

శ్లో|| శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ |
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్సుఖీ నరః ||

ఆ.వె. తనువు విడచునంత దనుక నే మనుజుండు
గామ కోపములను గలుగు వేగ
మును సహింపఁ గలఁడొ, పురుహూతనందనా!
వాఁడె యోగి, సుఖియు వాఁడె యగును. 23

శ్లో॥ యోऽన్తస్సుఖోऽన్తరారామ స్తథా న్తర్జ్యోతి రేవ యః।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోऽధిగచ్ఛతి॥

గీ. ఆత్మ యందున సౌఖ్యము నాత్మఁ గ్రీడ
నంది యెవ్వఁడంతర్జ్యోతియై వెలంగుఁ,
బాండవోత్తమ! యా యోగి బ్రహ్మభూతుఁ
డగుచుఁ దాను బ్రహ్మానంద మందు చుండు. 24

శ్లో॥ లభన్తే బ్రహ్మ నిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః॥

గీ. ద్వంద్వములఁ ద్యజియించి పాపములఁ ద్రుంచి
నిఖిల విషయేంద్రియంబుల నిగ్రహించి
యఖిల భూత హితాసక్తులై చరించు
ఋషులు గాంత్రు బ్రహ్మానంద మింద్రతనయ! 25

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥

ఆ.వె. విహిత చేతసులును విగత కామ క్రోధు
లగుచు నాత్మ వేత్త లైన యోగు
లొందుదు రిహపరము లందు బ్రహ్మానంద
పదము ననవరతముఁ బాండవేయ! 26

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ॥

గీ. బాహ్యముగ వీడి శబ్దాది బాహ్య విషయ
ములను, నేత్రములను గనుబొమల మధ్య
యందు నిల్పుచు, నాసికాభ్యంతరమున
నలరఁ జేసి ప్రాణాపానములను సమత. 27

శ్లో॥ యతేన్ద్రియమనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో య స్సదాముక్త ఏవ సః॥

గీ. బుద్ధి మనసు సర్వేంద్రియములను నిగ్ర
హించి, నిశ్చలుఁడగుచు, మోక్షేచ్ఛఁ గలిగి
భయము, క్రోధము, వాంఛయు వదలు మౌని
సర్వదా ముక్తుఁడై యొప్పు సవ్యసాచి! 28

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి॥

గీ. అఖిల యజ్ఞ తపంబుల ననుభవించు
వాని, సర్వ భువన మహేశ్వరుని, మఱియు
నఖిల భూత హితాసక్తుఁడైన నన్ను
నెఱిఁగిన యతండు శాంతి వహించుచుండు. 29

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
కర్మసన్న్యాసయోగోనామ
పఞ్చమోఽధ్యాయః

ఇది శ్రీరాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసుత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్తకవి విధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను బద్యకావ్యంబున
కర్మసన్న్యాసయోగమను
పంచమాధ్యాయము.

శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## ఆత్మసంయమ యోగము

### షష్టాధ్యాయము

శ్రీ భగవా నువాచ

శ్లో|| అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః|
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాzక్రియః||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. కర్మ ఫల కాంక్ష విడనాడి కార్యకర్మ
లాచరించెడి వాఁడె సన్యాసి, యతఁడె
యోగి యగుఁగాని యగ్ని లేకున్న వాఁడు
కర్మ శూన్యుఁడు సన్యాసి కాఁడు పార్థ! 1

శ్లో|| యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ|
న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన||

ఆ.వె. జ్ఞాను లెట్టి దాని సన్యాస మని యందు
రదియ కర్మయోగ మనుచుఁ గనుమి;
కర్మ ఫలము నందుఁ గాంక్షను విడ లేని
వాఁడు యోగి కాఁడె వాఁడు నేని. 2

శ్లో|| అరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే|
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే||

ఆ.వె. జ్ఞాన యోగ మొందఁ గాంక్షించు మౌనికిఁ
కర్మ యోగ మగును గారణంబు;
అట్టి జ్ఞాన యోగ మందిన యతనికి
శమము సాధనంబు విమలచరిత! 3

శ్లో|| యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే|
సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే||

ఆ.వె. ఇంద్రియార్థములను, నెల్ల కర్మముల నా
సక్తి నెపుడు విడువఁ జాలు, నపుడ
సవ్యసాచి! సర్వ సంకల్ప సన్న్యాసి
యగుచు యోగ సిద్ధుఁ డనఁగఁ బడును. 4

శ్లో|| ఉద్ధరే దాత్మనాzzత్మానం నాత్మాన మవసాదయేత్|
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః||

ఆ.వె. ఆత్మ నుద్ధరింప నగు నాత్మచే నరుఁ
డెప్పు డాత్మను నలయింపఁ దగదు;
ఆత్మ యగును బంధు వాత్మకు, నర్జునా!
ఆత్మ కమిత శత్రు వాత్మ యగును. 5

శ్లో|| బన్ధు రాత్మాzzత్మన స్తస్య యే నాత్మై వాత్మనా జితః|
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాzzత్మైవ శత్రువత్||

గీ. ఎట్టి యాత్మచే నాత్మ జయింపఁబడునొ
యట్టి యాత్మకు బంధువా యాత్మ యగును;
ఎట్టి యాత్మ జయింపఁగాఁడేని వాని
కాత్మయే పరిపంథియై యలయఁ జేయు. 6

శ్లో|| జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః|
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః||

ఆ.వె. చలిని వేఁడి నైన సౌఖ్య దుఃఖంబుల,
మాన మందున, నవమాన మందు,
నాత్మ జయముఁ గనుచు నతి శాంతుఁడౌ పర
మాత్మ పొందు సమత; నవఘచరిత! 7

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః॥

గీ. జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముఁడైన వాఁడు,
నిర్వికారుఁడును, విజితేంద్రియుఁడు నగుచుఁ
బార్థ! మంటి పెళ్ళను, రాతిఁ, బైడి, సమత
నరయు యుక్తుఁడు యోగి యంచనఁగఁ బడును. 8

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబన్ధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥

గీ. స్నేహితులయందు, మఱి, యుదాసీనులందు;
అరుల, నుపకారులందు, మధ్యస్థులందు,
సాధువుల, బంధువుల, ద్వేష జనుల, బాపు
లందు సమబుద్ధిఁగల వాఁడె యతి వరుండు. 9

శ్లో॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥

గీ. అర్జునా! యోగి నియత చిత్తాత్ముఁ డగుచు
నాశ విడనాడి యేకాకియై పరిగ్ర
హంబు లేక రహస్య స్థలంబుఁ జేరి,
యెల్ల యెడల నాత్మను నిగ్రహింప వలయు. 10

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్॥

గీ. మిగుల నున్నతంబును గాక మిగులఁ దగ్గు
గాని పరమ శుద్ధంబైన స్థాన మందు
దర్భలజినంబుఁబైన వస్త్రంబుఁ బఱిచి
తనకు నిశ్చలమైన యాసనము నిలిపి. 11

శ్లో॥ తత్రై కాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియ క్రియః।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మ విశుద్ధయే॥

గీ. యోగి యాయాసనమునఁ గూర్చుండి, మనసు
నిలిపి చిత్తేంద్రియ క్రియల్ నిగ్రహించి,
యాత్మ పారిశుద్ధ్యాప్తికై యభ్యసింప
వలయు యోగంబుఁ బాండుభూపతితనూజ! 12

శ్లో॥ సమం కాయంశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చాzనవలోకయన్॥

గీ. తన శరీరంబుఁ గంఠంబుఁ దలను మూఁటి
నిశ్చలంబుగ సమముఁగా నిలిపి, స్థిరుఁడు
నై, ధనంజయా! నిజ నాసికాగ్ర మందుఁ
జూపు నిలుపుచు దిక్కులఁ జూడకుండ; 13

శ్లో॥ ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥

ఆ.వె. భయము విడిచి, శాంతభావుఁడై, బ్రహ్మచ
ర్య వ్రత స్థితుండునై, మనంబు
నిగ్రహించి, దాని నిలిపి నా యందు, యు
క్తుండు, మత్పరుఁడుగ నుండ వలయు. 14

శ్లో॥ యుఞ్జ న్నేవం సదాzzత్మానం యోగీ నియతమానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥

ఆ.వె. నిరతమును మనంబు నియమించి, యోగి యి
ట్లాత్మ నాత్మవశము నందు నునిచి,
నా యధీనమై, యమేయ మోక్షాత్మిక
శాంతిఁ గాంచుచుండు, సవ్యసాచి! 15

శ్లో|| నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః|
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున||

గీ. జగతి నిట్టి యోగముఁ బొంద జాలఁ డధిక
భోజనము సేయు వాఁడును, భోజనముఁ ద్య
జించువాఁ డధికముగ నిద్రించుఁ వాడు,
నిద్రయే లేనివాఁడు, కౌంతేయమధ్య! 16

శ్లో|| యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు|
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా||

గీ. ఉచితమైన యాహారము నుచితమౌ వి
హార మర్థ కర్మముల వ్యాపారము, మఱి
మెలఁకువయు, నిద్రఁ దగినట్లు గల యతండు
వ్యసనమును బాపు నీ యోగ మందు చుండు. 17

శ్లో|| యదా వినియతం చిత్తమాత్మ న్యేవావతిష్ఠతే|
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా||

ఆ.వె. ఇంద్రతనయ! యెప్పు డేకాగ్రమగు చిత్త
మాత్మ యందు నిలుచు, నట్టి తఱిని,
సకల కామములను సంసక్తిఁ బోనాడి
యతఁడు యోగ యుక్తుఁ డనఁగ బడును. 18

శ్లో|| యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా|
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః||

గీ. దీప మెటుల నివాత ప్రదేశ మందుఁ
జలన మొందక నిలుచు నా సరణి, నియమి
తాత్ముఁడై యోగమునుఁ జేయు నట్టి యోగి
యాత్మ స్థిరమైనదని బుధు లాడు చుంద్రు. 19

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాzz త్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥

గీ. పుణ్యచరిత! యోగాభ్యాసముననను, నిగ్ర
హింపఁబడి చిత్త ముపరతి నెందుఁ బొందు,
నెందు, నాత్మచే నాత్మ నీక్షించుచుండి
తాను జిత్తంబు నందు సంతసముఁ గాంచు. 20

శ్లో॥ సుఖ మాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః॥

గీ. ఏ యవస్థ యందెద్ది యతీంద్రియంబు
నగుచు, బుద్ధి చేతను గ్రాహ్యమౌ, నితాంత
సౌఖ్య మెద్దానఁ గనునొ, తాఁ జలన మొందఁ
దలఁపఁడో యోగి యెట్టి తత్త్వమున నుండి. 21

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥

గీ. అర్జునా! యెట్టి లాభంబు నంది, యంత
కంటె నితర లాభము లధికముగ నెంచఁ
బూనఁడో యెట్టి లాభముఁ బొందు వెనుక
నెంత క్లేశంబుఁగలుగఁ జలింపఁబోఁడొ. 22

శ్లో॥ తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోz నిర్విణ్ణచేతసా॥

గీ. అట్టి దుఃఖ బంధ నివృత్తి యగును యోగ
మదియు, సంశయాభావమవ్యాకులంబు
నైన చిత్తంబు నొందిన యతఁడు శ్వేత
వాహ! యీ యోగ మభ్యసింపగ వలయు. 23

శ్లో॥ సఙ్కల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మన సైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః, ॥

గీ. పాండుతనయ! సంకల్ప సంభవము లైన
సకల కామితముల నశేషముగ విడిచి,
మఱియు, నింద్రియ వితతిని మనసు చేత
నిఖిల విషయంబు లందుండి నిగ్రహించి. 24

శ్లో॥ శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చదపి చిన్తయేత్॥

గీ. ఇద్ధచారిత్ర! ధృతిచే గ్రహింపఁ బడిన
బుద్ధిఁ గని యోగి యుపరతిఁ బొంద వలయు;
మనసు మెల్ల మెల్లగ నాత్మ నునిచి యితర
మేది యైనను లోనఁ జింతింప రాదు. 25

శ్లో॥ యతో యతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥

గీ. అస్థిరంబును జంచలమైన మనము
నెట్టి విషయంబులను సంచరించు; వాని
యందు నిలుపక, నియమించి, యాత్మ కైవ
సంబుఁగాఁ జేయ వలె యోగి సత్తముండు. 26

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్।
ఉపైతి శాన్త రజసం బ్రహ్మభూత మకల్మషమ్॥

గీ. శాంత చిత్తుఁడు విగత రాజస గుణుండు
బ్రహ్మ భూతుఁడు కల్మష రహితుఁడైన
యట్టి యా యోగి యుత్తమంబైన సుఖముఁ
దనకు దానొందు చుండు భూధవవ రేణ్య! 27

శ్లో॥ యుఞ్జన్నేవం సదాऽऽత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే॥

ఆ.వె. ఇవ్విధమున నాత్మ నెల్ల వేళలను, స్వ
వశము నందు నునిచి పాప రహితుఁ
డైన యోగి వర్యుఁడందు బ్రహ్మాత్మిక
సుఖము; విజయ! మిగుల సులభముగను. 28

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

గీ. అట్టియీ యోగ యుక్తాత్ముఁ డగుచు సకల
భూతముల యందును సమత్వ బుద్ధిఁ గలిగి
యఖిల భూతంబు లందున నాత్మ, నాత్మ
యందు నఖిల భూతంబుల నరయుచుండు. 29

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥

గీ. ఎవఁడు సకలంబు నందు నీక్షించు నన్ను
నెవఁడు నా యందు సకల మీక్షించు చుండు;
జగతి వానికి నేఁ బరోక్షంబు నొంద,
వాఁడు నాకుఁ బరోక్షంబుఁ గాఁడు; పార్థ! 30

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః।
సర్వథా వర్తమానోऽపి స యోగీ మయి వర్తతే॥

గీ. కవ్వడీ! యెట్టి యోగి యేకత్వ మొంది
యఖిల భూత స్థితుండనై యలరు నన్ను
భజనఁ జేయునొ, వాఁడు సర్వ విధములఁ జ
రించుచున్న నాఁ యందె వర్తించుచుండు. 31

శ్లో|| ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యో஽ర్జున|
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః|

గీ. వ్యసన మైనను మఱి సౌఖ్యమైనఁ గాని
సంభవించినచో నాత్మ సామ్యము గను
సకల భూతము లందున సామ్య బుద్ధిఁ
గనెడి వాఁడె పరమ యోగి యని తలంతు. 32

అర్జున ఉవాచ

శ్లో|| యో஽యం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన|
ఏతస్యాహం న పస్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

గీ. పుండరీకాక్ష! యే యోగమును వచించి
తరయ నీ విప్డు సమ భావ మనుచు, మనసు
చంచల మగుట, నెఱుఁగఁగాఁ జాల నిట్టి
యోగమునకు స్థిరంబైన యునికి నేను. 33

శ్లో|| చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాధి బలవద్దృఢమ్|
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్||

గీ. మాధవ! మది చంచలము, నిర్మథన శీల
మధిక బలవంతము, ధృఢంబు నగును గాన
వాయువును నిల్పు టెట్లసంభవమో యటుల
మనసు నిలుపుట దుర్లభంబని తలంతు. 34

శ్రీ భగవా నువాచ

శ్లో|| అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్|
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. సంశయంబేమిలేదిందు; స్వాంతమధిక
చంచలంబును, నిలుప నసాధ్య మగును;
క్రమత నభ్యాసమునను వైరాగ్యమునను
దాని వశము చేసి కొనంగఁ దగుఁ గిరీటి! 35

శ్లో|| అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః|
వశ్యాత్మనా తు యతతా శక్యోऽవాప్తు ముపాయతః||

ఆ.వె. మనసు నిలుప లేని మనుజుఁడీ యోగంబుఁ
బొంద లేఁడటంచు బుద్ధిఁ దలఁతు;
మనసు నిలుపఁ గలుగు మనుజుఁడుపాయంబు
వలన, యత్నముునను బడయఁ జాలు. 36

అర్జున ఉవాచ

శ్లో|| అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః|
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

గీ. తగిన శ్రద్ధయుఁ గల్గి యత్నంబు లేమి
యోగ సంసిద్ధిఁ బొందక, యోగ చలిత
మానసుండునై, శ్రీకృష్ణ! మరణ మొందు
నట్టి మానవుఁడేగతి నందు చుండు. 37

శ్లో|| కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి, |
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి||

గీ. వారిజాక్ష! విమూఢుఁడై, బ్రహ్మ పథము
నందు నాధార శూన్యుండు నగుచు, జ్ఞాన
కర్మముల రెంట భ్రష్టుఁడై, ఖండిత మగు
నంబుదంబు విధిని నాశ మందు నేమి? 38

శ్లో|| ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్యశేషతః|
త్వదన్యస్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే||

గీ. ఇట్టి నా సంశయముఁ దీర్ప నీవు గాక
యితరుఁ డెవ్వఁడు లభియింపఁ డెందు నేని;
శ్రీశ! నా సంశయంబు నిశ్శేషము గను
దొలఁగ జేయఁగా గల సమర్థుఁడవు నీవ. 39

శ్రీ భగవా నువాచ.

శ్లో|| పార్థ నై వేహ నాఽ ముత్ర వినాశ స్తస్య విద్యతే|
న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. అట్టి వానికి లేదిహమందు నైనఁ
గానిఁ, బరలోక మందైనఁ గాని నాశ
నంబు, నాయనా! పుణ్య కృత్యంబు లాచ
రించు నాతఁడు దుర్గతిఁ గాంచ డెవఁడు. 40

శ్లో|| ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః|
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయ తే. ||

గీ. అనఘచరిత! యోగ భ్రష్టుఁడైన వాఁడు
పుణ్య వంతుల లోకముల్ పొంది, పెక్కు
వత్సరము లుండి యాచార వంతు లైన
యర్థ వంతుల గేహము లందు బుట్టు. 41

శ్లో|| అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్|
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్||

ఆ.వె. అటులఁ గాని యెడల నధిక ధీమంతులౌ
యోగుల కుల మందు నుద్భవించు;
జగతి యందు నిట్టి జన్మంబు గలుగుట
పార్థ! మిగుల దుర్లభంబు గాదె. 42

శ్లో|| తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ |
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునన్దన ||

ఆ.వె. అట్టి తఱిఁ బూర్వ దైహికంబై యెసంగు
బుద్ధి సంయోగ మాతఁడు పొందు చుండు;
దాని చేతను బ్రబల యత్నంబు మఱలఁ
జేయు చుండును జ్ఞాన సంసిద్ధి కొఱకు. 43

శ్లో|| పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః, |
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ||

గీ. అనఘ! పరవశుఁడై యున్న నైన నతని
బలిమి నీడ్చుఁ బురాకృతాభ్యాస బలము;
యోగ రూపం బెఱుంగఁగా నూహ గలుగు
నాతఁడైన శబ్దబ్రహ్మ నతకరించు. 44

శ్లో|| ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః |
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ||

గీ. అధిక యత్నంబు సలిపెడు నట్టి యోగి
పాప వర్జితుఁడై, పెక్కు భవము లందు
సలిపి యున్న సంస్కారంబు వలన సిద్ధుఁ
డగుచు, నుత్కృష్టమౌ గతి నందు విజయ! 45

శ్లో|| తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః |
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ||

గీ. పార్థ! యోగియౌ వాఁడు తపసుల కంటె,
జ్ఞాన వంతుల కంటెను, గర్మములను
జేయు వారల కంటెను శ్రేష్ఠుఁ డగును
గాన నిప్పుడు యోగివి కమ్ము నీవు.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥

ఆ.వె. అఖిల యోగు లందు, ననిశము నా పయి
స్వాంత ముంచి మిగుల శ్రద్ధఁగలిగి
భజన సేయుచుండు వాఁడె యుక్త తముఁడ
టంచు నేఁదలంతు, నమలహృదయ! 47

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
ఆత్మసంయమయోగోనామ
షష్ఠోऽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్తకవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
ఆత్మసంయమయోగమను

షష్ఠాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## విజ్ఞానయోగము

### సప్తమాధ్యాయము

శ్రీ భగవా నువాచ

శ్లో|| మయ్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జ న్మదాశ్రయః|
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి త చ్ఛృణు ||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. అనఘ! నా యందుఁ దవిలిన మనము గలిగి
యోగ మొనరించుచు మదాశ్రయుండవై, స
మగ్రమౌ నన్ను నిస్సంశయముగ నెట్టు
లెఱుఁగఁ గలుగుదో యద్దాని నిపుడు వినుము. 1

శ్లో|| జ్ఞానం తేऽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్య శేషతః|
యద్జ్ఞాత్వా నేహ భూయోऽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే ||

గీ. ఎద్ది యెఱిఁగిన వేఱొక్కటీవు మఱల
నెఱుఁగఁదగి యున్న విషయ మెందేని లేదొ;
ఆస విజ్ఞానమగు జ్ఞానమంత యిప్పు
డెఱుఁగఁ బల్కెద వినుము దేవేంద్రతనయ! 2

శ్లో|| మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే|
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః||

గీ. మాన్యచరిత! వేల కొలంది మనుజు లందు
జ్ఞాన సిద్ధికై యొకఁడు యత్నంబు సలుపు;
జతనమును సిద్ధికై సల్పు జనుల సైత
మరయు నొక్కడు నన్ను యథార్థముగను. 3

శ్లో|| భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ|
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా. ||

ఆ.వె. అవనియును జలంబు హవ్యవహుండును
మారుతము నభంబు మానసంబు
బుద్ధ్యహంకృతులనఁ బొలుచు నెన్మిది విభే
దముల నాదు ప్రకృతి యమలహృదయ! 4

శ్లో|| అపరేయమిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్||

గీ. ఇట్టి ప్రకృతి నికృష్టమౌ, నిద్ధచరిత!
దీని కంటె నన్యముఁ బరమైన నాదు
ప్రకృతి జీవరూపమయి సర్వ ప్రపంచ
మునకు నాధారమగు దానిఁ గనుమి యిందు. 5

శ్లో|| ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ|
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా||

ఆ.వె. ఎల్ల భూతములకు నీ రెండు ప్రకృతులు
గారణంబు లనుచుఁ గనుమి, పార్థ!
ప్రభవమునకు మఱియుఁ బ్రళయంబునకు నేన
మూల మగుదు నిఖిల భువనములకు. 6

శ్లో|| మత్తః పరతరం నాన్య త్కిఞ్చిదస్తి ధనఞ్జయః|
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ||

గీ. శ్వేతవాహన! నా కంటె శ్రేష్ఠమైన
యితర కారణ మొక్కింత యేని లేదు;
లోకములు గూర్పఁ బడియె నా లోన దార
మందుఁ గూర్చిన రత్న చయంబు పగిది. 7

శ్లో|| రసోऽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః|
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు||

గీ. జలము నందునఁ గలుగు రసంబు నేన,
దినకర సుధాంశులకుఁ గల తేజ మేన
నిఖిల శ్రుతులందుఁ బ్రణవంబు నేన, నాక
సమున ధ్వని, పురుషులం బౌరుషంబు నేన. 8

శ్లో|| పుణ్యోగన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ|
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు||

గీ. ధరణి యందలి పుణ్య గంధంబు నేన,
జ్వలను నందున వెలుగు తేజంబు నేన,
పార్థ! భూతము లందు జీవనము నేన,
తాపస శ్రేష్ఠు లందలి తపము నేన. 9

శ్లో|| బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్|
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజస్తేజస్వినా మహమ్||

గీ. పుణ్యచారిత్ర! యీ సర్వ భూతములకు
శాశ్వతంబగు పరమ బీజంబు నేన,
బుద్ధిమంతుల యందలి బుద్ధి నేన
సకల తేజసులందు దేజంబు నేన. 10

శ్లో|| బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్|
ధర్మావిరుద్ధో భూతేషు కామోऽస్మి భరతర్షభ||

గీ. బలియులను గామ రాగ వివర్జిత మగు
బలము నే నౌదు నీ యెల్ల ప్రాణు లందు;
ధర్మ శాస్త్రంబునకు విరుద్ధంబు గాని
కామమును నేన యగుదు, సుత్రామతనయ! 11

శ్లో|| యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే |
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి ||

గీ. అమల సాత్వికములు రాజ సాత్మికములు
పార్థ! తామసములగు భావంబు లెల్లఁ
బ్రభవ మొందుచు నుండు నా వలన, వాని
యందు నే నుండ నవియ నా యందు నుండు. 12

శ్లో|| త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్ |
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్ ||

ఆ.వె. కవ్వడీ! త్రిగుణ వికార భావములచే
మోహ మొందు చుండు భువన మెల్ల;
నాశ రహితుఁడును, గుణంబు లన్నిటి కంటెఁ
బరుఁడ ననుచు నన్ను నెఱుఁగ లేదు. 13

శ్లో|| దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా |
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే ||

గీ. దేవ సంబంధియును మఱిఁ ద్రిగుణ మయము
నైన నా మాయ దాటఁగా నలవి గాదు;
ఎట్టి వారు నన్నే యాశ్రయింప గలరొ
వార లీ మాయను దరింత్రు పాండుతనయ. 14

శ్లో|| న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః |
మాయయాzపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ||

ఆ.వె. మూఢులును నరాధములు పాప కార్య త
త్పరులు నాసుర స్వభావ మాశ్ర
యించి, మాయచే నశింప జ్ఞానము సమ
స్తంబు, విజయ! నాదు శరణుఁ గనరు. 15

శ్లో|| చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోzర్జున |
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ||

ఆ.వె. అమరలోకవంద్య! యార్తుఁడు జిజ్ఞాసు
వును, ధనార్థి, జ్ఞాని, యనగఁ నొప్పు
నాల్గు విధము లైన నరులు పుణ్యాత్మకు
లంచితముగ నన్ భజించు చుంద్రు. 16

శ్లో|| తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే|
ప్రియో హి జ్ఞానినోऽత్యర్థమహం స చ మమ ప్రియః||

గీ. వార లందఱిలో నేక భక్తి గలిగి
యర్జునా! నిత్య యుక్తాత్ముఁడైన జ్ఞాని
శ్రేష్ఠుఁడగు; జ్ఞానికే నతి ప్రియుఁడ నగుదు;
వాఁడు మిక్కిలి ప్రియుమైన వాఁడు నాకు. 17

శ్లో|| ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవమేమతమ్|
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్||

గీ. ఇట్టి వీరందఱు నుదారులే తలంప
జ్ఞాని యన, నాత్మయే యని నా మతంబ
దేల యన యోగ యుక్తుఁడై 'యేన' యనెడు
నుత్తమ మగు ప్రాప్యస్థాన మొందు నితఁడు. 18

శ్లో|| బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే|
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః||

గీ. పెక్కు జన్మంబు లెత్తిన పిదప జ్ఞాన
వంతుఁడై "యీ సమస్తము వాసుదేవుఁ
డొక్కఁడే" యంచు నరసి నన్నొందఁగలుగు
నా మహాత్ముఁడు దుర్లభుఁ డనఘచరిత! 19

శ్లో|| కామై స్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేऽన్యదేవతాః|
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా. ||

గీ. వాసవీ! నరుల్ తమ తమ ప్రకృతులను ని
యమితు లగుచు నాయా విషయముల బలిమి
నపహృత జ్ఞానులై యా నియమము లాచ
రించి యితర వేల్పుల నాశ్రయించు చుంద్రు. 20

శ్లో॥ యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥

గీ. ఫల్గునా! యెవ్వఁడెవ్వఁడు భక్తిఁ గలిగి
శ్రద్ధ నెట్టెట్టి మూర్తి భజనముఁ గోరు
నవని నట్టట్టి వానికే నట్టి శ్రద్ధఁ
జలన మొందని దానిఁగా సలుపు చుందు. 21

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥

ఆ.వె. అటుల శ్రద్ధ గలిగి యారాధనంబును
సలుపు, దాన మత్ప్రసాదమునను
వాఁడు కోరి యున్న వాంఛితార్థంబులఁ
బొందు నిష్టదైవ మూలముననె. 22

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్ ।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి ॥

ఆ.వె. స్వల్ప బుద్ధులైన వారల ఫలములం
తంబు లగును; దేవతలను గొలుచు
వారు దేవతలనె పడయు చుందురు, నాదు
భక్త జనులు నన్నె పడయు చుంద్రు, 23

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్. ॥

గీ. పుణ్యచారిత్ర! కొందఱు బుద్ధిహీను
లవిదితోత్తమంబును, నవ్యయంబునౌ మ
దీయ పరమ భావంబును దెలియ లేక
వ్యక్తుఁడని యెంతు రవ్యక్తుఁడైన నన్ను. 24

శ్లో|| నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః|
మూఢోऽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్||

ఆ.వె. మాన్యచరిత! యోగమాయా సమావృతుఁ
డైన నే నెవారికేనిఁ గానఁ
బడను; శాశ్వతుఁడు నభవుఁడనౌ నను మూఢు
లైన యీ జనంబు లరయ లేరు. 25

శ్లో|| వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున|
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన||

కం. జరిగినవి జరుగు చున్నవి
జరుగంగాఁ గలుగు భూత సముదాయంబే
నెఱుఁగుదు; నను నొకఁడేనియు
నెఱుఁగంగను నేరఁడో మహేంద్రతనూజా! 26

శ్లో|| ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వ మోహేన భారత|
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప||

గీ. సవ్యసాచి! యిచ్ఛా ద్వేష సంభవంబు
నైన ద్వంద్వాత్మికమగు నజ్ఞానముననను
జన్మ మొందిన తోడనే జగతి యందు
భూత కోటి సమ్మోహంబుఁ బొందు చుండు. 27

శ్లో|| యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్|
తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢ వ్రతాః||

గీ. అర్జునా! పుణ్య కర్మంబు లాచరించి
దాన పాప నాశన మొంది ద్వంద్వ మోహ
ములను విడనాడి, పరమధాముఁడగు నన్ను
భజనఁ జేయు చుందురు దృఢ వ్రత నిరూఢి. 28

శ్లో॥ జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్॥

గీ. కవ్వడీ! జరామరణ మోక్షంబు కొఱకు
నన్ను సముపాశ్రయించి యత్నంబుఁ జేయు
యోగ యుక్తు లెఱుంగుచు నుంద్రు సతము
బ్రహ్మమధ్యాత్మ మఖిల కర్మముల నెల్ల. 29

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతనః॥

గీ. ఎవరు నన్నధిభూత సహితుఁని గాగ
నటుల నధిదైవయుతు నధియజ్ఞయుక్తుఁ
గా నెఱుఁగుదురొ వారంత్యకాల మందు
నరయు చుందురు నన్ను యుక్తాత్మ లగుచు. 30

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే విజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః
ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్తకవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
విజ్ఞానయోగమను
సప్తమాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## అక్షర పరబ్రహ్మయోగము

### అష్టమాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో|| కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ|
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

కం. ఎయ్యది బ్రహ్మం బనఁబడు?
నెయ్యది యధ్యాత్మమగు? నిఁకెయ్యది కర్మం?
బెయ్యది యధి భూతంబగు?
నెయ్యది యధి దైవ మగును? గృష్ణ మహాత్మా! 1

శ్లో|| అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽ స్మి న్మధుసూదన|
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః||

ఆ.వె. ఇట్టి దేహ మందు నెవఁడధి యజ్ఞుఁడౌ?
నీ శరీర మందు నెట్టులుండు?
నంత్య కాలమున నియమిత చిత్తుల చేత
నెట్టు లెఱుఁగఁ బడుదు వీవు? దేవ! 2

శ్రీ భగవా నువాచ

శ్లో|| అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే|
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. బ్రహ్మ మనఁగను బరమాక్షరముగ నెఱుఁగు
మా స్వభావంబె యధ్యాత్మ మనఁగఁ బడును
బార్థ! సర్వ భూతముల కుద్భవ కరంబు
నగు విసర్గంబె జగతిఁ గర్మాఖ్య దనరు. 3

శ్లో|| అధిభూతం క్షరో భావః పురుషశ్చాధి దైవతమ్|
అధియజ్ఞోऽహమేవాత్ర దేహే దేహభృతాం వర||

కం. అధి భూతమె క్షరభావం
బధి దైవత మగును బురుషుఁ డరయఁగ నేనే
యధి యజ్ఞుండ నగుదును వి
విధ దేహము లందు, దేహభృద్వర! విజయా! 4

శ్లో|| అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్|
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః||

గీ. ఎవ్వ డంత్య కాలమున నన్నే స్మరించు
చును గళేబరమును విడచునో, యతండు
పొందుమద్భావమును బాండుభూపతనయ!
ఇందు సంశయ మొక్కింత యేని లేదు. 5

శ్లో|| యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్|
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః||

గీ. అర్జునా! యంత్యకాలంబు నందు నెట్టి
భావమును స్మరింపుచుఁ గళేబరము విడుచు
వాఁడు సర్వదా తద్భావ భావితుండు
నగుట నా భావ రూపంబె యందు చుండు. 6

శ్లో|| తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ|
మయ్యర్పిత మనోబుద్ధిర్మామేవైష్యస్య సంశయః||

గీ. కాన శ్వేతవాహన! సర్వకాలములను
స్మరణఁ జేయుమి నన్ను, సంగరముఁ జేయు
మయ్య! మనసును బుద్ధి నా యందు నీవు
నిలిపితేని నన్నే పొందఁగలవు నిజము. 7

శ్లో|| అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా |
పరమం పురుషం దివ్యం యాతి పార్థాఽనుచిన్తయన్ ||

గీ. ఎవ్వఁడభ్యాసయోగ సహిత మనన్య
గామి యైన చిత్తంబునుఁ గలిగి పార్థ!
దివ్యునిఁ బరమ పురుషుఁ జింతించు చుండు
వాఁడు పొందఁగ నేర్చు నా పరమ పురుషు. 8

శ్లో|| కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంసమనుస్మరేద్యః |
సర్వస్య ధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ||

గీ. సర్వదర్శిఁ బురాణుని సకల లోక
శాసనుని సూక్ష్మమునకు సూక్ష్మమగు వాని
సృష్టి కారణ భూతు, నచింత్యుఁ, బ్రకృతి
పరుని, నాదిత్య వర్ణు నెవ్వఁడు భజించు. 9

శ్లో|| ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ |
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యమ్ ||

ఆ.వె. అంత్య కాల మందు నచల మతిని, భక్తి
తోడ యోగ బలము తోడఁ గూడి
బొమల మధ్యఁ బ్రాణమును లెస్స నిలుపు నా
నరుఁడు దివ్యుఁ బరమ పురుషుఁ బొందు. 10

శ్లో|| యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః |
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ||

గీ. ఏది యక్షరంబని యంద్రు వేద విదులు,
పడయుదురు దేని రాగముఁ బాసి యతులు,
బ్రహ్మచర్య మొనర్తు రే పదముఁ గోరి,
యా పదము నీకుఁ జెపుదు సంక్షేపముగను. 11

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥

గీ. ద్వారముల నెల్ల నియమించి, పాండురాజ
తనయ! హృదయంబు నందున మనసు నిలిపి,
ప్రాణవాయువు నిజమూర్ధ మందుఁ జేర్చి,
యంత యోగధారణము సమాశ్రయించి. 12

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥

గీ. అర్జునా! "ఓ" మ్మని యెడి యే కాక్షరమగు
బ్రహ్మ ముచ్చరించుచు నిజ స్వాంత మందు
నను స్మరించుచు నెవ్వాఁడు తనువు విడచు
నాతఁడొందు నత్యుత్తమమైన గతిని. 13

శ్లో॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః॥

గీ. ఇతర విషయంబు లందు బోనీక చిత్త
మెవఁడు సతము నిత్యంబు స్మరించు నన్న
హామతీ! నిత్య యుక్తుఁడు నైన యోగి
కమిత సులభంబుగా నంద నగుదు నేను. 14

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః॥

ఆ.వె. అర్జునా! మహాత్ములైన వారలు నన్ను
బొంది పరమసిద్ధిఁ బొందు వార
లగుట దుఃఖ నిలయ మగుచు నశాశ్వతం
బైన పుటుక మఱల నంద రెందు. 15

శ్లో|| ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోऽర్జున|
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే||

ఆ.వె. అబ్జగర్భ లోక మాదిగా సర్వలో
కములు మఱల జన్మఁ గలుగఁ జేయుఁ
బొందె నేని నన్నుఁ బురుహూతనందనా!
మఱల జన్మ లేదు మానవునకు. 16

శ్లో|| సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణో విదుః|
రాత్రిం యుగసహస్రాన్తాం తేऽహోరాత్రవిదో జనాః||

గీ. అమలమతి! సహస్ర యుగము లవధిఁ గలుగు
నట్టి బ్రహ్మ పగటిని సహస్ర యుగము
లంతముగఁ గల్గు రాత్రిని నరయఁ జాలు
నరులు చూవె యహోరాత్ర మెఱుఁగు వారు. 17

శ్లో|| అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే|
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే||

గీ. పగటి యారంభ మందు నవ్యక్త రూపుఁ
డైన బ్రహ్మంబు నుండి చరాచరాది
వ్యక్తములు పుట్టుచుండు రాత్ర్యాగమమునఁ
బ్రళయమును బొందు నవ్వి యవ్యక్త మంద. 18

శ్లో|| భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే|
రాత్ర్యాగమేऽవశః పార్థ! ప్రభవత్యహరాగమే||

గీ. భూత సముదాయ మివ్విధిఁ బుట్టి పుట్టి
ప్రాగ్భవత్కర్మ వశమున రాత్రి యగుడు
నంత లీనంబు నొందు నవ్యక్త మందుఁ
బగటి యారంభ మందు నుద్భవముఁ జెందు. 19

శ్లో॥ పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥

గీ. అట్టి యవ్యక్తమున కంటె నన్య మగుచుఁ
బరమునై, నిత్యమై, యగోచరము నైన
భావ మేది గలదో యది ప్రాణి కోటి
నాశ మగుచుండినను నాశనంబుఁ గనదు. 20

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్।
యంప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥

గీ. అనఘ! యవ్యక్త మక్షరంబనుచు నెద్ది
చెప్పఁబడు చుండు దానినిఁ జెప్పు చుంద్రు
పరమ గతి యని, యెది పొంది మఱల జన్మ
వడయ రదియె నా స్థానమౌ పరమ పదము. 21

శ్లో॥ పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాన్తః స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥

ఆ.వె. ఎవని లోన నుండు నీ భూత సంఘము
లెవని చేత వ్యాప్త మిద్ది యెల్ల
యగునొ, యట్టి పరుఁడునౌ పురుషోత్తముఁ
బడయు నగు ననన్య భక్తిఁ జేసి. 22

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥

ఆ.వె. ఎపుడు మరణ మొంది యేగిన యోగులు
తిరిగి రారొ, యెట్టి తరుణ మందు
మరణ మొందు వారు మఱల జన్మింతురో
యట్టి కాల మర్జునా! వచింతు. 23

శ్లో|| అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్|
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః||

గీ. ఫల్గునా! యగ్ని, జ్యోతిని, బగట, శుక్ల
పక్షమున, నాఱు మాసముల్ పరిమితిఁ గల
యుత్తరాయణమున, బ్రహ్మవేత్త లగుచు
నరుగు జనములు బ్రహ్మంబు నందు చుంద్రు. 24

శ్లో|| ధూమో రాత్రిస్తథా కృష్ణష్షణ్మాసా దక్షిణాయనమ్|
తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ||

గీ. పార్థ! ధూమంబు నను, రాత్రి, బహుళ మందు,
నాఱు మాసముల్ గల దక్షిణాయనమునఁ
జంద్ర సంబంధమైన తేజంబు నొంది
మఱల జన్మించు చుండు నిమ్మహిని యోగి. 25

శ్లో|| శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తి మన్యయాzzవర్తతే పునః||

గీ. జగతి వరలు, శాశ్వతములు, సమ్మతమగు
రెండు మార్గముల్ శుక్లము కృష్ణ మనఁగ;
ఏగసితమున నరుఁ డనావృత్తిఁ బొందు,
కృష్ణమున నేగ నొందు నావృత్తి విజయ! 26

శ్లో|| నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన|
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున||

ఆ.వె. ఇట్టి రెండు పథము లెఱిఁగిన యోగి వ
ర్యుం డెవఁడును మోహ మొందఁబోఁడు;
కాన నీవు నెల్ల కాలము యోగయు
క్తుండ వై మెలంగు పాండుతనయ! 27

శ్లో|| వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ |
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్. ||

గీ. పార్థ! శ్రుతులఁ గ్రతువులఁ దపములఁ, దాన
ములను, బుణ్య ఫలంబుగాఁ బలుకఁ బడిన
దీని నెఱిఁగి, యాసర్వ మతిక్రమించి,
యాద్యమును శ్రేష్ఠమగు స్థాన మందు యోగి. 28

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అక్షర పరబ్రహ్మ యోగో నామ
అష్టమోऽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్తకవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
అక్షర పరబ్రహ్మయోగమను
అష్టమోధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## రాజవిద్యారాజగుహ్యాయోగము

### నవమాధ్యాయము

శ్రీ భగవా నువాచ

శ్లో|| ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే |
జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్షసేzశుభాత్ ||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. పార్థ! దేని నెఱుఁగ నశుభంబు నుండి
వదలఁ బడియెదవో యట్టి పరమ గోప్య
మనుభవజ్ఞాన సహితమై యమరు జ్ఞాన
మే నెఱుఁగఁ బల్కెద నసూయ లేని నీకు. 1

శ్లో|| రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ |
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ||

గీ. ఇట్టి జ్ఞానము విద్యల కెల్ల రాజు,
రాజగుహ్య, ముత్తమ పవిత్ర, మవినాశ
నంబుఁ, బ్రత్యక్ష సుఖ బోధకం బొనర్ప
నమిత సౌఖ్య కరంబు, ధర్మ్యంబు నగును. 2

శ్లో|| అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప |
అప్రాప్యమాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ||

కం. మనుజవరా! యీ ధర్మం
బు నొకింతయు శ్రద్ధ తోడఁ బూనక పురుషుల్
నను బొందక తిరుగుదురో
జను మృత్యు సమేతమైన సంసారమున. 3

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ||
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ||

గీ. వ్యాప్త మయ్యెను జగము సర్వంబు దేవ
తాధినాథతనూజ! యవ్యక్త మూర్తి
నైన నా చేత, నుండు నా యందు సర్వ
భూతములు, లేను నే నట్టి భూతములను. 4

శ్లో॥ న చ మత్ స్థాని భూతాని పశ్య మేయో గమైశ్వరమ్ |
భూతభృన్న చభూతస్థో మమాత్మా భూతభావనః ||

గీ. అర్జునా! భూత వితతి నా యందు లేదు,
కనుమి నా యైశ్వరమగు యోగంబు నెల్ల
ప్రాణుల భరించునది, భూత భావనంబు
నైన, నా యాత్మ భూతములందు లేదు. 5

శ్లో॥ యథాzzకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ |
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ ||

ఆ.వె. అన్ని యెడల వ్యాప్త మగుచు మహా వాయు
వాకసమున నెట్టు లమరియుండు
నావిధమున సకల ప్రాణులు నా యందు
నుండె ననుచుఁ గనుమి, పాండవేయ! 6

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్, |
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ||

గీ. సకల భూతముల్ కల్పావసాన కాల
మందు నాదగు ప్రకృతినిఁ బొందు చుండు;
నట్టి ప్రాణుల మఱలఁ గల్పాది యందు
నింద్రనందన! నే సృజియించు చుండు. 7

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్॥

ఆ.వె. భరతవర్య! ప్రకృతి వశమునఁజేసి యీ
యస్వతంత్రమైన ప్రాణికోటి
నా యధీనమైన మాయను జేపట్టి
యే, మఱల మఱల సృజించు చుందు. 8

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు॥

గీ. అతుల సృష్ట్యాది కర్మము లందు సక్తి
లేని వాఁడ నగుచు, నుదాసీను పగిదిఁ
బ్రబలు చుండెడు నన్నుఁ గర్మంబు లెవియు
సవ్యసాచి! బంధింపఁగాఁ జాల వెందు. 9

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిస్సూయతే స చరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ జగద్విపరివర్తతే॥

గీ. ప్రకృతి యధ్యక్షుఁడైన నా వలనఁ బార్థ!
యీ చరాచర వర్గము నెల్లఁ దాను
గనుచున్నది యీ హేతువున సమస్త
జగము వర్తిలు చుండు నీ సరణి నెపుడు. 10

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥

గీ. అఖిల భూత నియామకమైన నాదు
పరమ భావంబు నెఱుఁగని వార లగుచు
నర శరీరముఁ బొందిన నన్ను మూర్ఖ
జనము లవమానమును జేతు రనఘచరిత! 11

శ్లో|| మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః|
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః||

గీ. ఆసురంబును రాక్షసంబైన మోహ
హేతువగు ప్రకృతిని నాశ్రయించి, వ్యర్థ
మగుడు జ్ఞానంబు, వ్యర్థాశు లగుచు, వ్యర్థ
కర్ములై పల్లటిలుదురు కలుష మతులు. 12

శ్లో|| మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః|
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్||

గీ. అర్జునా! మహాత్ములు దైవియౌ ప్రకృతిని
నాశ్రయించిన వారలై వ్యయ విహీను,
నఖిల భూతాద్యుఁడైన నన్నరసి మదినిఁ
నితర చింతను వదలి భజించుచుండ్రు. 13

శ్లో|| సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః|
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే||

గీ. ఫల్గునా! దృఢవ్రతులగు వారు సతము
నన్నుఁ గీర్తింత్రు; యత్నము నాదు కొఱకె;
చేతు, లర్పించుదురు నమస్కృతులు నిత్య
యుక్తులై యుపాసింతురు భక్తి తోడ. 14

శ్లో|| జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే|
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్||

గీ. జ్ఞాన యజ్ఞంబుచే నర్చనంబుఁ గొంద
ఱొనరుతురు, కొంద ఱేకత్వమునను, గొంద
ఱర్జునా! పృథగ్భావంబు నందుఁ, గొంద
ఱాత్మను భజింత్రు నన్ను సర్వాత్మకునిగ. 15

శ్లో|| అహం క్రతురహం యజ్ఞస్స్వధాహమహమౌషధమ్ |
మన్త్రోఽహమహమేవా జ్యమహమగ్నిరహం హుతమ్ ||

ఆ.వె. నేన క్రతువు నగుదు నేన యజ్ఞంబు నౌ
దేవ యౌషధంబు నేన స్వధను
నేన మంత్ర మగుదు నేన యాజ్యంబు సు
మ్మేన హుతము నగుదు, నింద్రతనయ! 16

శ్లో|| పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః |
వేద్యం పవిత్రమోఙ్కార ఋక్సామయజురేవ చ ||

గీ. నేన తండ్రి నీ జగతికి నేన తల్లి
నేఁ బితామహుఁడను ధాత నేన యగుదు
నేన యోంకారము, పవిత్ర మేన, వేద్య
మేన, ఋగ్యజుస్సామముల్ నేన విజయ! 17

శ్లో|| గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్|
ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్ ||

గీ. వాసవీ! గతియును భర్త ప్రభువు సాక్షి
స్నేహిత వరుండుఁ, బ్రభవంబు, స్థితియు, లయము,
శరణమును, నిదానము, నివాసంబు మఱియు
నవ్యయంబును బీజంబు నగుదు నేన. 18

శ్లో|| తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ|
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున||

గీ. నేన తపియింతుఁ గురిపింతు నేన వర్ష
మేన నిలువుదు సృష్టిని నేన యగుదుఁ
బార్థ! సద్వస్తువును నసద్వస్తు వమృత
మేన యగుదును, మృత్యువు నేన సుమ్ము. 19

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతాపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్॥

గీ. వేద విదులు నాకముఁ గోరి విజయ! యధ్వ
రముల ననుఁగొల్చి సోమ పానమునఁ బూత
పాపులై పుణ్య లభ్యమౌ స్వర్గ మొంది
యందు దివ్య భోగంబుల ననుభవింత్రు. 20

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మమను ప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥

గీ. అధిక దేవ భోగముల వారనుభవించి
పుణ్యము నశింప నర లోకమున జనించి
యిటు త్రయీ ధర్మల నాచరించు చుంద్రు
కామ కాములు రాఁక పోఁక లను గాంత్రు. 21

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

గీ. ఇతర మేదియుఁ దలపక యెవరు నన్ను
జింత సేయుచు మది నుపాసింపు చుందు
రట్టి నిత్యాభి యుక్తులు నైన వారి
కెపుడు విహిత యోగ క్షేమ మేన యిడుదు. 22

శ్లో॥ యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్॥

గీ. ఇతర దేవత లందున నెవరు భక్తి
రతులునై యజియింతురు శ్రద్ధ తోడ,
వారలును నన్నె యవిధి పూర్వకముగా భ
జించు చుందురు పాండుమహీంద్రతనయ! 23

శ్లో|| అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ|
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే||

ఆ.వె. అఖిల యజ్ఞములకు నధిపతి భోక్తయు
నేన యగుదు సుమ్మి యెఱుఁగు నేర
కున్న వార లగుట నన్నుఁ దత్త్వంబున
భ్రష్టు లగుదురయ్య! పాండవేయ! 24

శ్లో|| యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః|
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తిమద్యాజినోऽపి మామ్||

గీ. దేవవ్రతులు పొందుచు నుంద్రు దేవతలను
బితరుల యజింపఁ గలుతురు పితరులందు,
భూతములయజింపఁగఁ గాంత్రు భూతములను,
జేరుదురు నన్ను నా సేవఁ జేయు వారు. 25

శ్లో|| పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి|
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః||

గీ. ఎవఁడు భక్తితోఁ బత్రము నేనిఁ బుష్ప
మేని, ఫలమేని, జలమేని యిడునొ నాకుఁ
బార్థ! నిష్కామ భక్తుఁడౌ వాఁడొసంగు
నట్టి బత్తి కానుకఁ బ్రీతి నారగింతు. 26

శ్లో|| యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్|
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్||

గీ. దేనిఁజేసెదవో నీవు దేనిఁ దినెదొ
దేని వేల్తువో దానంబు దేని సేతొ
యెట్టి దానినిఁ దప మొనరింతొ, వాని
నంతయుఁ గిరీటి! యిడుమి మదర్పణముగ. 27

శ్లో|| శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః|
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. ||

ఆ.వె సవ్యసాచి! యిట్లు సన్న్యాస యోగ యు
క్తాత్మ వగుచు, నీ సుభాశుభంపు
ఫలము లొసఁగు కర్మ బంధ విముక్తినిఁ
గాంచి, పిదపఁ బొందఁగలవు నన్ను. 28

శ్లో|| సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః|
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ||

గీ. సర్వ భూతము లందు నే సముఁడ, లేఁడు
ప్రియుఁడు గానియు నాకు నప్రియుఁడు గాని;
ఎవరు భక్తితో నను భజియింతు చుంద్రు
వారు నా యందు నే నుందు వారి యందు. 29

శ్లో|| అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్|
సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః||

ఆ.వె. అమరవందితా! దురాచారుఁడే నన్య
చింత విడిచి, నను భజించు నేని,
నా నరుండు సాధువని యెఱుఁగుము, దృఢ
భావ యుక్తుఁడగుచు వఱలు కతన. 30

శ్లో|| క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి|
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి||

ఆ.వె. వాఁడు శీఘ్రము గను బరమ ధర్మాత్ముఁడై
వడయు నిత్య శాంత పదవి, నెందు
నాదు భక్తుఁడైన నరుఁడు కౌంతేయ! న
శింపఁడని ప్రతిజ్ఞఁ జేసి చెప్పుమ! 31

శ్లో|| మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః|
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్||

గీ. పాపయోని సంభూతులౌ వారు స్త్రీలు
వైశ్యులును శూద్రులును నన్ను భక్తి తోడ
నాశ్రయించి యత్యుత్తమమ్మైన పదవి
వడయు చున్నారు, పాండుభూవరతనూజ! 32

శ్లో॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్॥

గీ. పుణ్య వంతులు భక్తులౌ భూసురోత్త
ములను రాజర్షులను జెప్ప వలెనె వేఱ
కాన నసుఖ మనిత్య లోకంబుఁ బొంది
యున్న నీవు భజింపుమి నన్ను సతము. 33

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మనం మత్పరాయణః॥

గీ. స్వాంత ముంచుమి నా యందు, భక్తిఁ గనుమి,
నను యజింపుమి, నాకు వందనము లిడుమి;
ఇట్లు మత్పరాయణుఁడవై యెపుడు మనసు
నిలిపి నా యందు, ననుఁ బొంద గలవు పార్థ! 34

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
రాజవిద్యారాజగుహ్యాయోగోనామ
నవమోऽధ్యాయః

ఇది శ్రీరాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
రాజవిద్యారాజగుహ్యాయోగమను
నవమాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## విభూతియోగము

## దశమాధ్యాయము

శ్రీ భగవా నువాచ

శ్లో|| భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః|
యత్తేऽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

ఆ.వె. విజయ! యిప్పుడేను బ్రియముగ విను నీకు
హితముఁ గలుగఁ జేయ నిచ్చగించి
మఱలఁ జెప్పఁ బోవు పరమ వాక్యంబు స
మాదరింపు నిర్మలాత్మ వగుచు. 1

శ్లో|| న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః|
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః||

గీ. నాదు ప్రభవంబు నెఱుఁగరు నాఁక వాసు
లైన గాని మహర్షులు గాని, పార్థ!
ఆ మహర్షులకును నమృతాశనులకు
నాద్యుఁడను నేన యగుదు సమస్త గతుల. 2

శ్లో|| యోమామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్|
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే||

ఆ.వె. అజు ననాది నంచు నఖిల లోకేశ్వరుం
డనుచు నన్నెఱుంగు నట్టి వాఁడు
నరుల యందు మిగుల జ్ఞాన సంపూర్ణుఁడై
యఖిల పాపముక్తి నందు చుండు. 3

శ్లో|| బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః|
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ||

ఆ.వె. బుద్ధి జ్ఞానము మఱి మోహ రాహిత్యము
సత్యమును, క్షమంబు, శమము, దమము,
వ్యసనమును, సుఖంబు, భవము నభావంబు
భయము నొందుటయు, నభయముఁ గనుట. 4

శ్లో|| అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః|
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః||

ఆ.వె. జంతుహింసలేమి, సమతయు, సంతోష
మును దపంబు దానమును యశంబు
నపయశంబనంగ, నఖిల భావములు నా
వలనఁ గలుగు నెల్ల ప్రాణులకును. 5

శ్లో|| మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా|
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః||

ఆ.వె. సవ్యసాచి! మున్ను సప్తమహర్షులు
నలువురు మనువులును, నాదు భావ
సహితు లగుచు నాదు సంకల్ప సంభవు
లై, సృజించిరీ ప్రజాళి నెల్ల. 6

శ్లో|| ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః|
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః||

గీ. ఇట్టి నా విభూతిని యోగ మెవఁడు పాండు
తనయ! యెఱుఁగఁ నేర్చునొ యథార్థంబుఁ గాగ
వాఁడు నిశ్చలాత్మకమైన భక్తి యోగ
సహితుఁడై యొప్పు నిద్ధి నిస్సంశయంబు. 7

శ్లో|| అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే |
ఇతిమత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ||

గీ. ప్రభవమే నౌదు సర్వ ప్రపంచమునకు
నెల్ల జగము నాచేఁ బ్రవర్తిల్లు చుండు
ననుచు నిటులెంచి బుధులు నా యందు మిగులఁ
బ్రీతి భావంబు గలిగి సేవించు చుండ్రు. 8

శ్లో|| మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ |
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ||

గీ. ప్రాణ చిత్తముల్ నాకు నర్పణము సేసి
యొకరి కొకరు బోధించుచు సకల కాల
ములను నన్నుఁ గీర్తింపుచు ముదముఁ జెందు
చున్న వారలై క్రీడింపు చుందు రనఘ. 9

శ్లో|| తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ |
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే ||

ఆ.వె. అనిశ మివ్విధమున నాసక్తి నాయందుఁ
గలిగి ప్రీతి పూర్వకముగ సేవఁ
జేయు భక్తవరుల కీయుదు విజయ! న
న్నొందఁగలుగు బుద్ధియోగ మేను. 10

శ్లో|| తేషా మేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః |
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ||

గీ. ఇట్టి నా భక్తుల ననుగ్రహింపఁ గోరి
యే కిరీటి! వారల బుద్ధి వృత్తి నిలిచి
ప్రజ్వరిల్లెడు జ్ఞాన దీపంబు వలన
వారి యజ్ఞానజనితాంధకార మణఁతు.

అర్జున ఉవాచ

శ్లో|| పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్|
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ||

అర్జునుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. పరమ ధాముఁడవును బరబ్రహ్మ వీవ,
పరమ పావన మీవౌదు, మఱియు నిన్ను
నాది దేవునిఁగా, దివ్యు, నవ్యయునిగ,
నజునిఁగాను, బురుషునిఁగా, నధిపతిగను. 12

శ్లో|| ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షి ర్నారద స్తథా|
అసితో దేవలో వ్యాసస్స్వయం చైవ బ్రవీషి మే ||

కం. దేవర్షి నారదుండున్
దేవలుఁ డసితుండు వ్యాస నిఖిల మునుల్ ని
న్నీవిధి వర్ణింతురు, నా
కీవును వచియించు చుంటి విట్టిధిఁ గృష్ణా! 13

శ్లో|| సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ|
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవా ||

ఆ.వె. నీవు చెప్పినంత నిశ్చయంబంచు నా
భావమందుఁ దలఁతు బద్మనాభ!
కృష్ణ! యెఱుఁగఁజాలరిట్టి నీ మహిమను
దేవులేనిఁ బూర్వదేవులేని. 14

శ్లో|| స్వయమేవాzzత్మనాzzత్మానం వేత్థ త్వం పురుషోత్తమ|
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ||

గీ. భూతభావన! భూతేశ! పురుషవర్య!
దేవదేవ! జగన్నాథ! నీవు నిన్ను
స్వయముగా నీదు జ్ఞానంబు వలన నెఱుఁగఁ
జాలుదువు గాని నిన్ననఁజాల రెవరు. 15

శ్లో॥ వక్తు మర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః।
యాభిర్విభూతిభిర్లోకానిమాం స్త్వం వ్యాప్యతిష్ఠసి॥

గీ. నీ విభూతులు దివ్యముల్ నీరజాక్ష!
ఏ విభూతుల చేత నీవీజగంబు
నందు వ్యాపించి యుంటివో యట్టివానిఁ
జెప్పఁగా నీవ తగుదు నిశ్శేషముగను. 16

శ్లో॥ కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా॥

ఆ.వె. హృదయమందు నెట్టు లెల్ల కాలంబును
దలఁచు చుండి కృష్ణ! దెలిసి కొందు,
నీ జగంబు లోన నేయే పదార్థము
లందు నిన్నుఁ గొల్వ నగును నాకు. 17

శ్లో॥ విస్తరేణాఽత్మనో యోగం విభూతిం చ జనార్దన।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥

ఆ.వె. నీరజాక్ష! మఱల నీదు యోగంబు, వి
భూతి నెల్ల విపులముగ వచింపు;
మమృత తుల్యమైన యట్టి నీ వాక్యముల్
వినుచునున్న నాకుఁ దనివి లేదు. 18

శ్రీ భగవా నువాచ

శ్లో॥ హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. అర్జునా! నాదు దివ్యంబులౌ విభూతు
లందు నెఱిఁగింతుఁ బ్రాధాన్యమైన వాని,
నా విభూతుల కరయ నంతంబదెందు
లేదు గాన, విస్తరముగ రాదు చెప్ప. 19

శ్లో|| అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః|
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ||

ఆ.వె. ఎల్ల భూతములకు హృదయ స్థితంబైన
యాత్మ నేన యగుదు ననుచుఁ గనుమి;
ప్రాణి కోటి కెల్ల నాది మధ్యాంతము
లేన యని యెఱుంగు మింద్రతనయ! 20

శ్లో|| ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్|
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ||

గీ. విజయ! ద్వాదశాదిత్యుల విష్ణు వేన,
జ్యోతులం దంశుమంతుఁడౌ సూర్యుఁ డేన,
వాయువుల యందున మరీచి వాయు వేన,
చంద్రుఁడను నేన సకల నక్షత్రములను. 21

శ్లో|| వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః||
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా||

ఆ.వె. వేదములను సామవేదంబు నేన, దే
వతల యందు నేన వాసవుఁడను;
ఏన యగుదు మనసు నింద్రియంబుల లోన,
బుద్ధి నేన సకల భూతములను. 22

శ్లో|| రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్|
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్||

ఆ.వె. రుద్రులందు శంకరుండను నే నౌదు,
యక్షరాక్షసాళి యందు విత్త
పతిని నేన, యేన వసువులలో నగ్ని
క్షితి ధరముల మేరు శిఖరి నేన. 23

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్।
సేనానీనామహం స్కన్దస్సరసామస్మి సాగరః॥

గీ. అర్జునా! నన్ బురోహితులందు ముఖ్యు
డౌ బృహస్పతి నంచు లోనరయు మీవు,
స్కదుఁడను నేన యగుదును సైన్య పతుల,
సాగరుండను నే జలాశయములందు. 24

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః॥

గీ. అగుదు నేన భృగుండ మహర్షులందు,
వాక్కులందేకపదమగు ప్రణవ మేన,
యజ్ఞముల నన్నిటను జపయజ్ఞ మేన,
స్థావరంబులలో శీతశైల మేన. 25

శ్లో॥ అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః॥

గీ. వృక్షముల యందు నశ్వత్థవృక్ష మేన,
పార్థ! నే నారదుఁడను దేవర్షులందుఁ,
జిత్రరథుఁడ గంధర్వుల, సిద్ధబృంద
మందు గపిల మునీంద్రుఁడ నగుదు నేన. 26

శ్లో॥ ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥

గీ. వాజులందెల్ల నమృతోద్భవంబనంగ
వలరు నుచ్చైశ్శ్రవంబు నేనని యెఱుంగు;
ఏన యైరావతంబు గజేంద్రములను,
మానవాధీశ్వరుఁడ నేన మానవులను. 27

శ్లో|| ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్|
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణామస్మి వాసుకిః||

ఆ.వె. పార్థ! యాయుధముల వజ్రాయుధం బేన,
ధేనువులను గామధేను వేన,
జనన కారణుఁడగు స్మరుఁడను నేన, స
ర్పముల వాసుకి యను వాఁడ నేన. 28

శ్లో|| అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్|
పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్||

ఆ.వె. నాగులందు నే ననంతుండ నగుదును,
వారి దేవతలను వరుణుఁ డేన,
అనఘ! పితరులందు నర్యముఁడను నేన,
యముఁడ నగుదు నే నియామకులను. 29

శ్లో|| ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్|
మృగాణాం చ మృగేన్ద్రోzహం వైనతేయశ్చ పక్షిణామ్||

ఆ.వె. పార్థ! దైత్యులందుఁ బ్రహ్లాదుఁడను నేన,
గణికులందు నేన కాల మగుదు,
మృగ సమూహములను మృగపతి నే నౌదు,
ఖగచయంబునందు గరుఁడుఁ డేన. 30

శ్లో|| పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్|
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ||

ఆ.వె. పావనంబులందు వాయువు నే నౌదు,
శస్త్రధరుల రామచంద్రుఁ డేన,
మత్స్యములను నేన మకరంబు, జాహ్నవీ
నదిని నేన సకల నదుల యందు. 31

శ్లో॥ సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్॥

గీ. ఫల్గునా! సృష్టిలో నుండు వాని కెల్ల
నాది మధ్యాంతములు నేన యగుదు సుమ్మి;
విద్యలందున నధ్యాత్మ విద్య నేన,
వాదమును జేయు వారల వాద మేన 32

శ్లో॥ అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వస్సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః॥

గీ. అక్షరముల 'అ' కార మేనగుదుఁ, బలు స
మాసముల యందు ద్వంద్వ సమాస మేన;
అక్షయంబైన కాలము నగుదు నేన,
విశ్వతోముఖుఁ డనఁబడు విధిని నేన. 33

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥

గీ. ఎల్ల ప్రాణుల హరియించు మృత్యు వేన,
పుట్టఁగలవారి కెల్లను బుట్టుక నేన
స్త్రీల యందున సిరియుఁ గీర్తియును, వాక్కు,
స్మృతియు, బుద్ధియు, క్షమయును, ధృతియు నేన. 34

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః॥

గీ. సామముల నన్నిటను బృహత్సామ మేన
యఖిల ఛందస్సు లందు గాయత్రి నేన,
మార్గశీర్షంబు నే నెల్ల మాసములను,
ఋతువు లన్నింటను వసంత ఋతువు నేన. 35

శ్లో॥ ద్యూతం ఛలయతామస్మి తేజ స్తేజస్వినామహమ్ |
జయోऽస్మి వ్యవసాయోऽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ||

గీ. శుద్ధచరిత! వంచకు లందు జూద మేన
యగుదు, నెల్ల తేజోవంతు లందుఁ దేజ
మేన, జయమును, వ్యవసాయ మేన యగుదు,
సాత్వికుల యందుఁగల యట్టి సత్త్వ మేన. 36

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోऽస్మి పాండవానాం ధనంజయః |
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ||

గీ. వాసుదేవుండ యాదవ వంశ్యు లందుఁ
బాండవుల యందు నే నౌదు ఫల్గునుఁడను,
మునుల యందు వేదవ్యాసమునియు నేన,
కవుల లోన శుక్రాచార్య కవిని నేన. 37

శ్లో॥ దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ |
మౌనం చై వాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ||

గీ. అనఘ! దండించు వారి దండనము నేన,
నే జిగీషుల యందలి నీతి నగుదు,
మౌన మేన గోప్యంబులౌ వాని యందు,
జ్ఞానవంతుల యందలి జ్ఞాన మేన. 38

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున |
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ||

ఆ.వె. సవ్యసాచి! యేది సకల భూతములకు
నగునొ బీజ మదియు నౌదు నేన;
ఏది నన్ను విడచి యెసఁగునో యది చరా
చరమునైన భూత సమితి లేదు. 39

శ్లో|| నాన్తోऽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప|
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా||

ఆ.వె. అంత మెందుఁగలుగ దర్జునా! నాదు ది
వ్యంబులౌ విభూతు లందు, నైన
విజయ! నా విభూతి విస్తారమంత సం
క్షేపముగను నీకుఁ జెప్పినాఁడ. 40

శ్లో|| యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా|
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోऽంశసమ్భవమ్||

ఆ.వె. శోభితంబు నగుచు, సువిభూతి గల యది
బలముఁ గలిగి యున్న వస్తు సమితి
నర! యెఱుంగుమయ్య నాదు తేజోంశ సం
భవము లనుచు నీదు స్వాంత మందు. 41

శ్లో|| అథవా బహునై తేన కిం జ్ఞాతేన తవార్జున|
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్||

గీ. వినుమి, యటు గానిచో బహువిధము నైన
యిట్టి జ్ఞానంబు చేత నీకేమి సార్థ
కంబు? నే నీ సమస్త జగంబు నిలుపు
కొనుచు నుంటి నా యేకాంశముననె పార్థ! 42

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే విభూతి యోగానామ
దశమోऽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్తకవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
విభూతియోగమను
దశమాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## విశ్వరూపసందర్శన యోగము

### ఏకాదశాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో|| మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్ |
యత్త్వయోక్తం వచస్తేన మోహోzయం విగతో మమ ||

అర్జునుఁడడుగు చున్నాఁడు.

గీ. అంబుజోదర! మదనుగ్రహార్థ మీవు
పలికి యున్నట్టి మిగుల గోప్యంబుఁ బరమ
మగుచు నధ్యాత్మ సంజ్ఞితంబైన వాక్య
మునను నా మోహమెల్ల నాశనము నొందె. 1

శ్లో|| భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా |
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్ ||

గీ. దానవాంతక! సకల భూతముల కెల్ల
భవము వ్యయమును గలిగె నీ వలన ననుచు
వింటి; విస్తారముగ నేను విన్నవాఁడ
నవ్యయంబైన నీదు మాహాత్మ్య మెల్ల. 2

శ్లో|| ఏవమేతద్యథాzzత్థ త్వమాత్మానం పరమేశ్వర |
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ||

ఆ.వె. ఈవు నిన్ను గూర్చి యెట్లు వచించితో
యదియు నెల్ల నిశ్చయంబు కృష్ణ!
ఐశ్వరంబు నైన యట్టి నీ యాత్మ రూ
పంబుఁ జూడఁ గోరువాఁడ నేను. 3

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయాద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాఽఽత్మానమవ్యయమ్ ॥

ఆ.వె. ఈశ! యోగివంద్య! ఈతఁడియ్యది చూడఁ
గలఁడటంచు లోనఁ దలఁచితేని
యవ్యయంబునైన యాత్మ స్వరూపంబు
నిపుడు నాకుఁ జూపుమీ ముకుంద! 4

శ్రీ భగవా నువాచ

శ్లో॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥

శ్రీ కృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. విజయ! నూరుల కొలఁదియు వేల కొలఁది
పలు తెఱంగులు మఱి పలు వర్ణములును
బహు విధా కృతుల్ గలిగి దివ్యాత్మకంబు
లైన నా రూపములఁ జూఁడు మయ్య! నీవు. 5

శ్లో॥ పశ్యాఽదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుత స్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాఽశ్చర్యాణి భారత ॥

గీ. ద్వాదశాదిత్యులను నష్ట వసువులను మ
రుత్తులను నశ్వినుల మఱి రుద్రముఖులఁ
బూర్వమునఁ గాంచ నట్టి యద్భుతములౌ న
నేకములను నా యందుఁ గౌంతేయ! కనుమి. 6

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥

ఆ.వె. కల చరాచరాత్మకంబౌ సమస్త జ
గంబు మఱియు దేనిఁ గనఁగఁ బార్థ!
యభిలషించినావొ యది యెల్ల నా మేన
నొక్కచోట నుండఁ జక్కఁ గనుమి. 7

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥

గీ. ప్రాకృతంబైన యిట్టి నేత్రంబు తోడ
నాత్మ రూపంబు గాంచ శక్యంబు గాదు;
దివ్యదృష్టి నొసంగెద దీన నీవు
గనుమి నా యైశ్వరమగు యోగంబు నెల్ల. 8

సఞ్జయ ఉవాచ

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥

సంజయుఁడు చెప్పు చున్నాఁడు,

గీ. అపర యోగేశ్వరేశ్వరుండైన కృష్ణుఁ
డీ ప్రకారంబుగా వచియించి పిదపఁ
బరమ మైశ్యరమైన రూపంబుఁ జూపెఁ
బాండవోత్తమునకుఁ గురువంశతిలక! 9

శ్లో॥ అనేక వక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥

ఆ.వె. పెక్కు వక్త్రములును బెక్కు నేత్రంబులు
బహువిధాద్భుతములు, భవ్యభూష
ణములు గలిగి, యుద్యతముల నంతములు ది
వ్యంబులైన యాయుధంబు లమర. 10

శ్లో॥ దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతో ముఖమ్.॥

ఆ.వె. దివ్య మాల్యములను దివ్యాంబరముల ది
వ్యానులేపనముల నమరఁ దాల్చి,
బహు వినోద మయము, భవ్య మనంతంబు
విశ్వతోముఖమయి వెలయు దాని. 11

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః॥

ఆ.వె. ఆకసంబునను సహస్ర సూర్యుల కాంతి
యేక కాలమందు నెనఁగు నేని
యట్టి దివ్యకాంతి యా మహాత్ముని తేజ
మునకు సమమనంగఁ బోలు నధిప! 12

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా॥

గీ. దేవదేవుఁడౌ కృష్ణుని దేహమందుఁ
బలు విధంబుల విభజింపఁ బడినదౌ స
మస్త జగమొక్క భాగంబు నందు నున్న
దానిఁగాఁ జూడఁ గలిగె సుత్రామసుతుఁడు. 13

శ్లో॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత॥

ఆ.వె. అంత సవ్యసాచి, యచ్చెరు పాటున
నంగమందుఁ బులక లతిశయింప
శిరము వంచి మ్రొక్కి చేతులు జోడించి
వాసుదేవుఁ గాంచి ప్రస్తుతించె. 14

అర్జున ఉవాచ

శ్లో॥ పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥

అర్జునుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. దేవ! చూచుచున్నాఁడ నీ దేహ మందు
సకల దేవతలను భూత సంఘములను,
వారిజాసను డీశుఁడౌ బ్రహ్మ, దివ్య
సర్ప సంతానముల, మఱి సర్వ ఋషుల. 15

శ్లో॥ అనేక బాహూదర వక్త్ర నేత్రం పశ్యామి త్వాం సర్వతోऽనన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం న పునస్తవాऽదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥

గీ. విశ్వరూప! విశ్వేశ్వర! పెక్కు భుజము
లును గడుపులు ముఖంబులుఁ గనులుఁ గలయ
నంతరూపు నిన్గనుచుంటి నన్ని యెడల
నాదిమధ్యాంతములఁ గాంచ నైతి నీకు. 16

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥

గీ. గదలును గిరీటములును జక్రములు గలిగి
వెలుగు పుంజమై ప్రభవిల్లి విశ్వమెల్ల,
నప్రమేయుఁడవై ప్రదీప్తానలార్క
కాంతిఁ గలవానిఁగా నిన్నుఁ గాంచు చుంటి. 17

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే ॥

గీ. జ్ఞేయమౌ పరబ్రహ్మంబు నీవ కృష్ణ!
యీవ పరమాశ్రయంబగు, దీ జగతికి
వ్యయ రహితుఁడు శాశ్వత ధర్మపాలకుండు
నౌ పురాణ పురుషుఁడ వీవని తలంతు. 18

శ్లో॥ అనాదిమధ్యాన్తమనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥

గీ. ఆది మధ్యాంత రహితుఁ డనంత వీర్యుఁ
డవు, ననంత బాహుఁడవును, రవి మృగాంక
నేత్రుఁడవును, బ్రదీపితాగ్ని ముఖుఁడవు, స్వ
కాంతి తప్త భువనునిఁగాఁ గాంచు చుంటి. 19

శ్లో॥ ద్యావాపృథివ్యోరిదమన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

గీ. నింగి నేలల మధ్యను నిండి తీవ
యఖిల దిశలు నీ యొకనిచే వ్యాప్త మయ్యె
నో మహాత్మక! భవదద్భుతోగ్రరూపుఁ
గాంచి వణఁకుచు నుండె జగత్త్రయంబు. 20

శ్లో॥ అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥

గీ. సుర సమూహములిట నిన్ను జొచ్చు చుండె
నందుఁ గొందఱు భీతి బద్ధాంజలులయి
స్తుతి యొనర్ప, మహర్షులు సురలు స్వస్తిఁ
జెప్పి పుష్కల స్తుతుల భాషింపు చుండ్రి. 21

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥

గీ. సాధ్యు, లినులును, వసువు, లీశానులును, మ
రుతులు, విశ్వేశ్వినులు, నెల్ల పితరులు, మఱి
సర్వ గంధర్వ యక్ష రాక్షస సమూహ
మిట్టి నినుఁ గాంచి విస్మిత హృదయు లైరి. 22

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్॥

గీ. పెక్కు ముఖములు గన్నులు పెక్కు తొడలు
భుజము లుదరంబులును బాదములును జెడుగు
కోఱలును గల నీ మహాకార మరసి
భయము నొందు చున్నారమీ ప్రాణు లేను. 23

శ్లో|| నభస్స్పృశం దీప్త మనేకవర్ణం వ్యాత్తాననం దీప్త విశాలనేత్రమ్ |
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో ||

గీ. నింగి నంటుచు రంగు లనేకములను
గలిగి, రాజిల్లి, వివృత ముఖములుఁ బ్రజ్వ
లిత విశాల నేత్రములుఁ గలిగిన నిన్నుఁ
గాంచ, ధృతి శాంతు లుడిగెఁ జలించె నాత్మ. 24

శ్లో|| దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని |
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ||

గీ. భూరి భీకరమౌ దంష్ట్రములఁ జెలంగు
ప్రళయ కాలాగ్ని సన్నిభ వక్త్రములను
గాంచ, దిగ్భ్రమ గలిగె సుఖంబు సమసెఁ
గరుణఁ గనుమి దేవేశ! జగన్నివాస! 25

శ్లో|| అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావని పాలసఙ్ఘైః|
భీష్మోద్రోణస్సూతపుత్ర స్తథాzసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ||

గీ. ఇందు ధృతరాష్ట్రనందను లెల్లవారు
ద్రోణుఁడును శాంతనవుఁడుఁ, గర్ణుండు, సకల
భూపతులు వెంటరా యోధ ముఖ్యు లనఁగ
వన్నె వాసినిఁ గన్న మా వారిఁ గూడి. 26

శ్లో|| వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాలాని భయానకాని |
కేచిద్విలగ్నా దశనాన్త రేషు సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః ||

ఆ.వె. వేగ గతిని నీదు భీకర దంష్ట్రా క
రాళ ముఖములను జొరఁబడుచుండి,
రందుఁ గొందఱు దశనాంతరములఁ జూర్ణి
తోత్తమాంగు లగుచు నున్న వారు. 27

శ్లో|| యథా నదీనాం బహవోऽమ్బువేగా స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి|
తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి||

ఆ.వె. అమిత వేగమున మహాబ్ధ్యభిముఖములై
సకల నదులు జొచ్చు చందముననుఁ,
బ్రజ్వరిల్లు నీదు వక్త్రంబుఁ జొచ్చు చు
న్నారు మేటి యోధ వీరు లెల్ల. 28

శ్లో|| యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః|
తథైవ నాశాయ విశన్తి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః||

గీ. బాగుగా వెలింగెడి వహ్నిఁ ద్వరిత గతిని
మిడుతలు నశింపఁగాఁ గోరి పడిన యటులఁ
బ్రాణు లెల్లరు గుమి గూడి యధిక వేగ
మునను జొచ్చు చున్నారు నీ ముఖము లందు, 29

శ్లో|| లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః|
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో||

గీ. జ్వలిత ముఖములచే నీవు సకల జనుల
వీఁక మ్రింగుచుఁ బెదవుల నాకు చుంటి
వనఘ! నీ యుగ్ర కాంతి సమస్త జగతి
వ్యాప్తమై తపించుచు నుండె నధికముగను. 30

శ్లో|| అఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోऽస్తు తే దేవవర ప్రసీద|
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్||

గీ. మ్రొక్కు వాఁడను గృష్ణ! "నమోస్తు" యెవఁడ
వీవెఱుఁగ రాని యుగ్ర రూపేల తాల్చి
యుంటివి? కరుణఁ గనుమి, యాద్యుఁడగు నీ ప్ర
వృత్తిఁ దెలియఁ బ్రార్థింతుఁ గూరిమి వచింపు. 31

శ్రీభగవా నువాచ

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. ఈ సమస్త లోకంబుల నిట వధింప
వృద్ధిఁగను కాల రూపుఁడ, నిపుడు జనుల
నందఱను ద్రుంపఁగా సిద్ధమైన వాఁడ
నీవు చంపకున్న బ్రతుక నేర రెవరు. 32

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వ మేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

గీ. కాన లెమ్ము, యుద్ధ మొనర్పఁ గడఁగు, మరులఁ
జంపి, యఖిల రాజ్యంబు, యశంబుఁగనుమి;
చంపఁ బడిరి నాచే మున్న సకల జనము
లర్జున! నిమిత్త మాత్ర మీ వగుమి యిపుడు. 33

శ్లో॥ ద్రోణఞ్చ భీష్మఞ్చ జయద్రథఞ్చ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్॥

గీ. పార్థ! మున్న, నాచేఁ జంపఁ బడిన ద్రోణ
భీష్మ సైంధవ కర్ణాది వీర వరుల
ఖండనంబున గెలువుమీ భయముఁ దక్కి
మరుల గెలువంగఁ జాలుదీ వాహవమున. 34

సంజ్ఞయ ఉవాచ

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాఽహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య॥

సంజయుఁడు చెప్పు చున్నాఁడు

గీ. అనిన శ్రీకృష్ణు వచనంబు లాలకించి
భయమునఁ గరంబులను మోడ్చి వణఁకుచుఁ బలు
మాఱుఁ బ్రణతు లిడుచుఁ బాండు మహిప తనయుఁ
డెలుఁగు కంపింప హరి తోడ నిట్లు లనియె. 35

అర్జున ఉవాచ.

శ్లో|| స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ|
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః||

అర్జునుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. త్వత్ప్రకీర్తిచే జగము సంతసముఁ జెంది
కాంచె ననురాగ, మఖిల రాక్షసులు భీతిఁ
జేసి దిక్కులఁ బాఱిరి, సిద్ధ సమితి
నతులఁ గావించు చుండి రనంత రూప. 36

శ్లో|| కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే|
అనన్త దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్.||

గీ. ఘనుఁడవును, విరించికి నాది కారణుండ
వైన నీకేల చేమోడ్పు లాచరింప
రయ! మహాత్మ! దేవేశ! యనంత! సత్త
సత్తునకు నన్యమైన యక్షరము నీవ. 37

శ్లో|| త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్|
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనన్తరూప||

గీ. ఈ జగంబున కాధార మీవ, యాది
దేవుఁడవు, వేత్తవును, వేద్య మీవ, నీవ
పరమ పదము, నీవ పురాణ పురుషుఁడవు, న
నంతరూప! నీచే వ్యాప్త మయ్యె జగము. 38

శ్లో|| వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాఙ్కః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ|
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే||

గీ. సోముఁడుఁ బితామహుఁడుఁ బ్రపితా మహుండు
వాయువు, యముండు, వరుణుఁడు, వహ్ని నీవ
మ్రొక్కువాఁడ, వేమాఱుల మ్రొక్కువాఁడ,
మ్రొక్కువాఁడను, మఱి మఱి మ్రొక్కువాఁడ. 39

శ్లో॥ నమః పురస్తాథ పృష్ఠతస్తే నమోऽస్తుతే సర్వత ఏవ సర్వ।
అనన్తవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోऽసి సర్వః॥

గీ. ముందు వెనుకను సర్వత్ర వందనంబు
లాచరింతు, ననంత వీర్యంబు, నమిత
విక్రమముఁ గల్గి, యెల్ల వ్యాపించి యున్న
వాఁడ వగుట సర్వము నీవ, పరమపురుష! 40

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి।
అజానతా మహిమానంతవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాऽపి॥

గీ. ఇట్టి నీ మహిమంబు నే నెఱుఁగ లేక
ఓయి కృష్ణ! ఓ యాదవా! ఓయి సఖుడ!
యనుచుఁ బొరఁబడియో చనువుననొ పిలిచి
తవినయంబునఁ; జెలికాడవని తలంచి. 41

శ్లో॥ యచ్చావహాసార్థమసత్కృతోऽసి విహారశయ్యాసన భోజనేషు।
ఏకోऽథవా ప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వా మహమప్రమేయమ్॥

గీ. ఏకముగ నేని నితరుల యెదుట నేని
నశనశయనాసన క్రీడలందు హేల
నముగ నాడితిని, నవమానంపు నుడుల;
నట్టి నేరముల్ క్షమియింపు మప్రమేయ! 42

శ్లో॥ పితాऽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్।
న త్వత్సమోऽస్త్యభ్యధికః కుతోऽన్యో లోకత్రయేऽప్యప్రతిమ ప్రభావ॥

గీ. అసదృశప్రభావ! చరాచరాది భువన
మునకుఁ దండ్రివి, గురుఁడవు పూజ్యుఁడవు, మ
హాత్ముఁడవు త్రిలోకంబుల యందు నీకు
లేఁడు సముఁడన్న, నధికుఁ డెవ్వాఁడు కలఁడు. 43

శ్లో|| తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్ |
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ||

ఆ.వె. కానఁ బ్రణుతి సేసి కాయంబు క్షితి మోపి
యీశు నీడ్యునిన్ క్షమింపఁ గొలుతు
జనకుఁడు సుతు, సఖుఁడు సఖు ప్రియుండు ప్రియను
సైచు నట్లు నన్ను సైప వలయు. 44

శ్లో|| అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే |
తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస ||

గీ. ఎన్నఁ డెఱుఁగని రూపంబు నిపుడు గాంచి
సంతసించితి, స్వాంతంబు చలన మొందె
భయముచే నాకుఁ బూర్వ రూపంబుఁ జూఁపి
కరుణఁ గనుమి దేవేశ! జగన్నివాస; 45

శ్లో|| కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ |
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే ||

గీ. వేయి భుజములు గలిగిన విశ్వమూర్తి!
మణి కిరీటము గద చక్రమును ధరించు
నిన్నుఁ జూడఁగా నేఁ గోరుచున్న వాఁడఁ
గావునఁ జతుర్భుజాకృతిఁ గలిగి నిలుమి. 46

శ్రీ భగవా నువాచ

శ్లో|| మయా ప్రసన్నేన తవార్జు నేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్ |
తేజోమయం విశ్వమనన్త మాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. అనఘ! తేజోమయంబు నాద్యంబుఁ, బరమ
నంత, మన్యులు మున్ను గనంగ రాని
విశ్వరూపంబు నీపయిం బ్రేమ వాత్మ
యోగ సామర్థ్యమునఁ జూపి యుంటి నిపుడు. 47

శ్లో|| నవేదయజ్ఞాధ్యయనైర్నదానై ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః|
ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర||

గీ. ఇట్టి నా దివ్య రూపంబు నీవు దక్క
నిగమ యజ్ఞాధ్యయన దాన నిఖిల కర్మ
నిష్ఠులైన నుగ్ర తపోగరిష్ఠులైనఁ
గాంచఁ జాలరీ మనుజ లోకంబు నందు. 48

శ్లో|| మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్|
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య||

గీ. ఇట్టి మద్భయంకర రూప మీవు గాంచి
భయము మోహముఁ జెందకు, భయము వదలి
మోద మొందుమి మది నాదు పూర్వ రూప
మిపుడు చక్కఁగాఁ జూడుమి యింద్రతనయ! 49

సఞ్జయ ఉవాచ

శ్లో|| ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః|
ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా||

సంజయుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. వాసుదేవుఁడిటుల ఫల్గును గూర్చి వ
చించి మఱలఁ జూఁపె స్వీయ రూప
మంత సౌమ్య రూపమంది యోదార్చెను.
భయముఁ జెందు చున్న పాండవేయు. 50

అర్జున ఉవాచ

శ్లో|| దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన|
ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః||

అర్జునుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. సరసిజాక్ష! మానుషంబు సౌమ్యంబైన
యిట్టి స్వరూప మిపుడు గాంచ
స్వస్థతను వహించె స్వాంతంబు, క్రమ్మఱఁ
బ్రకృతిఁ బొందఁ గలుగు వాఁడ నైతి. 51

శ్రీ భగవా నువాచ

శ్లో|| సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ|
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. ఇపుడు నీవు గనిన యిట్టి నా విశ్వరూ
పంబుఁ గనుట దుర్లభంబు సుమ్మి
దేవతలును కూడ దీనిని వీక్షింప
నెపుడుఁ గోరు చుందు రింద్రతనయ! 52

శ్లో|| నాహం వేదైర్నతపసా న దానేన న చేజ్యయా|
శక్య ఏవంవిధో ద్రష్టుం ద్రష్టవానసి మాం యథా||

ఆ.వె. దాన యజ్ఞములను దపముల శ్రుతులను
బ్రతిభఁ గాంచి నట్టి వారి కేని
నిపుడు నీవు గనిన యిట్టి నా విశ్వరూ
పంబుఁ గనఁగ దుర్లభంబు పార్థ! 53

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోऽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప॥

ఆ.వె. అన్య చింత లేని యట్టి సద్భక్తి న
న్నరయఁ దెలియఁ బొంద నగును గాని
వేఱు సాధనమున నేరరు నన్ యథా
ర్థముగఁ గాంచ వైరిదర్పహరణ! 54

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ!॥

గీ. నాకుఁగాఁ గర్మముల సల్పి, నన్ను బరమ
గతి యనుచు నమ్మి, మద్భక్తిఁ గలిగి, సంగ
మమును విడనాడి, సర్వ భూతముల వైర
ముడుగు నాతఁడు తుద నన్నె పడయు విజయ! 55

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
విశ్వరూపసందర్శన యోగోనామ
ఏకాదశోऽధ్యాయః

ఇది శ్రీరాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్తకవివిధేయ హనుమంత నామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
విశ్వరూపసందర్శనయోగమను
ఏకాదశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## భక్తియోగము

### ద్వాదశాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

గీ. ఇవ్విధంబున సతము నిన్నే భజించు
భక్త వర్యుల యందు, నవ్యక్తమైన
యక్షరంబు నుపాసించు నట్టి వారి
యందు యోగ విత్తము లెవ్వరయ్యా కృష్ణ! 1

శ్రీ భగవా నువాచ

శ్లో॥ మయ్యావేశ్య మనోయే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తేమే యుక్తతమా మతాః॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. అనఘచరిత! చిత్తంబు నా యందు నిలిపి
సతత యుక్తాత్ములై మంచి శ్రద్ధ గలిగి
నన్నుపాసించు చుండు జనముల నిశ్చ
యంబుఁగా యోగిపుంగవులని తలంతు. 2

శ్లో॥ యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగమచిన్త్యఞ్చ కూటస్థ మచలం ధ్రువమ్॥

ఆ.వె. అక్షరంబు నచల మవ్యక్తమై నిర్ణ
యింప వీలుగాక ధృవమచింత్య
మగుచు నెల్ల యెడల వ్యాప్తమై ప్రకృతియం
దున్న దానిఁగొలుచు చున్నవారు. 3

శ్లో॥ సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః॥

గీ. ఇంద్రియంబులన్నిటి నిగ్రహించి సర్వ
కాలముల, లోన సమబుద్ధిఁ గాంచఁ గలిగి
యఖిల భూత హితాసక్తులై చరించు
వారలును నన్నె పొందు చున్నారు విజయ! 4

శ్లో॥ క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥

గీ. అతుల నవ్యక్త చేతస్కులైన వారి
కధిక కష్టంబు గలుగు, దేహాభిమాన
యుతుల కెందు నవ్యక్తమౌ గతి విశేష
కష్టమునఁ గాని లభ్యంబు గాదు పార్థ! 5

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥

గీ. అఖిల కర్మంబు లెవరు నాయందు నునిచి
నన్నెపరుఁడని యెంచి యనన్యయోగ
మునను నన్నె ధ్యానింపుచు, మనము నందు
నెల్ల వేళల నన్నుపాసించు చుంద్రు. 6

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥

ఆ.వె. శ్వేతవాహన! యటు చిత్తంబు నాయందు
నిలిపి, నన్ను సతముఁ గొలుచు వారి
నవని మృత్యురూపమైన సంసార వా
రిధిని శీఘ్రముగఁ దరింపఁ జేతు. 7

శ్లో|| మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధిం నివేశయ |
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ||

గీ. నీదు హృదయంబు నాయంద నిలుపు మెపుడు
నిలుపు నాయంద సతతంబు నీదు బుద్ధి
యట్లు చేయ, నుండెదవు నాయందు నిశ్చ
యముగ నిఁక మీఁద, భక్తశిఖావతంస! 8

శ్లో|| అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ |
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాఽప్తుం ధనఞ్జయ ||

ఆ.వె. స్థిరము గాగ నీదు చిత్తంబు నాయందు
నిలుప శక్తి యింకఁ గలుగ దేని
యత్నమును బొనర్పు మభ్యాస యోగంబు
వలన నన్నుఁ బొందఁ, బాండుతనయ! 9

శ్లో|| అభ్యాసేఽప్యసమర్థో ఽసి మత్కర్మపరమో భవ |
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ||

ఆ.వె. అభ్యసింప శక్తియైన లేదేని నా
కై సమస్త కర్మ లాచరింపు
మటుల గర్మముల మదర్థముసలుపుచు
నుంటి వేని సిద్ధి నొందఁ గలవు. 10

శ్లో|| అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః |
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ||

గీ. కాని దీనినిఁ జేయుట కైన శక్తి
గలుగ కున్నచో నాదు యోగంబు నాశ్ర
యించి, నియత చిత్తుఁడవై సమంచితముగ
నఖిల కర్మ ఫల త్యాగి వగుము విజయ! 11

శ్లో|| శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే|
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్||

గీ. జ్ఞాన మభ్యాసమున కంటె సమ్మతంబు,
జ్ఞానమున కంటె శ్రేష్టంబు ధ్యాన మగును
పార్థ! దాని కంటెను గర్మ ఫలనివృత్తి
యుత్తమము, దానఁ దుది శాంతి నొందఁ గలవు. 12

శ్లో|| అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ|
నిర్మమో నిరహఙ్కారస్సమదుఃఖసుఖః క్షమీ||

గీ. సర్వభూతము లందు ద్వేషంబు వదలి,
పొంది మైత్రినిఁ గనికర మొంది, మమత
విడిచి, లోన నహంకార ముడిగి, దుఃఖ
సౌఖ్యముల సమ చిత్తుఁడై క్షమ వహించి, 13

శ్లో|| సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః|
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్సమే ప్రియః

ఆ.వె. నియమితాత్ముఁ డగుచు నిత్య సంతోషియు
యోగియు దృఢ నిశ్చయుండునై మ
నంబు బుద్ధి నిలిపి నా యందు, మద్భక్తుఁ
డౌ నరుండె యిష్టుఁడగును నాకు. 14

శ్లో|| యస్మాన్నోద్విజతే లోకో లోకోన్నోద్విజతే చ యః|
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః||

గీ. జడియ కుండు నెవ్వాని కీ జగము లన్ని
జగములన్నిటి కెవ్వఁడు జడియ కుండు
నలుక భయము, నుద్వేగము, హర్షములను
విడువఁజాలిన వాఁడు మత్ప్రియుఁడు పార్థ! 15

శ్లో॥ అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః॥

గీ. దక్షుఁడును విశుద్ధుండ నపేక్షుఁడు, మఱి
భయ విరహితుఁడు నిష్పక్షపాతరతుఁడు,
సర్వసంకల్పరహితుఁడై, సంచరించు
నాదు భక్తుఁడు ఫల్గునా! నాకు బ్రియుఁడు. 16

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥

ఆ.వె. ఎవఁడు హర్ష మొందఁ డెవఁడు ద్వేషింపఁడో
యెవఁడు దుఃఖ మొందఁ డెవఁడు కోరఁ
డర్జునా! యెవఁడు శుభాశుభత్యాగియౌ
నట్టి భక్తుఁడె ప్రియుఁడగును నాకు. 17

శ్లో॥ సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః॥

ఆ.వె. శత్రు లందు మఱియు మిత్రుల యందును,
మాన మందున నవమాన మందు,
సౌఖ్య దుఃఖములను జలి వేడుముల యందు
సముఁడునై త్యజించి సంగమంబు. 18

శ్లో॥ తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్।
అనికేతః స్థిరమతిర్భక్తి మాన్మే ప్రియో నరః॥

ఆ.వె. స్తుతిని నిందను మదిఁ దుల్యంబుఁగా నెంచి
మౌని యగుచు దేన నైనఁ దృప్తి
నంది, వాస రహితుడై స్థిర బుద్ధియై
నాదు భక్తిఁ గనెడు నరుఁడు ప్రియుండు. 19

శ్లో॥ యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥

గీ. శ్రద్ధ గల వారలై నన్ను సర్వ ముఖ్యుఁ
డనుచు నెవ్వార లిట్టి ధర్మ్యామృతంబుఁ
గవ్వడీ! యుపాసింపఁగాఁ గలరొ, యట్టి
నాదు భక్తులే యిష్టులు నాకు మిగుల. 20

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
భక్తి యోగోనామ
ద్వాదశోఽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
భక్తి యోగమను
ద్వాదశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

### త్రయోదశోధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో|| ప్రకృతిం పురుషంచైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ|
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయఞ్చ కేశవ||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

ఆ.వె. క్షేత్ర మనఁగ నెద్ది? క్షేత్రజ్ఞుఁడన నెవ్వఁ?
డేది ప్రకృతి? పురుషుఁ డెట్టి వాఁడు?
జ్ఞాన మనఁగ నేమి? శౌరి! జ్ఞేయం బన
నెద్ది? వీనిఁ దెలియ నిచ్చగింతు. 1

శ్రీ భగవా నువాచ

శ్లో|| ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే|
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః||

శ్రీ కృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. క్షేత్ర మనెడి పేరఁ జెప్పంగఁ బడు చుండు
నీ శరీర మెపుడు నింద్రతనయ!
ఇట్టి క్షేత్ర మెవ్వఁ డెఱుఁగునో వాని క్షే
త్రజ్ఞుఁడని వచింత్రు తత్త్వ విదులు. 2

శ్లో|| క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత|
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ||

గీ. అవనిఁ గల యట్టి క్షేత్రంబు లందు, క్షేత్ర
వేత్తఁగా నన్ను మదిని భావింపు మయ్య!
ఇటు శరీరాత్మలను రెంటి నెఱుఁగు నదియె
జ్ఞానమని పాండవోత్తమా! నా మతంబు. 3

శ్లో॥ తత్ క్షేత్రంయచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥

గీ. ఎట్టిదో, యేదొ, యా క్షేత్రమే వికార
ములు, గలదొ, యేల, యేరూపములు గలదొ, యె
వండొ క్షేత్రజ్ఞుఁడే ప్రభావముఁ గలట్టి
వాఁడొ, దీని సంగ్రహముగఁ బార్థ వినుతు. 4

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మ సూత్రపదైశ్చైవహేతుమద్భిర్వినిశ్చితైః॥

గీ. పలుగఁబడె ఋషి వరులచేఁ బలు విధముల,
వేదముల వేఱువేఱుఁగా వివిధ గతులఁ,
దగ వినిశ్చిత యుక్తి యుక్తంబు లైన
బ్రహ్మసూత్రపదములచేఁ బలుకఁ బడియె. 5

శ్లో॥ మహాభూతాన్యహఙ్కారో, బుద్ధి రవ్యక్తమేవ చ।
ఇన్ద్రియాణి దశైకఞ్చ పఞ్చ చేన్ద్రియగోచరాః॥

ఆ.వె. అయిదు భూతములు, నహంకారమును, బుద్ధి
పార్థ! మూలప్రకృతి బదియు నొక్క
యింద్రియంబు లట్టి యింద్రియ గోచరం
బులగు నైదు విషయములును, మఱియు. 6

శ్లో॥ ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః।
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్॥

గీ. శ్వేతవాహన! కోరిక ద్వేషమును, సు
ఖమును దుఃఖము, దేహేంద్రియములుఁ జిత్త
వృత్తి, ధృతి, సవికారమౌ నిదియె సుమ్మి
క్షేత్రమని సంగ్రహంబుగఁ జెప్పఁ బడియె. 7

శ్లో॥ అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥

ఆ.వె. మాన ముడుగుటయను, మఱి యదంభిత్వ, మ
హింస, శాంతి, కపట హీనత యును,
శౌచ, మార్యసేవ, స్థైర్యంబు, దేవతా
నీకవంద్య! యాత్మనిగ్రహంబు. 8

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహఙ్కార ఏవ చ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥

గీ. అఖిల విషయంబుల విరక్తి నందుటయును,
గల యహంకారమును వీడి మెలఁగు చుంట,
జనన మృతి జరారుజ దుఃఖ సంతతులను
గలుగు దోషంబుల నరసి తెలిసి కొనుట. 9

శ్లో॥ అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు।
నిత్యఞ్చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు॥

గీ. అఱఁచి సక్తి సుత సతీ గృహాదులందు
మమత లేక యుండుటయు సంప్రాప్తమైన
యెడల నిష్టమేని యనిష్టమేని సర్వ
కాలముల సమచిత్తంబుఁ గలిగి యుంట. 10

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది॥

గీ. అమరనాథతనూజ! నాయందనన్య
యోగమున నియమిత భక్తి నుండుటయును,
జన విహీనమునౌ ప్రదేశమున నుంట,
జనుల కూటంబులంధు నాసక్తి విడుట. 11

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥

గీ. సతత మధ్యాత్మవిషయిక జ్ఞాని యగుట,
అనఘచరిత! తత్త్వ జ్ఞానమునఁ బ్రయోజ
నంపు దృష్టియు జ్ఞాన మనంగఁ బడును;
దీనికిని భిన్నమైన దజ్ఞాన మగును. 12

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥

గీ. ఎఱుఁగఁదగు నెద్ది, యెద్దాని నెఱిఁగి పొంద
గలఁడొ మోక్షంబు, నద్దానిఁ దెలుపు వాఁడ
అదియనాదియు నుత్కృష్టమైన బ్రహ్మ
మగును, సత్తుగాదది యసత్తనఁగఁ బడదు. 13

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥

ఆ.వె. అన్ని యెడలఁ బాద హస్తంబు లన్నిట
నక్షులును శిరంబు లాస్యములును
గర్ణములను నెల్లఁ గలిగి యీలోకమం
దెల్ల యెడల నావరించి యుండు. 14

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

గీ. పార్థ! సర్వేంద్రియ గుణాప్రభాసమాన
మగుచు, సర్వేంద్రియ రహితమైన యది, య
సక్తమై సర్వము ధరింపఁ జాలి, గుణము
లన్ని లేనిదై గుణ భోక్తయైన యదియు. 15

శ్లో॥ బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్॥

ఆ.వె. వివిధ భూతములకు వెలుపల లోపలఁ
జరము నగుచు మఱి యచరము నగుచు
నమిత సూక్ష్మ మగుట నరయంగ రానిదై
యద్ది దవ్వు దాపులందు నుండు. 16

శ్లో॥ అవిభక్తఞ్చ భూతేషు విభక్త మివ చ స్థితమ్।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

గీ. అద్ది యవిభక్తమై యెల్ల ప్రాణులను వి
భక్తమై నట్టులుండును, ప్రాణులను భ
రించు నదియును, వాని భుజించు నదియు
మఱలఁ బుట్టించు నదియని యెఱుఁగ నగును. 17

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

గీ. సకల తేజస్సులకును తేజస్సు నగుచుఁ
దమము కంటెఁ బరంబని దాని నంద్రు,
జ్ఞానమును, జ్ఞేయమును, జ్ఞాన గమ్య మగుచు
నన్ని ప్రాణుల హృదయంబులందు నుండు. 18

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥

గీ. క్షేత్రమును, జ్ఞానమును మఱి జ్ఞేయ మిట్లుఁ
జెప్పినాఁడ గిరీటి! సంక్షేపముగను
ఇపుడు పల్కిన యర్థంబు నెఱుఁగఁ జాలు
భక్తుఁ డొందును నా స్వరూపమగు ముక్తి. 19

శ్లో|| ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి|
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సమ్భవాన్||

ఆ.వె. ప్రకృతి పురుష లనఁగఁ బరఁగు నీ రెండు న
నాదులంచు స్వాంతమందుఁ గనుమి
వికృతులు, గుణములును, బ్రకృతి సంజనితము
లనుచుఁ దెలిసి కొనుమి యనఘచరిత! 20

శ్లో|| కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే|
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే||

ఆ.వె. కనఁగఁ బ్రకృతి, కార్య కారణ కర్తృత్వ
మునకు హేతుభూతమనగఁ జెల్లు
పురుషుఁడు సుఖ దుఃఖ భోక్తృత్వమునఁ గార
ణుండనంగఁ బడును బాండవేయ! 21

శ్లో|| పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్|
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు||

గీ. భరతభూషణ! పురుషుఁడు ప్రకృతిఁ గూడి
యా ప్రకృతిఁ గల్గు గుణముల ననుభవించు
అట్టి గుణసక్తి సదసత్తులైన జన్మ
ములకుఁ గారణమైనదీ పురుషునకును. 22

శ్లో|| ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః|
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః||

గీ. అర్జునా! యిట్టి దేహంబు నందుఁ బరపు
రుషుఁ, డుపద్రష్టయు, మహేశ్వరుండు, మఱియుఁ
బోషకుం, డనుమంతయు, భోక్త యనియుఁ
బరుఁడుఁ, బరమాత్మ యనియును, బలుకఁబడును. 23

శ్లో|| యయ ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ|
సర్వథా వర్తమానోऽపి న స భూయోऽభిజాయతే||

గీ. ఇవ్విధమునఁ బురుషునిఁ బ్రకృతిని, వాని
గుణ సహితముగ నెవ్వఁడు గనునొ యాతఁ
డన్ని విధముల వఱలు వాడయ్యు మఱల
జన్మమును బొందఁడెందును సవ్యసాచి! 24

శ్లో|| ధ్యానేనాऽత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా|
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే||

గీ. ధ్యానమునఁ గొందఱీ దేహమందు నున్న
యాత్మను మనంబుచే జూతురయ్య పార్థ!
కాంత్రు కొందఱు సాంఖ్య యోగమునఁ గర్మ
యోగమునఁ గొంద ఱరయుచు నుందు రాత్మ. 25

శ్లో|| అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాऽన్యేభ్య ఉపాసతే|
తేऽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః||

గీ. ఎఱుఁగ కిట్టులఁ గొందఱి తరుల వలన
విని యుపాసన సేతురు; వినుట యంద
భీష్టమును గల్గు వారును మృత్యువును, న
తిక్రమించుచు నుందురు శక్రతనయ! 26

శ్లో|| యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావరజఙ్గమమ్|
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ||

గీ. మహిని, స్థావర జంగమాత్మకము నగుచు
నెట్టిదైన జీవ మొకండు పుట్టెనేనిఁ
బ్రకృతి పురుషుల రెంటి సంబంధముననె
కలిగెనని, భరతర్షభ! తెలిసి కొనుమి. 27

శ్లో|| సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ |
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ||

గీ. సకల భూతము లందుండి, సమముఁగా, న
శించు వాని యందుండి, నశింప కుండు
నట్టి, పరమేశ్వరుండగు నాత్మ నెవఁడు
చూచు, నవ్వాఁడె లెస్సగాఁ జూచు వాఁడు. 28

శ్లో|| సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ |
న హినస్త్యాత్మనాऽऽత్మానం తతో యాతి పరాంగతిమ్ ||

గీ. అఖిల భూతములను సముఁడై చరించు
నట్టి పరమేశ్వరుని నెవ్వఁడరయు చుండు
నాతఁడాత్మను హింసింపఁ డట్టి దాన
బరమగతిఁ బొందు చున్నాఁడు పాండవేయ! 29

శ్లో|| ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః |
యః పశ్యతి తథాऽऽత్మానమకర్తారం స పశ్యతి ||

ఆ.వె. ఈ సమస్తకర్మ లెవ్వఁడు ప్రకృతిచే
తనె యొనర్పఁ బడిన వనుచుఁ దెలియు
నాతఁడే కిరీటి! ఆత్మ నకర్తయ
టంచు నెప్పు డెఱుఁగు నట్టివాఁడు. 30

శ్లో|| యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి |
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ||

ఆ.వె. పార్థ! భూత భిన్న భావంబు నెప్పు డేక
గతము నైన దానిఁగాఁగఁ గనునో;
యెప్పుడు దాని వలననే కను విస్తార
మపుడ తాను బ్రహ్మ మందు చుండు. 31

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయ మవ్యయః।
శరీరస్థోऽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే॥

ఆ.వె. ఆది లేక నిర్గుణాత్ముఁడౌ కతమున,
నవ్యయుండగుఁ బరమాత్మ, దేహ
మందు నున్నఁ గర్మ లాచరింపండట్టి
వాని చేత నంటంబడఁడు విజయ! 32

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాऽऽత్మా నోపలిప్యతే॥

ఆ.వె. అన్ని యెడల నిండి యాకాశ మతి సూక్ష్మ
మగుట నెద్ది యేని నంటకుండు
తీరునను, సమస్త దేహంబు లందున్న
నాత్మ దేనిఁగాని నంట కుండు. 33

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥

గీ. ఎట్లు కమల బాంధవుఁ డొకఁడీ ప్రపంచ
మంతయును బ్రకాశించెడు నటులఁ జేయు
నా విధంబున క్షేత్రజ్ఞుఁడన్ని క్షేత్ర
ములఁ బ్రకాశింపఁ జేయును బుణ్యశీల! 34

శ్లో|| క్షేత్రక్షేత్రజ్ఞ యోరేవమన్తరం జ్ఞానచక్షుషా |
భూతప్రకృతి మోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్. ||

గీ. ఫల్గునా! జ్ఞానదృష్టి నెవ్వార లివ్వి
ధమున బ్రకృతి పురుషు లభేదంబు, మఱియు
భూతముల ప్రకృతిని, మోక్షమును, నెఱుంగు
చుందురో వారు బ్రహ్మంబు నొందు చుంద్రు, 35

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ
త్రయోదశోऽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను
త్రయోదశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## గుణత్రయ విభాగయోగము

### చతుర్దశాధ్యాయము

శ్రీభగవానువాచ

శ్లో|| పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్|
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పుచున్నాఁడు

ఆ.వె. ఎట్టి జ్ఞాన మెఱిఁగి యెల్ల మునుల్ దీని
కంటెఁ బరమసిద్ధిఁ గాంచి నారొ,
పలుకు వాఁడ జ్ఞానముల నుత్తమము పరం
బైన జ్ఞాన మార్గమేను మఱల. 1

శ్లో|| ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః|
సర్గేzపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ||

ఆ.వె. ఇట్టి జ్ఞాన మాశ్రయించి నా సాధర్మ్య
మందుచున్న వార లగుచుఁ బార్థ!
సర్గ మందునైన జన్మంబు నొందరు
ప్రళయ మందునైన వ్యథను గనరు. 2

శ్లో|| మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్|
సమ్భవస్సర్వభూతానాం తతో భవతి భారత||

ఆ.వె. ఆ మహా ప్రకృతియె యగు నాదు యోని, గ
ర్భంబు దాన నుంచు వాఁడ నేను;
అట్టి కారణమున నఖిల భూతంబులు
సంభవించు చుండు, సవ్యసాచి! 3

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయస్సమ్భవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా॥

ఆ.వె. ఎల్ల యోను లందు నెట్టి దేహంబులు
సంభవించు చుండు, శత్రుహరణ!
వాని కెల్ల మూల ప్రకృతియె యోనియౌ,
బీజ దాత నైన పితను నేను. 4

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥

గీ. పాండునందన! ప్రకృతి సంభవము లైన
సాత్వికము రాజసము తామసం బనంగ
నమరు గుణములీ యవ్యయుండైన దేహి
నెంతయేని దేహమున బంధించు చుండు. 5

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ॥

గీ. వీని లోన సత్వంబు ప్రవిమల మగుట
నది ప్రకాశకంబు ననామయంబు నగును,
జ్ఞాన సంగమమున సుఖ సంగమంబు
వలన నాత్మను బంధించు నలఘువీర్య! 6

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్॥

గీ. సవ్యసాచి! తృష్ణానంగ సంభవంబ
టంచుఁ గనుమి రాగాత్మకంబైన రజము;
కర్మముల యందు నాసక్తిఁ గలుగఁ జేసి
దేహి నియ్యది మిగుల బంధించు చుండు. 7

శ్లో|| తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్|
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత||

గీ. కనుమి తామసం బజ్ఞాన కలిత మనుచు
నెల్ల ప్రాణుల మిగుల మోహింపఁ జేయు
నిది; ప్రమాద మాలస్యము నిదురఁ గూర్చి
దేహీ నీ తమో గుణము బంధించు చుండు. 8

శ్లో|| సత్త్వం సుఖే సజ్జయతి రజః కర్మణి భారత|
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సజ్జయత్యుత||

గీ. సంగమముఁ గూర్చు సుఖమున సత్వ గుణము,
కర్మముల యందు రజము సంగమ్ముఁ గూర్చుఁ
గవ్వడీ! జ్ఞాన మంతయు గప్పి పుచ్చి
తమము సంగంబు నిడుఁ బ్రమాదంబు నందు. 9

శ్లో|| రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత|
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా||

గీ. రజమును దమో గుణమును దిరస్కరించి
సత్యము; తమంబు, సత్వరజస్సులను ది
రస్కరించియు, ఫల్గునా! రజము, తమస
సత్యముల దిరస్కృతిఁ జేసి సంభవించు. 10

శ్లో|| సర్వద్వారేషు దేహేzస్మిన్ప్రకాశ ఉపజాయతే|
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత||

గీ. ఇట్టి దేహంబునం దెప్పు డెల్ల ద్వార
ములను జ్ఞాన ప్రకాశంబు గలుఁగ జాలు
నపుడు సాత్విక మభివృద్ధి నందె ననుచు
స్వాంత మందునఁ గనుమి నితాంత తేజ! 11

శ్లో|| లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా|
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ||

గీ. ఎప్పుడు రజోగుణం బభివృద్ధిఁ బొందు
నపు డశమముఁ గర్మారంభ మధిక లోభ
మును బ్రవృత్తియు స్పృహయును బుట్టుచుండు
ననుచు బుద్ధి నెఱుంగుమి యనఘచరిత! 12

శ్లో|| అప్రకాశోऽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ|
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన||

ఆ.వె. అప్రవృత్తియు, మఱియ ప్రకాశంబును
మోహమును బ్రమాదమును; దమస్సు
వృద్ధి నొంద గలుగు వేళల, ఫల్గునా!
పుట్టు చుండు ననుచు బుద్ధిఁ గనుమి. 13

శ్లో|| యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్|
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే. ||

ఆ.వె. ఎవఁడు సత్వగుణము వృద్ధిఁ బొందుచు నుండు
నపుడు మరణ మొందు, నా నరుండు
ప్రవిమలంబులైన బ్రహ్మవేత్తల లోక
ములను బొందుఁ బాండుభూపతనయ! 14

శ్లో|| రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే|
కథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే||

గీ. ఎవఁడు మరణించు రజ మభివృద్ధిఁ బొందు
నపుడు, కర్మసంగుల లోన నతఁడు పుట్టు;
తమము వృద్ధినిఁ గనఁగఁ బ్రాణముల వదలు
వాఁడు మూఢ యోనులను సంభవము నొందు, 15

శ్లో|| కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్ |
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ||

గీ. సత్త్వ కర్మంబులకు నెల్ల సాత్త్వికమగు
నిర్మల ఫలం బటంచు మనీషు లంద్రు,
వ్యసన మగును రజః కర్మ ఫలము తామ
సంబునకు నంద్రు ఫలితమజ్ఞాన మనుచు, 16

శ్లో|| సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ |
ప్రమోదమోహౌ తమసో భవతోzజ్ఞానమేవ చ ||

గీ. జ్ఞాన ముద్భవించుచు నుండు సాత్త్వికమున,
రాజసంబున లోభంబె ప్రభవ మొందుఁ
దామసమున మోహముఁ బ్రమాదంబు జ్ఞాన
శూన్యతయును జనించు విశుద్ధచరిత! 17

శ్లో|| ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః |
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ||

గీ. కాంత్రు సాత్త్వికు లూర్ధ్వలోకముల, జనన
మందుచుంద్రు రాజసులు మధ్యంబు నందు,
నర్జునా! నీచ గుణవృత్తి యందు నున్న
తామసులు వడయుదు రధోస్థానములను. 18

శ్లో|| నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాzనుపశ్యతి ||
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోzధిగచ్ఛతి ||

గీ. జ్ఞానయుక్తుఁ డెవ్వాఁడు గుణముల కంటె
నితరమును గర్తఁగా నెప్పు డెఱుఁగ కుండుఁ
బార్థ! గుణముల కంటెను బరునిఁ జూచు
నపుడు వాఁడు మద్భావంబు నందుచుండు. 19

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోऽమృతమశ్నుతే॥

గీ. దేహమునను గలుగు త్రిగుణంబులఁ గిరీటి!
దేహి యైన వాఁడతిక్రమించి
జనన మృతి జరా వ్యసనముల విడనాడి
బ్రహ్మమైన ముక్తిఁ బడయు చుండు. 20

అర్జున ఉవాచ

శ్లో॥ కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతానతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతా స్త్రీన్గుణానతివర్తతే॥

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

గీ. దేవ! యీ త్రిగుణంబు లతిక్రమించు
పురుషవర్యుఁ డేయే చిహ్నములను వరలు?
అతని యాచార మెయ్యేది? ఆతఁ డిట్టి
త్రిగుణముల నెవ్విధమున నతిక్రమించు? 21

శ్రీ భగవా నువాచ

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి॥

శ్రీ కృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు

గీ. జగతి సంప్రాప్తమౌ ప్రకాశ ప్రవృత్తి
మోహముల యందు ద్వేషంబుఁ బొంద కుండ
నెట్టి మనుజుండు, విజయ! నివృత్తమైన
వాని మఱలఁ గాంక్షింపఁడో స్వాంత మందు. 22

శ్లో|| ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే|
గుణా వర్తన్త ఇత్యేవ యోऽవతిష్ఠతి నేఙ్గతే||

గీ. ఫల్గునా! యుదాసీనుని పగిది నుండు
నెవ్వఁడు గుణముల చేతఁ జలింపఁ బడఁడొ,
గుణములే ప్రవర్తించెడి వనుచు నెవ్వ
డుండునో చలనం బెవఁడొందఁబోఁడొ. 23

శ్లో|| సమదుఃఖసుఖస్స్వస్థస్సమలోష్టాశ్మ కాఞ్చనః|
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః||

గీ. సముఁడునై దుఃఖ మందును సౌఖ్య మందు,
సముఁడు నగుచు లోష్టాశ్మ కాంచనము లందు
నప్రియ ప్రియముల సమ మంది ధీరుఁ
డగుచు, నింద సంస్తుతులఁదుల్యముగఁ గనుచు. 24

శ్లో|| మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః|
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే||

గీ. మానమవమానమందు సమానుఁ డగుచు
శత్రు మిత్ర పక్షంబుల సముఁడు నగుచు,
నెల్ల కార్యంబులను ద్యజియింపఁ జాలు
మనుజ వరుఁడు గుణాతీతుఁ డనగఁ బడును. 25

శ్లో|| మాం చ యోऽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే|
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే||

గీ. అర్జున! యెవాఁడు నిశ్చలమైన భక్తి
యోగమున నన్ను సేవించు చుండు, నిట్టి
త్రిగుణముల నా నరుండె యతిక్రమించి
యమల బ్రహ్మత్వ మొంద సమర్థుఁ డగును. 26

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాzహమమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ. ॥

గీ. అమృత మగుచును మఱి యవ్యయంబు నైన
బ్రహ్మమునకు నిత్యమగు ధర్మంబు నకును,
సవ్యసాచి! యైకాంతిక సౌఖ్యమునకు
నేన యాశ్రయంబని గనుమీ సతంబు. 27

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
గుణత్రయవిభాగయోగోనామ
చతుర్దశోzధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజస గోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంత నామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
గుణత్రయవిభాగయోగమను
చతుర్దశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## పురుషోత్తమప్రాప్తియోగము

### పంచదశాధ్యాయము

శ్రీ భగవా నువాచ

శ్లో|| ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ |
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. ఊర్ధ్వమూలమధశ్శాఖ, లొనరఁ గలిగి
నదియు యశ్వత్థ మవ్యయమని వచింత్రు:
పాండునందన! వేదముల్ పర్ణములుగ
వెలయు దాని నెఱుఁగు వాఁడె వేదవిదుఁడు. 1

శ్లో|| అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖాః గుణప్రవృద్ధా విషయప్రవాలాః|
అధశ్చ మూలాన్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే||

గీ. గుణ వితతి చేత నభివృద్ధి గనుచు, విషయ
ములను చిగురులఁ గలిగి శాఖలను గ్రిందఁ
బైనఁ బ్రసరింపఁ జేసి కర్మాను బంధ
మూలములు వ్యాప్త మయె మర్త్య భువన మందు. 2

శ్లో|| న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో నచాదిర్న చ సంప్రతిష్ఠా|
అశ్వత్థమేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ ధృడేన ఛిత్వా||

గీ. ఆ స్వరూపము గనఁబడదయ్యా! యిందు
దానిఁకాదియు స్థితియు నంతంబుఁ గాన
మిట్టి సువిరూఢ మూలమౌ వృక్షమును దృ
ఢమగు వైరాగ్య రూప శస్త్రమున నఱికి 3

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తన్తి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

గీ. దేనిఁ బొందినఁ గ్రమ్మఱఁ దిరిగి రారొ
దాని నరయఁగవలెఁ బురాతనమునౌ ప్ర
వృత్తిఁ బ్రసరింపఁ జేసిన విశ్వమయునిఁ,
బురుషు, నాద్యు, నే శరణంబుఁ బొందు దనుచు. 4

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్॥

గీ. మాన మోహాను రాగ కామముల గెలిచి,
సౌఖ్య దుఃఖాది ద్వంద్వ సంసక్తి విడచి,
విజయ! యధ్యాత్మ నిత్యులై వెలయు జ్ఞాను
లవ్యయంబైన మోక్షంబు నందు చుంద్రు 5

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥

గీ. పద్మమిత్రుండుఁ జంద్రుఁడుఁ బావకుండుఁ
జెలగి దేనిఁ బ్రకాశింపఁ జేయ లేరొ
దేనిఁ బొందిన వారలు తిరిగి రారొ
యద్దియే నాపరంధామ మగును బార్థ! 6

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః।
మనఃషష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥

గీ. నా సనాతనాంశమ యర్జునా! ప్రపంచ
మునను జీవ రూపంబును బొంది ప్రకృతి
యందు వసియించి, జ్ఞానేంద్రియముల నైదు
మఱి మనంబు, నీడ్చును దన దఱికి మిగుల, 7

శ్లో|| శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః|
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధా నివాశయాత్||

ఆ.వె. ఎపుడు జీవుఁ డొందు నీ శరీరము, దీని
నెపుడు విడుచు; నపుడ యుద్ధచరిత!
వస్తు సమితి నుండి పవనుఁడు గంధంబుఁ
గొనెడు నటుల వీనిఁ గొనుచుఁ బోవు. 8

శ్లో|| శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ|
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే||

గీ. పాండవోత్తమ! ఘ్రాణంబు స్పర్శనంబు
గనులు వీనులు రసనము మనము ననెడి
వీని నెల్ల నధిష్ఠించి విషయ వితతి
ననుభవించుచు నుండీతఁ డనవరతము. 9

శ్లో|| ఉత్క్రామన్తం స్థితం వాఽపి భుఞ్జానం వా గుణాన్వితమ్|
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః||

గీ. మూఢులీ శరీరమును వీడిపోవు నప్పు
డున్నయప్పు డనుభవించు చున్న యపుడు
గాని గుణయుతుఁడగు వీనిఁ గాన లేరు
జ్ఞాన నేత్రంబు గల వారు గాంచు చుంద్రు. 10

శ్లో|| యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్|
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః||

గీ. యత్నమును సల్పు యోగు లీ యాత్మ దేహ
మందు వసియించు వానిగా నరయు చుంద్రు;
రకృత మతులైన మూఢులు యత్న మాచ
రించు వారయ్యు నీతని నెఱుఁగ లేరు. 11

శ్లో|| యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ |
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ||

గీ. అర్క గతమైన వెలుగెద్ది యఖిల లోక
మును బ్రకాశింపఁ జేయునో, వనజ వైరి
జ్వలను లందు నేయే ప్రకాశంబు గలదో
తెలియుమీ దాని నెల్ల నా తేజముగను. 12

శ్లో|| గామా విశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా |
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ||

గీ. నేను భూమిఁ బ్రవేశించి నిఖిల భూత
ముల ధరించు చున్నాఁడ నా బలము వలన,
మఱి రసాత్మకుఁడైన చందురుడ నగుచుఁ
బోషణముఁ జేతు నీ యెల్ల యోషధులను, 13

శ్లో|| అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః |
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ||

గీ. పాండవోత్తమ! వైశ్వానరుండ నగుచుఁ
బ్రాణికోటి శరీరంబు లాశ్రయించి
ప్రాణము నపానమును గూడి నేను బక్వ
మాచరించు చుందుఁ జతుర్విధాన్నములను. 14

శ్లో|| సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తఃస్మృతి ర్జ్ఞానమపోహనం చ |
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ||

గీ || అఖిల భూత హృదయముల యందు నుందు;
నావలనఁ గల్గె జ్ఞాన, మజ్ఞానము, స్మృతి,
వేదకర్తను నేన, నేవేద వేద్య,
మేన వేదవిదుండ, మహేంద్రతనయ! 1౬

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥

ఆ.వె. క్షరుఁడు నక్షరుఁడనఁ బురుషు లిద్దఱు లోక
మందుఁ గలరు పార్థ! యందు క్షరుఁడు
పొలుచు సర్వభూతము లనంగఁ, గూటస్థుఁ
డనెడి పేరఁ దనరు నక్షరుండు. 16

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

గీ. అర్జునా! యన్యుఁడుత్తముఁడైన పురుషుఁ
డరయఁ బరమాత్మ యంచును బఱఁగు, వాఁడె
మూఁడు లోకంబులను జొచ్చి మోయు; నతఁడె
యవ్యయుండైన యీశ్వరుఁ డనఁగ బడును.

శ్లో॥ యస్మాత్క్షర మతీతోఽహమక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥

ఆ.వె. ఇంద్రతనయ! క్షరున కే నతీతుండనై
యక్షరునకు శ్రేష్ఠుఁ డగుటఁ జేసి
జగములందు నెల్ల నిగమంబులను బురు
షోత్తముఁడను గీర్తి నొంది నాఁడ. 18

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత॥

గీ. ఎవఁడు మోహముడిగి యివ్విధి నను, బురు
షోత్తమునిగఁ గనుచు నున్న వాఁడొ,
సవ్యసాచి! యతఁడె సర్వజ్ఞుఁడై నాదు
భజనఁ జేయు సర్వ భావములను. 19

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ|
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత||

ఆ.వె. అర్జునా! పలికితి నతి రహస్యంబైన
శాస్త్ర మేను దాని సరణి నెవఁడు
బాగుగా నెఱుంగు వాఁడె సుజ్ఞానియౌ
యాతఁడె కృత కృత్యుఁడగు నిజంబు. 20

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
పురుషోత్తమప్రాప్తియోగో నామ
పంచదశోఽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
పురుషోత్తమప్రాప్తియోగమను
పంచదశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## దైవాసురసంపద్విభాగయోగము

### షోడశాధ్యాయము

శ్రీభగవా నువాచ

శ్లో|| అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః|
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్||

ఆ.వె. జ్ఞాన యోగ మందుఁ గదలక యుండుట
యిద్ధచరిత! సత్వశుద్ధి, మఱియు
దానమును, దపంబు, దమము, స్వాధ్యాయంబు
యజ్ఞమభయవృత్తి, యార్జవంబు. 1

శ్లో|| అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునమ్|
దయా భూతేష్వలోలు ప్త్వం మార్దవం హ్రీరచాపలమ్||

ఆ.వె. సత్యపద, మహింస, శాంతి, యక్రోధంబు,
త్యాగ, మఖిల భూత దయయు, మార్ద
వం, బలోలతయును, బార్ధ! చపలత లే
కుంట, కొండెము లనకుంట, లజ్జ, 2

శ్లో || తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా|
భవన్తి సమ్పదం దైవీమభిజాతస్య భారత||

ఆ.వె. తేజమును, క్షమంబు, ధృతియు, శౌచము, నభి
మాన హీనతయును, మఱియు ద్రోహ
బుద్ధి లేక యుంట, భువి నివి దైవసం
పదను జన్మ మొందు వాని కగును. 3

శ్లో॥ దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్॥

ఆ.వె. అనఘ! డాంబికంబు నజ్ఞాన మభిమాన
మధికదర్ప మాగ్రహంబు పరుస
దన మనంగ నివియ దైత్యసంపద జన్మ
మందు మానవునకుఁ బ్రాప్త మగును. 4

శ్లో॥ దైవీ సమ్పద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా।
మా శుచస్సమ్పదం దైవీమభిజాతోఽసి పాణ్డవ॥

గీ. దైవ సంపద వలన బంధంబు దలఁగు
దైత్య సంపద వలన బంధంబు గలుఁగు
దైవ సంపద యందు నుద్భవము నొంది
తీవు గాన దుఃఖింపకుమీ కిరీటి! 5

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥

గీ. అర్జునా! దైవమని మఱి యాసురమని
భూత సృష్టి ద్వివిధములఁ బొలుఁచు, నందు,
దైవము వచింపఁ బడియె విస్తరముగ, నిఁక
నాసురంబు వచించెద నాలకింపు. 6

శ్లో॥ ప్రవృత్తిం చ నివృతిం చ జనా న విదురాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥

ఆ.వె. ఎఱుఁగ రేమియును బ్రవృత్తి నివృత్తియు
నాసురస్వభావులైన జనము,
లరయ లేవు శౌచ మాచారములు వారి
యందు సత్య మనఁగ నాస్తి పార్థ! 7

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్।
అపరస్పర సమ్భూతం కిమన్యత్కామహైతుకమ్॥

గీ. జగ మసత్యము నప్రతిష్ఠంబ నీశ
మును బరస్పర సంజాతము, ఘన కామ
హేతుకంబంతకన్న వేఱేమి లేద
టంచు వాదింతు రవ్వార లార్య వినుత. 8

శ్లో॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోऽల్పబుద్ధయః।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోऽహితాః॥

ఆ.వె. ఇట్టి జ్ఞాన మాశ్రయించి నష్టాత్ములు
స్వల్ప బుద్ధు లగుచు, సవ్యసాచి!
భయద కర్మపరులుఁ బరమ విరోధులై
భువి నశింపఁ జేయఁ బుట్టు చుంద్రు. 9

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః।
మోహాద్గృహీత్వాऽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేऽశుచివ్రతాః॥

గీ. ఆశ్రయించి నింప నశక్యమైన కామ
మును, విజయ! యసద్గ్రాహములను గ్రహించి
మోహమున; మాన మద దంభ పూర్ణులైన
వారు వర్తింపుదు రశుచివ్రతనిరూఢి. 10

శ్లో॥ చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితినిశ్చితాః॥

గీ. అపరిమేయముఁ బ్రళయాంతమైన చింత
నాశ్రయించిన వారలై స్వాంతములను
బార్థ! కామోప భోగముల్ పరము లనుచు,
నిద్దియే సాధ్యమని నిశ్చయించు చుంద్రు. 11

శ్లో॥ ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసఞ్చయాన్॥

గీ. సవ్యసాచి! యాశాపాశ శతనిబద్ధు
లగుచుఁ గ్రోధ కామములె ముఖ్యములు గాఁగ
నరసి, కామ భోగార్థ మన్యాయముునను
వార లర్థ సంచయములఁ గోరు చుంద్రు. 12

శ్లో॥ ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇద మస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥

ఆ.వె. "ఇపుడు పొందఁ బడియె నియ్యది నాచేత
నీ మనోరథంబు నేను బొందఁ
గలను, నాకు నిద్ధి గలదు, కలుగు నాకు
నీ ధనంబుఁ గూడ నింక మీద." 13

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥

గీ. "చంపఁ బడియె నా చేత నీ శత్రు, వితర
శాత్రవుల నెల్ల నింక మీద సంహరింతు,
నేన భోగిని నేనె పో యీశ్వరుఁడను,
నేన సిద్ధుఁడ బలశాలి నేన సుఖిని." 14

శ్లో॥ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥

గీ. "సత్కులోద్భవుఁడను ధనశాలి నగుదు
నేన; నా సమానుం డన్యుఁ డెవఁడు గలఁడు
యజ్ఞములఁ జేతు నిచ్చెద హర్షమేన
గాంతు" నని మోహ మొంది యజ్ఞానమునను. 15

శ్లో॥ అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేऽశుచౌ ॥

గీ. అపరిమిత చిత్త విభ్రాంతు లగుచు మోహ
మనెడి వలలోఁ దగుల్కొని యనవరతముఁ
గామ భోగ ప్రసక్తినిఁ గలిగి కూలు
చందు రశుచియౌ నరకంబు నందు విజయ! 16

శ్లో॥ ఆత్మ సంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనాऽవిధిపూర్వకమ్ ॥

ఆ.వె. స్తబ్ధమతులు నాత్మ సంభావితులు ధన
మాన మద సమేతులైన వార
లాచరింతు రందు రవిధి పూర్వక నామ
యజ్ఞములను దాంభికార్థముగను. 17

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోऽభ్యసూయకాః ॥

ఆ.వె. బలముఁ గామ దర్పముల నహంకార క్రో
ధములఁ గలిగి స్వీయ తనువు లందు
నన్య తనువు లందు నలరారునను, ద్వేష
బుద్ధిఁ గని యసూయఁ బొందు చుంద్రు. 18

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥

ఆ.వె. అట్టి ద్వేష పరుల నశుభులఁ గ్రూరుల
నానరాధముల నిరంతరంబు
సవ్యసాచి ! నేను సంసారములఁ బుట్టు
వొందఁ జేతు నసుర యోనులందు. 19

శ్లో|| ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని|
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్||

ఆ.వె. అసుర యోను లందు నావిధమున వారు
జనన మంది జన్మ జన్మము నను
మూఢులగుచు నన్ను బొంద నేరక గాంతు
రంత కంటె నధమమైన గతిని. 20

శ్లో|| త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః|
కామః క్రోధస్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్||

ఆ.వె. కుంతితనయ! కామ కోప లోభంబు లీ
యాత్మ నాశన కరమైన నరక
మునకు మూడు ద్వారములగుఁ గావున జ్ఞాని
వీని మూఁటి నిందు విడువ వలయు. 21

శ్లో|| ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః|
ఆచరత్మాత్మనశ్శ్రేయస్తతో యాతి పరాం గతిమ్||

ఆ.వె. పుణ్యచారితా! తమో ద్వారము లనంగఁ
బరగు వీని మూటి వదలు నతఁడె
శ్రేయ మొసఁగు దానిఁ జేయుచు నుండు న
ద్దానఁ బొందు శ్రేష్ఠమైన గతిని. 22

శ్లో|| యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః|
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్||

ఆ.వె. సవ్యసాచి! యెవఁడు శాస్త్ర నియమమును
విడిచి తాయథేచ్ఛ నడచుఁ చుండు,
నా నరుండు సిద్ధి నందఁడు, సుఖమును
బడయ లేఁడు పరమపదముఁ గనఁడు. 23

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥

ఆ.వె. కానఁ గార్యమును నకార్యంబుఁ దెలియ శా
స్త్రమె ప్రమాణ మగును; శాస్త్ర విధిని
బలుకఁ బడిన కర్మఁ దెలిసి యవ్విధమున
సలుపఁ దగుదు వీవు శక్రతనయ! 24

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసురసంపద్విభాగయోగోనామ
షోడశోఽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
దైవాసురసంపద్విభాగయోగ మను
షోడశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## శ్రద్ధాత్రయవిభాగయోగము

### సప్తదశాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో|| యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః|
తేషాం నిష్టా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః||

అర్జునుఁ డడుగు చున్నాఁడు.

ఆ.వె. శాస్త్ర విధిని విడచి శ్రద్ధ సంపూర్ణులై
యజనమును బొనర్చు సుజనులైన
వారి నిష్ఠ యెద్ది వచియింపు కృష్ణ! స
త్త్వంబొ, రాజసంబొ, తామసంబొ. 1

శ్రీ భగవా నువాచ

శ్లో|| త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా|
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శ్రుణు||

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. ప్రాణు లెల్లరకు స్వభావ సంజనితమై
శ్రద్ధ సాత్వికంబు, రాజసంబు
తామసంబనంగఁ దనరుఁ ద్రివిధముల
వాని మూఁటి వినుమి పాండవేయ! 2

శ్లో|| సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత|
శ్రద్ధామయోzయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః||

గీ. ప్రాణి కోటికి శ్రద్ధ సత్వాను రూప
ముగ జనించుచు నుండు నీపురుషుఁడగు, మ
హేంద్రతనయ! శ్రద్ధామయుండెవ్వఁ డెట్టి
శ్రద్ధఁ గల వాఁడొ వాఁడట్టి శ్రద్ధఁ బొందు. 3

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥

గీ. దేవతలను బూజింత్రు సాత్త్వికులు, యక్ష
రాక్షసులను బూజింతురు రాజసులు, ధ
రిత్రిఁ దామస జనములు ప్రేతములకు
భూత గణములకును సలుపుదురు పూజ. 4

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥

ఆ.వె. దళితశత్రులోక! దంభ మహంకృతి
గలిగి కామ రాగ బలము లొనరు
జనము లెవ్వ రిచట శాస్త్ర విరుద్ధంబు
లైన ఘోర తపము లాచరింత్రు 5

శ్లో॥ కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామమచేతసః।
మాం చైవాన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్॥

గీ. అర్జునా! దేహ సంస్థంబులైన భూత
వర్గములను మఱియు దదంతర్గతుండ
నైన నన్ను సృక్కించు వారసుర నిశ్చ
యంబుగ లవివేక విహీనులనుచుఁ గనుమి. 6

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు॥

ఆ.వె. అఖిల భూతములకు నాహారమును సైత
మనఘ! త్రివిధములఁ బ్రియంబు సుమ్మి
అతుల వరలు తపము యజ్ఞంబు దానంబు
విను, వచింతు వాని భేదములను. 7

శ్లో|| ఆయుస్సత్త్వబలారోగ్య సుఖ ప్రీతివివర్ధనాః|
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః||

ఆ.వె. ఆయువును బలంబు నారోగ్యమును సుఖ
ప్రీతి సత్వములను బెంచు నవియు
స్నిగ్ధ రస్య హృద్య స్థిరములౌ నాహార
ములు కిరీటి! సాత్వికులకుఁ బ్రియము. 8

శ్లో|| కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః|
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః||

గీ. మిగులఁ బులుపును లవణంబు, మిగుల వేడి
కటువు, తీక్ష్ణ, రూక్ష విదాహకరము లగుచు
వ్యసనమును శోకమును వ్యాధు లొసఁగునవియ
జగతి నాహారములు, రాజస ప్రియములు. 9

శ్లో|| యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్|
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్||

గీ. వండి జామైనవియు, రసవర్జితములు,
చెడ్డ వాసన గలవి, యుచ్ఛిష్టమైన
యవి, యపక్వంబులును, నమేధ్యములు, మఱియుఁ
జలిది యాహారములు, తామస ప్రియములు. 10

శ్లో|| అఫలకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే|
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః||

ఆ.వె. ఫలము నందుఁ గాంక్ష వదలి శాస్త్రము వచి
యించు నటుల యజ్ఞమెది దృఢాత్మఁ
జేయఁదగిన దనుచుఁ జేయంగఁ బడునది
సాత్వికమని గనుమి సవ్యసాచి! 11

శ్లో॥ అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥

ఆ.వె. అర్జునా! ఫలంబు నాశించి దంభంబు
కొఱకు మఱి ప్రతిష్ఠఁ గోరి జగతి
నాచరింపఁ బడెడు యజ్ఞంబు రాజస
యజ్ఞమని తలంపు మాత్మ యందు. 12

శ్లో॥ విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥

గీ. అనఘ! శాస్త్ర విరుద్ధమై యన్నదాన
హీనమై మఱి మంత్ర రహితము నగుచుఁ
దనరి దక్షిణ లేక శ్రద్ధా విహీన
మైన యజ్ఞంబు తామసమని వచింత్రు. 13

శ్లో॥ దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

గీ. దేవతలను గురువుల భూదేవతలను
బ్రాజ్ఞులను బూజ సేయుట బ్రహ్మచర్య
మార్జవము శౌచము నహింస యనఁగనివియ
పలుకఁ బడును శారీర తపంబు లనఁగ. 14

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥

ఆ.వె. ఇతరులకును దుఃఖ మీయని వాక్యంబు
మదికిఁ బ్రియమునైన మాట, సత్య
మాడుటయును వేద మభ్యసించుటయు వా
ఙ్మయమునగు తపంబనంగఁ బడును. 15

శ్లో॥ మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః|
భావసంశుద్ధిరి త్యేతత్తపో మానసముచ్యతే ||

గీ. మనమునకు నిర్మలతయు సౌమ్యత్వ, మర్జు
నా! మనో నిగ్రహంబు, మౌనంబు మఱియు
భావ సంశుద్ధి యనఁగను బరగు నివియ
పలుకఁ బడును మానసిక తపంబు లనుచు. 16

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః|
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ||

ఆ.వె. ఫలము నందుఁ గాంక్ష వదలి యుత్కృష్టమౌ
శ్రద్ధ గలిగి యోగి జనుల వలన
నవని సలుపఁ బడెడు త్రివిధ తపంబుల
సాత్త్వికంబు లనఁగఁ జనుఁ గిరీటి! 17

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్|
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్ ||

గీ. ఆత్మ సత్కార మాన పూజార్థ మెట్టి
తపము చేయంగ బడుచుండు దంభమున, ధ్రు
వంబు గాక చలనమౌ తపంబు రాజ
సం బనుచుఁ జెప్పఁ బడియె నీ శాస్త్ర మందు. 18

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః|
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ||

గీ. పాండవోత్తమ! మూర్ఖపుఁ బట్టుఁ బూని
దనకు దుఃఖంబు గలుగు చుండినను జేయఁ
బడెడు నద్దియు, నన్యవిధ్వంసమునకుఁ
జేయు తపము తామసమని చెప్పఁ బడును. 19

శ్లో|| దాతవ్యమితి యద్దానం దీయతేऽనుపకారిణే|
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్||

ఆ.వె. ఈయఁ దగిన దనుచు నే దానమును దేశ
కాల పాత్ర మెఱిఁగి మేలుఁ దిరిగి
చేయ లేని వాని కీయు నా దానంబు
పార్థ! సాత్వికమని పలుకఁ బడును. 20

శ్లో|| యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః|
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్||

ఆ.వె. ఫలము గోరి యైనఁ బ్రత్యుపకారార్థ
మైనఁ గ్లిష్టముగను దాన మెద్ది
ఫల్గునా! యొసంగఁ బడుచుండు నట్టి దా
నంబు నండ్రు రాజసంబటంచు. 21

శ్లో|| అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే|
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్||

గీ. సవ్యసాచి! యేదాన మసత్కృతంబొ
యెట్టి దాన మవజ్ఞాతమెద్ది దేశ
కాల పాత్రోచితంబును గాక యుండు
నట్టి దానము తామస మనఁగఁ బడును. 22

శ్లో|| ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః|
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా||

గీ. సరవినోమ్మని తత్తని సత్తటంచు
నిటుల మూఁడు విధంబుల నెసఁగు చుండు
బ్రహ్మ నిర్దేశములు వాని వలన మున్ను
విప్రవేదాధ్వరములు గల్పింపఁ బడియె. 23

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్॥

ఆ.వె. కాన బ్రహ్మ వాదులైన మహాత్ములు
వేద విధులు పలుకు వివిధ యజ్ఞ
దానములను మఱియుఁ దపముల "ఓ" మ్మని
తొలుత నుచ్చరించి సలుపు చుంద్రు. 24

శ్లో॥ తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః।
దానక్రియాశ్చవివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః॥

గీ. ఫలము నందలి కాంక్షను వదలి "తత్త"
టంచు మోక్షంబు లోనఁ గాంక్షించు వార
లవని వివిధ దానంబుల యజ్ఞములఁ ద
పంబులను జేయు చుందురు భరతవర్య! 25

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥

ఆ.వె. సాధు భావ మందు సద్భావ మందున
సంప్రయుక్త మగును "సత్" పదంబు
దాన "సత్" పదంబు దగుఁ బ్రయోగింపఁ బ్ర
శస్త కర్మ లందు సవ్యసాచి! 26

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥

ఆ.వె. యజ్ఞమందుఁ దపము నందు దానము నందు
స్థితిని సత్తటంచు జెప్పు చుంద్రు;
కవ్వడీ! తదర్థ కర్మంబు సహితము
సత్తనంగఁ బడును జగతి యందు. 27

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్యనో ఇహ॥

గీ. శ్వేతవాహన! యశ్రద్ధఁ జేయఁ బడిన
దాన హోమము లయినను దప మదైనఁ
బలుక బడును "అసత్త"ని వాని వలన
లేదిహపరముల ఫలంబు లేశమైన. 28

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
శ్రద్ధాత్రయవిభాగయోగోనామ
సప్తదశోऽధ్యాయః

ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
శ్రద్ధాత్రయవిభాగయోగమను
సప్తదశాధ్యాయము.
శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్ శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతామృతము

## మోక్షసన్న్యాసయోగము

### అష్టాదశాధ్యాయము

అర్జున ఉవాచ

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన॥

అర్జునుఁడడుగు చున్నాఁడు.

ఆ.వె. త్యాగతత్త్వ మెద్ది యగునొ, సన్న్యాస త
త్త్వంబదేతెఱంగొ, వాస్తవముగ
వినఁగ వలతు నిపుడు వేర్వేఱఁ బలుకుమి
వాని తత్త్వములను వాసుదేవ! 1

శ్రీ భగవా నువాచ.

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥

శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పు చున్నాఁడు.

గీ. కామ్య కర్మముల్ విడుచుట కవులు కొంద
ఱాడుచుందురు సుమ్మి "సన్న్యాస" మనుచు;
అఖిల కర్మ ఫల త్యాగమైన స్థితినిఁ
బండితులు "త్యాగ" మను పేరఁ బలుకు చుంద్రు. 2

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే॥

గీ. కొందఱు బుధులు దోషంబుఁ గూర్చు కర్మ
లన్ని విడువఁగా దగినవి యని వచింత్రు;
అంద్రు మఱియుఁ గొందఱు తపో యజ్ఞ దాన
ముఖ్య కర్మలు విడువఁగాఁ బోలవనుచు. 3

శ్లో॥ నిశ్చయం శ్రుణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః॥

ఆ.వె. నిత్యవిజయశీల! యీ త్యాగ విషయంబు
నందు నాదు నిశ్చయంబు గనుమి;
తెలుపఁ బడియె మూఁడు తెఱఁగులఁ ద్యాగంబు
సత్త్వ రాజస తమసంబు లనఁగ. 4

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥

గీ. యజ్ఞ దాన తపో రూపమైన కర్మ
లుడుఁగగా రాదు చేయుచు నుండవలయు
యజ్ఞ దాన తపః కర్మ లనఘచరిత!
పావనులఁ జేయు చుండును బండితులను. 5

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్॥

ఆ.వె. ఇట్టి త్రివిధ కర్మ లేనియుఁ దత్కర్మ
ఫలము లందు సక్తి వదలి చేయఁ
దగును; ఇదియ నిశ్చితంబు నుత్తమమైన
నా తలంపు దేవనాధతనయ! 6

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః॥

ఆ.వె. మాననీయ! నియతమైన కర్మంబుల
విడిచి వేయుటకును వీలు లేదు;
మోహ బుద్ధిఁ గర్మమును ద్యజియించుట
తామసాత్మకమగు త్యాగ మగును. 7

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥

గీ. కవ్వడీ! యెవ్వఁడు శరీర కష్ట భీతిఁ
గర్మమేది విడచు దుఃఖకర మటంచు,
నతఁడు రాజసత్యాగము నాచరించు;
దానఁ ద్యాగ ఫలంబును గాన లేఁడు. 9

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।
సంఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః॥

ఆ.వె. క్రమచరిత! నియత కర్మమందాసక్తి
ఫలము నందుఁ గాంక్ష వదలి "యిద్ది
చేయఁదగిన దనుచుఁ" జేయంగఁ బడెనేని
నదియె సాత్వికమగు త్యాగ మగును. 10

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥

గీ. త్యాగియును, సాత్వీక గుణ సమా వృతుండు
నైన మేధావి గత సంశయాత్ముఁ డగుట,
నశుభ మొసఁగు కర్మల ద్వేష మందఁ బోడు
గాంచఁడాసక్తి శుభమిడు కర్మలందు. 11

శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్య శేషతః।
యస్తు కర్యఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥

ఆ.వె. అనఘ! దేహధారి యగు మానవున కెల్ల
కర్మములను వదలఁగాదు గానఁ
గర్మ ఫలము నందుఁ గాంక్షను విడనాడు
వాఁడు త్యాగి యనుచుఁ బలుకఁ బడును. 11

శ్లో|| అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ |
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ||

గీ. చను ననిష్టంబు, నిష్ట మిశ్రంబు లనఁగ
కర్మల ఫలంబు మూఁడు మార్గముల; కలుగు
నద్ది త్యాగహీనునకు జన్మాంతరంబు
నందు; సన్యాసులకుఁ గల్గ దెందు నేని. 12

శ్లో|| పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే |
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ||

ఆ.వె. సకల కర్మ సిద్ధి సమకూర సిద్ధాంత
మందు సాంఖ్యశాస్త్ర మందు, శ్వేత
వాహ! పలుకఁ బడిన వాని కారణముల
నైదుఁ బలుకు వాఁడ నాలకింపు. 13

శ్లో|| అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ |
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్ ||

ఆ.వె. దివిజలోకవంద్య! దేహంబుఁ, గర్తయు,
వివిధ కరణములును, వివిధ చేష్ట
లనెడి నాల్గు, నందు నైదవదైన దై
వంబు బంచ కారణంబు లగును. 14

శ్లో|| శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః |
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ||

గీ. మానవుఁడు, శరీరము, వాక్కు, మనము ననెడి
వానిచేఁ గర్మమును న్యాయమేని, లేక
పార్థ! యన్యాయమేని నుపక్రమింపఁ
గడఁగు నద్దాని కవియైదుఁ గారణములు. 15

శ్లో॥ తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥

ఆ.వె. అది యటుండఁ, గర్మమందు నే మనుజుండు
తానె కర్త ననెడి తలఁపుఁ గనునొ,
యకృతబుద్ధి, కుమతి, యౌనతఁ డాత్మత
త్త్వంబు నెఱుఁగ లేడు పాండవేయ! 16

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాऽపి స ఇమాన్‌లోకాన్న హన్తి న నిబధ్యతే॥

గీ. ఎట్టి వాని కహంకృతి హృదిని లేదొ,
యేనరుని బుద్ధి సంగ విహీన మగునొ,
వాఁడు సంహరించిన నిట్టి ప్రాణికోటిఁ,
జంపని యతండె, దాన బంధింపఁ బడడు. 17

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥

గీ. జ్ఞానమును జ్ఞేయమును బరిజ్ఞాన మనఁగఁ
గర్మ విధులు త్రివిధములు గలిగి యుండు;
కరణమని, కర్మమనియును, గర్త యనఁగఁ
జనును ముత్తెఱఁగులఁ గర్మ సంగ్రహంబు. 18

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥

ఆ.వె. సాంఖ్య శాస్త్రమందు జ్ఞానంబుఁ గర్మంబుఁ
గర్త యనఁగఁ ద్రివిధ గతుల విజయ!
పలుకఁ బడియె గుణ విభాగంబునంజేసి
విను యథావిధిగను వీని నిపుడు 19

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥

గీ. జ్ఞానమెద్దాని చేత భిన్నంబు లైన
ప్రాణులందెల్ల నవిభక్తమగుచు, నవ్య
యంబు, నేకంబునైన భావంబుఁ గనునొ,
యట్టి జ్ఞానము సాత్త్విక మనఁగ బడును. 20

శ్లో॥ పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానా భావాన్ పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥

ఆ.వె. పెక్కు విధములైన పెక్కు భావంబుల,
జ్ఞాన మెట్టిదాన సకల ప్రాణు
లందుఁ బలు విధముల నరయఁగఁ జాలు, నా
జ్ఞాన, మనఘ! రాజసముగఁ గనుమి. 21

శ్లో॥ యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్త మహైతుకమ్।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥

గీ. జ్ఞానమెది యేక కార్య సక్తంబుఁ గాఁగ
నెల్లెడల నున్నదని యెంచి; హేతు హీన
మగుచుఁ దత్త్వార్థ శూన్యమై, స్వల్పమైన,
దానిఁ బండితుల్ తామస జ్ఞాన మంద్రు. 22

శ్లో॥ నియతం సఙ్గరహితమరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥

ఆ.వె. నియత కర్మమెది విజయ! సంగమము ఫలా
పేక్ష సర్వముడిగి ద్వేష రాగ
వర్జిత మయి సలుపఁ బడునొ, యద్దానిని
సాత్త్వికమని యంద్రు శాస్త్రవిదులు. 23

శ్లో|| యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః|
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ ||

గీ. కర్మ మెద్దాని, ఫలకాంక్షఁ గలుగు వాఁడొ,
లేని యెడల సాహంకార మానసుండొ,
బహు ప్రయాసంబుతోఁ జేయుఁ బాండవేయ!
దాని రాజసంబని యంద్రు తత్త్వవిదులు. 24

శ్లో|| అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్|
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే||

ఆ.వె. క్షయము హింస పౌరుషంబను బంధము
ననెడి వీని స్వాంతమందుఁ గనక,
యవనిఁ గర్మమొండు నజ్ఞానమునఁ జేయుఁ
దామసాత్మికమని దాని నంద్రు. 25

శ్లో|| ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః|
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే||

గీ. అనఘ! ముక్తసంగుఁడు, విగతాభిమాని
ధైర్య ముత్సాహమును గల్గి తనరు వాఁడు
సిద్ధ్యసిద్ధులఁ గలతను జెంద కుండు
నతఁడు సాత్వికుఁడగు కర్త యనఁగఁ బడును. 26

శ్లో|| రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః|
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః||

గీ. పార్థ! యనురాగియును, గర్మ ఫలముఁ గోరు
నతఁడు, లుబ్ధుఁడు మఱియు హింసాత్మకుండు,
నశుచి యగు వాఁడు, హర్షశోకాన్వితుండు
నైన కర్త రాజసకర్త యనఁగఁ బడును. 27

శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధశ్శఠో నైష్కృతికోऽలసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥

గీ. ప్రాకృతుండు నయుక్తుండు పరమ శఠుఁడు
పాండవా! నైకృతికుఁ డలసుండు, దీర్ఘ
సూత్రియును, జడప్రాయుఁడు శోకపరుఁడు
నైన కర్త తామస కర్త యనఁగఁబడును. 28

శ్లో॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ॥

ఆ.వె. విజయ! సాంతముగను వేర్వేఱుఁగా బల్కఁ
బడు గుణములఁ బట్టి పరగుచున్న
బుద్ధి ధృతినిఁ గల్గు మూఁడు విధంబులౌ
భేదముల వచింతు వినుమి వాని. 29

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥

ఆ.వె. ఎట్టిబుద్ధి, కలప్రవృత్తి, నివృత్తి కృ
త్యంబకృత్యముల భయాభయముల
బంధమోక్షములను బాగుగా నెఱుఁగునో
సవ్యసాచి! యదియె సత్త్వ బుద్ధి. 30

శ్లో॥ యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసీ॥

ఆ.వె. బుద్ధి యెద్ది ధర్మమును నధర్మంబును
గార్యమును మఱియు నకార్యమును య
థార్థ రీతిఁగాని యట్టులఁ దెలియు, నా
బుద్ధి రాజసమగుఁ బుణ్యశీల! 31

శ్లో|| అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాzzవృతా|
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ||

ఆ.వె. బుద్ధి యెద్ది ధర్మముగ నధర్మంబుఁ బ
దార్థముల సమస్తమటు విరుద్ధ
ముగను గనునొ తమసమునఁ గప్పఁబడి, యది
తామసమగు బుద్ధి, ధన్యచరిత! 32

శ్లో|| ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః|
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ||

గీ. యోగ సంసిద్ధి యందు విచ్యుతము గాని
యెట్టి ధృతిచే మనంబుఁ బ్రాణేంద్రియ క్రి
యలను నిలువంగ బెట్టునో యట్టి ధృతిని
సాత్త్వికంబనఁ జెల్లును సవ్యసాచి! 33

శ్లో|| యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేz ర్జున|
ప్రసఙ్గేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ||

ఆ.వె. ఎట్టి ధృతి వహించి యింద్రతనూజ! ధ
ర్మార్థ కామముల సమాచరించు
ఫలమునం దపేక్ష గలిగి సంసక్తిచే,
నద్ది రాజస ధృతి యనఁగ బడును. 34

శ్లో|| యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ|
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ||

ఆ.వె. పార్థ! యెట్టి ధృతిని, స్వప్నంబు మఱి విషా
దంబు శోకమును భయంబు మదము
విడువఁ జాలకుండుఁ జెడు బుద్ధిగల నరుం
డదియ తామస ధృతి యనఁగ నగును. 35

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥

ఆ.వె. దుఃఖ మెట్టి దానఁ దొలఁగు, నానంద మే
యభ్యసనము వలన లభ్య మగునొ,
అర్జునా! త్రివిధమునైన సుఖంబు వ
చింపు వాఁడ నాలకింపు మిపుడు. 36

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధి ప్రసాదజమ్॥

ఆ.వె. తొలుదొలుత విషంబు వలె నుండి యెయ్యది
తుదకు నమృతమునకుఁ దుల్య మగునొ,
పుణ్య! యట్టి యాత్మ బుద్ధి ప్రసాద సం
జనితమౌ సుఖంబు సాత్వికంబు. 37

శ్లో॥ విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥

ఆ.వె. ఎట్టి సౌఖ్యము విషయేంద్రియ సంయోగ
మునను మొదట నమృతమునకుఁ దుల్య
మై విషంబు పగిది నంతంబునం దోచు
నద్ది రాజస సుఖ మనఁగఁ బడును. 38

శ్లో॥ యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥

ఆ.వె. ఆది నంత్య మందు నాత్మకు మోహంబు
నేది కలుగఁ జేయు, నింద్రజా! ప్ర
మాదమునను నిద్ర మఱి యలసతఁ గూర్చు
నదియె తామస సుఖ మనఁగఁ జెల్లు. 39

శ్లో|| న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః|
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః||

ఆ.వె. సవ్యసాచి! ప్రకృతి జనితమై యీగుణ
త్రయము విడుచు జీవి ధారుణీ త
లంబు నందునేన్ దివంబు నందేనియు
దివిజు లందు గాని యెవఁడు లేఁడు. 40

శ్లో|| బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తపః|
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణై! ||

ఆ.వె. బ్రాహ్మణులకు రాజ వైశ్య శూద్రులకును
బార్థ! కర్మములు స్వభావ సంభ
వంబులై వెలయు గుణంబులచే విభ
జింపఁ బడియె వానిఁ జెప్పు వాఁడ. 41

శ్లో|| శమోదమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ|
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్||

ఆ.వె. శమము దమము తపము శౌచ విజ్ఞానముల్
జ్ఞాన మార్జవంబు క్షమయు, మఱి, సు
రాధినాథతనయ! యాస్తిక్యము స్వభావ
జనిత కర్మములగు క్ష్మాసురులకు. 42

శ్లో|| శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్|
దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజమ్||

ఆ.వె. శౌర్య తేజములును ధైర్యంబు, దక్షత,
యుద్ధమందు మఱలకుంట, యీవి,
యీశ్వరత్వ మనఁగ నివి ఫల్గున! స్వభావ
జనిత కర్మములగు క్షత్రియులకు. 43

శ్లో|| కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్ |
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ||

గీ. వర్తకము, కృషి, గోరక్ష, వైశ్యులకు, స్వ
భావ జనిత కర్మములగుఁ బాండవేయ!
ఎలమిఁ బరిచర్యఁ జేయుటయే స్వభావ
జన్య కర్మం బగును, బాద సంభవులకు. 44

శ్లో|| స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః |
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ||

ఆ.వె. కవ్వడీ? తమ తమ కర్మలందాశక్తి
నొందు నరులు సిద్ధిఁ బొందు చుండ్రు
స్వీయ కర్మ నిరతుఁడై యెట్లు సంసిద్ధిఁ
బడయునో నరుండు పార్థ! వినుము. 45

శ్లో|| యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ |
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ||

ఆ.వె. ఎల్ల భూతములను నెవ్వాఁడు సృజియించు
నెవని చేత నిద్ది యెల్ల నిండు
వాని, మానవాళి స్వస్వకర్మంబులఁ
బూజ సలిపి సిద్ధిఁ బొందు చుండ్రు. 46

శ్లో|| శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ |
స్వభావనియతం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ||

ఆ.వె. ధర, స్వనుష్ఠిత పరధర్మంబు కంటెను
విగుణమైన మేలు స్వీయధర్మ
మటు స్వభావ నియతమైన కర్మముఁ జేయు
వాఁడు కిల్బిషంబుఁ బడయఁ డెపుడు. 47

శ్లో॥ సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥

గీ. అర్జునా ! దోష యుక్తములౌనుగాక
సహజ కర్మముల్ విడువఁగా జనదు, సకల
కర్మములు దోషముల చేతఁ గప్పఁ బడియె
వహ్ని ధూమంబుచేఁ గప్పఁ బడిన యటుల. 48

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥

గీ. దేని యందును సంగము లేని బుద్ధి
నొంది, విజితాత్ముఁడై నిస్పృహుండునైన
జ్ఞాని, సన్యాసమునను నైష్కర్మ్యఁసిద్ధిఁ
బొందు చున్నాఁడు పాండుభూభుజ తనూజ! 49

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాzzప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా॥

గీ. శ్వేతవాహన! నైష్కర్మ్య సిద్ధిఁ బొంది
బ్రహ్మమును నెట్లు మనుజుండు, వడయఁ గలఁడొ
దాని సంగ్రహముగఁ బల్కు దేను వినుమి;
అదియె జ్ఞానమం దుత్తమమైన నిష్ఠ. 50

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాzzత్మానం నియమ్యచ।
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ॥

ఆ.వె. ఆధిక శుద్ధ బుద్ధియై, ధైర్యమున, నియ
తాత్ముఁడగుచు శబ్దమాదియైన
విషయములఁ ద్యజించి ద్వేష రాగంబుల
వీడనాడి పాండవేయమధ్య! 51

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః|
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః||

గీ. పొంది విజన స్థలము, లఘు భుక్తిఁ గలిగి
మనసు, వాక్కాయముల నియమమున నిలిపి
ధ్యాన యోగపరుండునై, యన్ని వేళ
లందు వైరాగ్యమును సముపాశ్రయించి. 52

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్|
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే||

ఆ.వె. కావరంబు, బలము, కామంబు మఱియుఁ గ్రో
ధము పరిగ్రహంబు దర్ప ముడిగి
మమత లెల్ల విడిచి మది శాంతిఁ గను వాఁడు
బ్రహ్మభావమొంద బాత్రుఁ డగును. 53

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి|
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్||

ఆ.వె. బ్రహ్మభూతుఁడైన వాఁడు ప్రసన్నాత్మ
కోరఁడెద్ది, లేమిఁ గుందఁ డెందు
సముఁడు నగుచుఁ బార్థ! సర్వభూతము లందుఁ
బడయు చుండు నాదు పరమ భక్తి. 54

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః|
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్||

ఆ.వె. ఏ నెవండనొ మఱి యెంతటి వాఁడనో
యరయు భక్తిచే యథార్థ రీతి;
అటుల వాడునన్ యధార్థంబుగాఁ గని
పిదప నన్నె పొందు విమలచరిత! 55

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః|
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్||

ఆ.వె. ఆశ్రయించి సతత మాధారముగ నన్ను,
సర్వ కర్మములను సలుపు మనుజుఁ
డవ్యయంబు నిత్యమైన మోక్ష పదంబుఁ
బొందు మత్ప్రసాదమునను విజయ! 56

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ॥

ఆ.వె. సర్వ కర్మములను సమ్మతి నిలుపు నా
యందు, మత్పరుండ వగుచు నాశ్ర
యింపు బుద్ధియోగ మెల్లకాలంబు నా
యంద మనసుఁ జేర్పు మనఘచరిత! 57

శ్లో॥ మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథ చేత్త్వమహఙ్కారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి॥

గీ. నీదు చిత్తంబు నా యందు నిలిపి తేని
సర్వ దుఃఖంబులను మత్ప్రసాద గరిమఁ
గడచెదవు, లేనిచో నహంకారమునను
నాదు పలుకులు వినవేని నాశ మగుదు. 58

శ్లో॥ యద్యహఙ్కారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥

గీ. అర్జునా! యహంకారము నాశ్రయించి
యుద్ధ మొనరింపనని యెంచు చుంటి వేని
వ్యర్థమౌ నీదు వ్యవసాయమంత, యిపుడు
ప్రకృతియే నియోగించు నిన్ రణమునకును. 59

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్॥

ఆ.వె. తెలివి లేమి నీవు దేనినిఁ జేయఁగాఁ
దలఁపవో మనమున దానినే స్వ
భావ జనిత కర్మ బద్ధుండవై, పర
వశతఁ జేతు వీవు పాండవేయ! 60

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేzర్జున తిష్ఠతి।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥

ఆ.వె. యంత్ర మందు నున్న యంత్ర చోదకునట్టు
లీ సమస్త భూత హృదయములను
నిలచి యీశ్వరుండు నిజమాయచేఁ బ్రాణు
లను భ్రమింపఁ జేయు ననఘచరిత! 61

శ్లో॥ త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

గీ. అట్టి యీశ్వరుండగు వాని నన్ని మార్గ
ములను శరణంబుఁ బొందుమి, యలఘువీర్య!
అతని యనుగ్రహమున నిత్యమగు మోక్ష
పదము శ్రేష్ఠమౌ శాంతినిఁ బడయఁ గలవు. 62

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥

గీ. ఏను బల్కితి నీకునై యివ్విధమున
గోప్యముల యందు మిక్కిలి గోప్యమైన
జ్ఞాన మెల్ల; దీనిని సమగ్రముగ నరసి
సలుపుమీ నీ యభీష్టానుసారముగను. 63

శ్లో॥ సర్వగుహ్యతమం భూయశ్శృణు మే పరమం వచః।
ఇష్టోzసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥

ఆ.వె. సవ్యసాచి! మఱల సర్వ గుహ్య తమంబు
నైన నాదు వచన మాలకింపు
మీవు నాకు మిగుల నిష్టుండవై యుండు
కతనఁ జెప్పు వాఁడ హితము నీకు. 64

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥

ఆ.వె. నాదు భక్తి గలిగి నా యందు మది నిల్పి
నను నమస్కరింపు నను యజింపు
నన్నె పొందఁ గలవు నాకుఁ బ్రియుండవై
తివి, యథార్థ మిది ప్రతిజ్ఞఁ జేతు. 65

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

ఆ.వె. అఖిల ధర్మములను త్యజియించి నను మాత్ర
మీవు శరణు గనుమి, యేను నిన్ను
బాండవేయ! సకల పాప విముక్తుఁ గా
వింతు నిజము; విడుము వంత లెల్ల. 66

శ్లో॥ ఇదం తే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన।
న చాఽశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

ఆ.వె. తప మెఱుఁగక, భక్తి తలఁపును గనక, శు
శ్రూష లేక నన్నసూయ బుద్ధిఁ
గనెడి మానవునకుఁ గవ్వడీ! యీ శాస్త్ర
మెప్పుడేనిఁ గాని జెప్పఁ దగదు, 67

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥

ఆ.వె. పాండవేయ! యిట్టి పరమ గోప్యంబు, నా
భక్త జనములకు నెవాఁడు దెలుపు
వాఁడు పరమ భక్తి వడసి నాయందు, ని
స్సందియముగ నన్నె పొందు చుండు. 68

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి॥

ఆ.వె. అతని కంటె మనుజులందు నాకుఁ బ్రియంబుఁ
గలుగం జేయు వాఁడొకండు లేడు;
వీని కంటె నాకుఁ బ్రియతరుండిఁక మీఁద
గలుగఁ బోఁడు మఱి యొకండు విజయ! 69

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః॥

ఆ.వె. అవని ధర్మ సహితమగు మన యుభయ సం
వాదమును పఠించు వాఁడు ప్రీతి
జ్ఞాన యజ్ఞమునను నన్ను బూజించుచు
న్నాఁడటంచుఁ దలఁతు నయచరిత్ర! 70

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః।
సోఽపిముక్తశ్శుభాన్లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥

ఆ.వె. ఎవఁడసూయ నుడిగి యీ శాస్త్రమును జాల
శ్రద్ధ నూని వినఁగఁజాలు, వాఁడు
రవ్వడీ! విముక్తిఁ గని పుణ్యకర్ములు
పొందెడు శుభలోకములను బొందు. 71

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రనష్టస్తే ధనఞ్జయ॥

గీ. శ్వేతవాహన! నేనిప్డు చెప్పి యున్న
యతి రహస్య శాస్త్రంబు నేకాగ్రచిత్త
మునను వింటివే! యజ్ఞాన జనితమైన
మోహమంతయు నశియించి పోయె నొక్కొ! 72

అర్జున ఉవాచ

శ్లో॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।
స్థితోఽస్మి గత సన్దేహః కరిష్యే వచనం తవ॥

అర్జునుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. నీ యనుగ్రహమున నెఱి నశియించె నా
మోహ మెల్ల, స్మృతిని బొందినాఁడ;
సమసి పోయె సకల సందేహములు, నీవు
చెప్పినట్లు కృష్ణ! చేయ నుంటి. 73

సఞ్జయ ఉవాచ

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాదమిమమశ్రోష మద్భుతం రోమహర్షణమ్॥

సంజయుఁడు చెప్పు చున్నాఁడు.

ఆ.వె. అవనినాథతిలక! యాశ్చర్యమును గగు
ర్పాటుఁ గలుగఁ జేయు పావనమగు
నీ మహాత్ములైన కృష్ణ విజయుల సం
వాద మెల్ల విన్నవాఁడ నేను. 74

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానేతద్గుహ్యతమం పరమ్।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥

గీ. వ్యాసుని యనుగ్రహమున నే నతిరహస్య
మైన పరమ యోగంబు, స్వయంబుగా వ
చించు యోగేశ్వరేశుఁడౌ కృష్ణు వలన
విన్నవాఁడ నింతయుఁ గురువీరవర్య! 75

శ్లో॥ రాజన్ సంస్మృత్యసంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥

గీ. అద్భుతంబును బావనం బనఁగ వరలు
వాసుదేవ ఫల్గునుల సంవాద మేను
మదిని స్మరియించి స్మరియించి మాటి మాటి
కందు చున్నాఁడ సంతోష మవనినాథ! 76

శ్లో|| తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః|
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః||

గీ. అవనిపాల! యత్యద్భుతమై వెలుంగు
వాసుదేవుని విశ్వరూపంబు నాడు
మదిని స్మరియించి స్మరియించి మఱల మఱల
సమిత విస్మయమును ముదమందు చుంటి. 77

శ్లో|| యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః|
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ||

గీ. ఎచట యోగేశ్వరుండైన కృష్ణుఁడుండు
నెట ధనుర్ధారియౌ పార్థుఁ డెసఁగు చుండు,
నచట శ్రీయును, భూతి, జయంబు, నీతి,
నిశ్చయముగఁ గల్గు నటంచు నేఁ దలంతు. 78

ఇతి శ్రీమహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం శ్రీ భీష్మపర్వణి శ్రీభగవద్గీతా
సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోऽధ్యాయః
శ్రీకృష్ణార్పణమస్తు.
ఇది శ్రీ రాధాకృష్ణ భక్తి విచిత్ర భారద్వాజసగోత్రాప
స్తంబసూత్ర బాపట్ల వంశపవిత్ర వీరయామాత్య
పుత్త్ర భక్త కవివిధేయ హనుమంతనామధేయ
ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతామృతయోగ
శాస్త్రంబను పద్యకావ్యంబున
మోక్షసన్న్యాసయోగమను
అష్టాదశాధ్యాయము.
సర్వము సమాప్తము.
ఓమ్ తత్సత్ శ్రీకృష్ణపరబ్రహ్మార్పణమస్తు.





ఓమ్ శ్రీసాయినాథాయ నమః



1973 నుండి ఆధ్యాత్మికాభివృద్ధికి, శ్రీ సాయిబాబా తత్త్వప్రచారమునకు తోడ్పడుచున్న

## శ్రీసాయీ నిలయ ప్రచురణలు

రు 600-00 విలువగల పుస్తకములు ఉచితము - త్వరపడుడు.

శ్రీశ్రీశ్రీ H.H.B V నరసింహస్వామి (Founder A I.S.S , Madras) గారి ప్రియశిష్యులు. శ్రీ సాయి సారస్వత వాచస్పతి - శ్రీ షిర్డీ సంస్థాన ఆస్థాన ఆంధ్ర విద్వాంస - ఉభయ భాషాప్రవీణ - శ్రీ సాయి భక్త శిఖామణి బిరుదాంకితులు.

## కీ.శే.శ్రీ బాపట్ల హనుమంతరావుగారి రచనలు

**ఏమి! నిన్నుపేక్షింతునా?** ఇవి రెండు భాగములు

1 ప్రథమ భాగము: 18 ప్రకరణములు. 440 పుటలు, డెమీ .... రు. 80/-

2. ద్వితీయ భాగము: 32 ప్రకరణములు 584 పుటలు, డెమీ ... రు. 98/-

3. శ్రీభగవద్గీతామృతము ........................................ ... .. రు. 53/-

4 శ్రీ సాయి కరుణ: 246 పుటలు, డెమీ ................. ........ రు. 62/-

5. శ్రీ సాయీనాథ బోధామృతము: 643 సూక్తులు...... ..... ...... రు. 53/-

6. శ్రీ సాయిబాబా పూజాస్తవములు: 136 పుటలు, క్రౌను .. ....... రు.17/-

7 ప్రేమామృతము (నారదభక్తి సూత్రములు - వ్యాఖ్య) ..... .... రు. 80 00

8 శ్రీలక్ష్మీనారాయణ స్తోత్రమంజరి ........................................ రు. 26 00

9. శ్రీ సాయి బాబాకూడా దేవుడేనా (సందేహనివృత్తి) ....... ....... రు. 25.00

10 నా సాయి (షిర్డీ సాయి-సత్యసాయి ప్రభువుల అభేదస్తుతి) .... రు 26.00

11. శ్రీ రామతీర్థుని నీతి కథలు .................... రు 5 00

12 శ్రీ సాయిబాబా ఏకాదశ సూక్తులు .................... రు 5 00

13 శ్రీ సాయి సద్గురూ! చాలీసా .................... రు.2 00

14 శ్రీ ఆదిత్యహృదయము .................... రు. 2.00

15 శ్రీ సాయిదేవ శతకము .................... రు. 5 00

16 శ్రీ రామా! ఆపదుద్ధారకా! రామకథ .................... రు. 10 00

17. శ్రీ సాయీ హనుమసారథి భావ సంగ్రహము 2 భాగములు ... రు 13 00

18 శ్రీ సాయీ కవచము(శ్రీ మూలా పేరన్న శాస్త్రి గారి రచన) . ... రు. 2 00

19 శ్రీ సాయినాథస్తుతి .................... రు. 3 00

20 శ్రీ దాసగణూ విరచిత స్తవనమంజరి ( ప్రచురణకర్త పద్యానువాదము) రు. 8 00

21 శ్రీ పుండరీక చరిత్రము .................... రు. 17 00

22 శ్రీ సాయినాథ స్తోత్రము .................... రు. 3.00

23. శ్రీ సాయి కల్పద్రుమ శతకము .................... రు. 5.00

24 శ్రీరామ రక్షాస్తోత్రము ( శ్రీమూలా వారి పద్యానువాదము) ....... రు. 2.00

25 సరసవినోదిని .................... రు. 15.00

26 శ్రీ అమృతవాణి (శ్రీమూలావారి రచన) . ... ......... ......... రు. 2 00

త్వరలో, శ్రీసాయీ హనుమసారథి భావ సంగ్రహము-3 ముద్రణమగును. శాశ్వత పోషకులుగా చేరి మీ పేరు ప్రకటించుకొను సదవకాశమును వినియోగించు కొనుడు

## మహారాజ పోషక సభ్యత్వము: .................... రు. 1016.00

మీ వంశ వర్ణన - మీరు కోరిన వారి చిత్తరువు (Art Paper మీద) మీ విరాళము వినియోగించు పుస్తకములు 5 ఉచితము.

**రాజ పోషక సభ్యత్వము:** **రు.503.00**

మీరు కోరిన చిత్తరువు, మీ విరాళము ప్రకటన ఇవి 2 పుస్తకములు ఉచితము.

**జీవిత సభ్యత్వము:** **రు. 350.00**

1 మీ విరాళములను స్వీకరించగానే మీరు, శాశ్వత (మహారాజపోషక, రాజపోషక, జీవిత) సభ్యత్వ గుర్తింపు పత్రము, 26 పుస్తకములు పొందగలరు.

2. మీ విరాళమును ప్రకటించు పుస్తకము, తదుపరి విడుదల అగు ప్రతి క్రొత్త పుస్తకము ఒక ప్రతి మీకు ఉచితము.

3. సాధారణ పోషకుల పేర్లు ప్రకటించి విరాళమునకు సరిపడు పుస్తకములు పంపబడును.

4 రుసుం, మనియార్డరు లేక Andhra Bank, Jammulapalem Branch, or State Bank of India, Bapatla Branch మీద, ప్రచురణకర్త పేర D.D A/c Payee గా పంపవలెను.

5. V.P P పద్ధతిలేదు.

6 చెక్కులు స్వీకరించబడవు.

7 తపాలాఖర్చులు అదనము. రు. 50 00

8. చిరునామా మార్పులను తెలుపవలెను.

9. పుస్తకములు చేరినట్లు కార్డు, ప్రతిలేఖలో మీ గుర్తింపు నెంబరు. తప్పక వ్రాయవలెను.

10. మీ పరిచయులను సభ్యులుగ చేర్చి, ప్రచార యజ్ఞములో పాల్గొనండి!


ఇట్లు,

**బాపట్ల వేంకట పార్ధసారధి**

శ్రీసాయి నిలయమ్

చెరువు జమ్ములపాలెం (పోస్టు)

గుంటూరు జిల్లా - **522113**


తేది: 17-6-2001


Ph 08643-50165

రచయిత:

కీ.శే. శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు



గురుడవు నీవే! సాయీ
పరమాత్ముడ వీవె నాకు; పావనమౌ నీ
చరణంబులె శరణంబని
ధర నమ్మి కొలుతు గృపఁగను తండ్రీ! హనుమా!!

(ప్రచురణ కర్త)

# శ్రీమద్భగవద్గీతామృతము

(మూలము - తెనుఁగు పద్యము)



రచయత:

కీ.శే. శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు

ప్రచురణకర్త:

శ్రీ బాపట్ల వేంకట పార్థసారథి

స్వస్తిశ్రీ వృష-భాద్రపద శుద్ధ ద్వాదశి,
గురువారము,(శ్రీ వామన జయంతి, 30-8-2001)
రచయితగారి శత జన్మదిన మహోత్సవ కానుకగా ఆవిష్కరణము.